# ( ఆంధ్ర - దశకుమారచరితము. )



వేదము - వేంకటరాయశాస్త్రి

విరచితము.



స్వకీయ

జ్యోతిష్మతీముద్రాక్షరశాలయందు

ముద్రితము.



మదరాసు

**All Rights Reserved.**

**1912.**

*Price Rs. 1—0—0.*

# అవతారిక.

---

మహాకవి కేతన రచించిన దశకుమారచరిత్రము పద్యకావ్యము శ్రీ వేంకటగిరి మహారాజావారి యానతిమేరకు శ్రీ సంజీవరాయశాస్త్రులు వారు రచించిన గద్యప్రబంధము గద్యమ యయినను ప్రౌఢమై కావ్యాస్వాద్యముగా నున్నది. శ్రీ చదలవాడ సీతారామశాస్త్రులవారు రచించినట్టిది మూలములో యించుక భాగమునకే.

నాముద్రించిన సంస్కృతదశకుమారచరితమును పఠించిన వారు పలువురు విద్యార్థిజనోపయోగార్థమై ఆంధ్రానువాదసమేతముగా ముద్రింపుమని నన్ను హెచ్చరించిరి. దానంజేసి మూలము సుబోధమగునట్లుగా ఈ యాంధ్ర దశకుమారచరితమును రచించితిని. ఇందు వాక్యరచనయందు ఆంధ్రమర్యాదార్థము కలసినంతకన్న ఎక్కుడు స్వాతంత్ర్యము వహింప లేదు. ఇది ప్రత్యేకముగా నొకయాంధ్రగద్యప్రబంధముగా నుపయోగపడునట్లును రచిత మయినది.

మూలములో అపహారవర్మచరితములో దండ్యాచార్యుడు అత్యంతదుశ్చరిత్రమును తన్నాయకునియందు నిబంధించినాడు. ఆ మహాపాతకము చేయకయే ఈప్సితసిద్ధి యగునట్లుగా ఇందు చిఱుతుకమార్పులు చేయబడినవి.

---

# భూమిక.

---

దండ్యాచార్యుఁడు కథాసరిత్సాగరమును ఇందు విశేషముగా అవలంబించినాఁడు. ఈ కథ యొక్క ప్రణాళిక అందలి మృగాంకదత్తచరిత్రప్రణాళికం బోలి యున్నది. అందలి కథలే అనేకములు ఇందు నామమాత్రభేదాదికముతో కైకొనంబడినవి:—

| దశకుమారచరిత. | కథాసరిత్సాగరము. |
| --- | --- |
| ఉపహారవర్మచరితము. | అజరునికథ లం. 7. త. 6. |
| ప్రమతిచరితము. | బేతాళకథ. 15 - వది. |
| మిత్రగుప్త చరితమందు | |
| ధూమినికథ. | బోధిసత్వాంశకథ లం. 10. త. 9. |
| నితంబవతికథ. | బేతాళకథ మొదటిది. |
| మంత్రగుప్త చరితము. | అజరకథ. లం. 7. త. 6. |

ఉత్తరపీఠిక దండిప్రణీతము గాదు, మూలగ్రంథమందు దండ్యాచార్యులయొక్క సర్వంకష పాండిత్యంబును సమగ్ర మయిన లోకవృత్తానుభవంబును స్ఫుటములు. దీనిని కథాసరిత్సాగర సారగుళిక యని చెప్పనొప్పును. దండి గ్రంథములో విసిగించు వర్ణనలు గాని పీడాకరము లయిన శ్లేషలు గాని లేవు.

ఇందు కోడిపందెము కందుకక్రీడ రాజనీతిసారమును వర్ణితములు. ఇందును శాక్య పరివ్రాజికలు కథాసరిత్సాగరమందుంబోలె కామదూతికలుగా నుపకరింతురు. యవనులు వర్తకము చేయుదురు, ఓడలు నడుపుదురు. ద్విజులయందు అనులోమవివాహములును సముద్రయానంబును సుప్రసిద్ధములు. చాణక్యచంద్రగుప్త కామందక ప్రస్తావము కలదు.

దండ్యాచార్యులు క్రీ. శ. 7 వ శతాబ్దియం దుండె నని చరిత్రకారులమతము.

అతని గ్రంథాంతరము కావ్యాదర్శము ఒకటి కలదు. మల్లికామారుతకారుఁడు ఈతఁడు కాఁడు.

వేదము వెంకటరాయశాస్త్రి.

జూలై, 1912.

శ్రీ

# ఆంధ్ర - దశకుమార చరితము.

## ప్రథమోచ్ఛ్వాసము.

### పూర్వపీఠిక.

### కుమారోత్పత్తి.

సీ. బ్రహ్మాండ మను నాతపత్త్రంపు దండంబు
నలినభూ నిలయాబ్జ నాళదండ
మవని సంజ్ఞకనౌ మహా కూపదండంబు
గోత్రతటినీ పట్టి కేతుదండ
మురుచమూ చక్ర సంయుక్తాశుదండంబు
త్రైలోక్య జయ యశః స్తంభదండ
మఖిల బుధ ద్వేషి హర కాలదండంబు
చక్రహ స్తోత్క్షిప్త చరణదండ

గీ. మగుచు దేనిని బొగడి కల్యాణ మంది
దశకుమార కథాప్రబంధంబు సెప్పెఁ
దొల్లి యాచార్యదండి యా శ్రీయజాత్ము
పదమె మాకు మనోరథ ప్రదము గాత.

ఎల్ల నగరములకును ఒరగల్లుగా నొప్పునట్టిది, మగధదేశమునకు సిగదండ, పుష్పపురి యను పట్టణము కలదు. అందు బజారులలో విక్రయార్థము పఱచి యుండు రత్నాది వస్తు సమూహములు సముద్రుని మహాభాగ్యమును చాటుచుండును. ఆ పురంబును రాజహంసుఁ డను రాజు ఏలుచుండెను. నీతి వెల్లిచేతను పొడవు లయిన కరడములచేతను

మొనల్లచేతను భయంకర మయిన మహార్ణవమును మందరపర్వతము ఎట్లో అట్లే బీరంపు బంటుల మొత్తముచేతను ఎత్తరులైన తత్తడులచేతను ఏనుంగులచేతను భయంకర మయిన శత్రుసమూహముల పాశేమును ఛిన్నాభిన్నము గావించిన నిజ భుజదండము ఆతనికి భూషణముగా నుండెను. శరత్కాలపు జాబిల్లి, మొల్లలు, కర్పూరము, మంచు,ముత్తెపుఁ బేరులు, తామరతూండ్లు, రాజహంసలు, ఐరావతము, వజ్రము, పాలు, శివుఁడు, శివుని బొబ్బనవ్వు, వెండికొండ, తెల్లుఁబువ్వు, అను వీనికి తుల్య మయిన రూపము గలదై, దిక్కులను నడిమి యాకాశ మెల్ల తాను నిండుటచేత పిక్కటిల్లం జేసి మితి మీఱిన, దైన యాతని కీర్తిని ఇంద్ర నగరంపు మునిఁగిటి నంద నోద్యానంబున విహార పరాయణ లైన దేవ్రాయపు టచ్చర మచ్చెకంటులు పాడుచు పరిమళమువలె నెల్లెడలకుం బర్వించుచుందురు.ఆ రాజు మేరుశిఖరమువలె వెలుంగులు తులంగలించు దొడ్డ రత్నములకుం దావలమైన సముద్రంపు వెల్లి చుట్టు వాలుకొనియున్న నేలపడంతియొక్క సొబగు నెల్ల భాగ్యవశంబున ననుభవించుచు, నిరంతరము యాగములు సేయుచు, సకల విద్యా విచక్షణు లయిన బ్రాహ్మణోత్తములను ప్రోచుచు దక్షిణలచే, ప్రతాపంబు పెంపున మధ్యాహ్న మార్తండునిం బురణించుచు, మదనుని సౌందర్యమునకుఁ దోఁబుట్టు వయిన రూపసంపద గలిగి, యొప్పారుచుండెను.

ఆతనికి వసుమతి యను పేరి రమణీజన మాడామణి పట్టపు రాణిగా నుండెను. రోషావేశ వశంబున తీండ్రించిన వేసికంటిదేవుని మూఁడవ కంటి మంటచేత తూంటవిల్తుఁడు బసుమం బగుటను, బెగ డొందిన స్త్రీయందు దోషము లే దని యెంచి, యాతనికి—తు మ్మెదల బారు ఆమెకు కచభారము గాను, అనుంగు నెచ్చెలి యైన చంద్రుఁడు తానురసమును గెలిచిన నెమ్మోము గాను, గెలుపు సిడ మయిన చేప పెంటితోఁగూడ కనుఁగవ గాను, ఎల్లబంట్లకును మున్నాడిన దళవాయి యయిన గంవపుఁగొండ తెమ్మెర ఊలుపు గాను, విమోగుల యెడదం జీలుచు కత్తి యయిన చిగురాకు దొండపండువంటి కెమ్మోవి గాను, గెలుపుఁజెండము లావణ్య ధురంధరంబైన కంధరము గాను, నిండుబిందెలజత జక్కవకవం బురణించు పాలిండ్లు గాను, అల్లెత్రాడు లైనట్టివి కోమలతనుము లయిన తామరతూండ్లు బాహువులు గాను, విలాసంపుఁగమ్మ యైన కలువ ఇంచుక విరిసినట్టిది మిన్నేటిసుడివంటి పొక్కిలి గాను, యోగిజనుల కోరికలను దూరానకు నెట్టిన గెలుపుటరదంబు అతిసూన మయిన జఘనము గాను, జయ స్తంభములుగా నుండినట్టివి సౌందర్యములను కూర్చి చేసిన యూర్లునట్టివి యతిజనుల యుద్యమములకు భంగపాటుం గావించినట్టివి జంట యరఁటి బోదెలు ఇరుదొడలు గాను, గొడు గయిన వేయిరేకుల తమ్మి అడుగుదోయి గాను, కైదువు లయిన పువ్వులు ఇతరావయవములు గాను, పరిణమించినవా యేమి? వేలుపుల నగరము ఖంచినదైన యా పుష్పపురము నిజరాజధానిగా మగధరాజు అనంతుని పడగలయందు

లాలనం బొందు భూదేవినిం బోలె మితి లేని భోగములచేత లాలిత యగుచున్న యా వసుమతీ దేవిని అనుభవించుచు సుఖ ముండెను.

ఆ రాజునకు అత్యంత విధేయులు ప్రజ్ఞా విశేషంబున బృహస్పతియొక్క కార్యసాధన చాతుర్యమును ధిక్కరించినవారు వంశ పరంపరాగతు లయిన మంత్రులు సితవర్మ ధర్మపాల పద్మోద్భవు లని ముగ్గు రుండిరి. వారిలో సితవర్మకు సుమతి సత్యవర్మలును, ధర్మపాలునికి సుమంత్ర సుమిత్ర కామపాలురును, పద్మోద్భవునికి సుశ్రుత రత్నోద్భవులును, అని కుమారులు జనించిరి.

వారిలో ధర్మపరాయణుఁడు సత్యవర్మ సంసారము నిస్సార మని తెలిసికొని తీర్థసేవ చేయఁ గోరి దేశాంతరమునకు పోయెను. నట విట వారాంగనా లంపటుఁడు దుర్వినీతుఁడు కామపాలుఁడు తండ్రిమాటను అన్నలమాటను వినక దేశములు ద్రిమ్మరుచుండెను. రత్నోద్భవుఁడు బేరమునందు నేర్పరి యై సముద్రమును దాఁటెను. తక్కిన మంత్రికుమారులు తండ్రులు స్వర్గస్థులు కాఁగా తాము ఆ యా మంత్ర్యధికారములందు కుదురుకొని యుండిరి.

పిమ్మట నొకప్పుడు గొప్పగొప్ప కైదువులందు నిపుణుఁడై పెక్కు రణములలో రాజన్యుల వాలి పాళికలయందు వాఁడి యలుఁగులు గ్రుచ్చిన మగధరాజు అభినవరణ భీషణుని మిక్కుటంపు మానముచే పిక్కటిల్లుచున్న వానిని మాళవరాజును మానసారునిఁ గూర్చి, లీలామాత్రముగా కదలి క్రొంతను రోఁతలువెట్టు తన భేరీభాంకారముచేత దిగ్గజ మండలి అకస్మికమైన యీ వినికిడలని భయమున చెలరేఁగి సుడివడుచుండ, తన నడపు చతురంగ బలంపు బరువునకుఁ గ్రుంగుచున్న భూమిని మోచుటకు అనంతుఁడు ఆయాసపడుచు వేయిపడగల బలము నంతయు పూనుచుండఁగా, యుద్ధాభిలాషి యై మహారోషముతో దండెత్తి పోయెను! మాళవ భూపతియు ఏనుఁగులం బెక్కుంటిం దోడ్కొని, రూపొందిన పోరు వోలె, పేర్చిన యాగ్రహమ్మువ వెలువడి, యుద్ధమునకై ఎదుర్కొనెను అంత నయ్యిరువురకును పోరు మున్మరించెను. అరదములచేతను గుఱ్ఱముల గొరిజలచేతను సలిఁగి లేచిన దుమారంపు మొత్తము ఏనుఁగుల తండముల కణతల నుండి కాఱు మద ధారలచేత క్రిందిభాగమునందు నిర్మలమై, క్రొత్త దయితులను వరింప వచ్చిన యచ్చర మెఱుంగుఁ బోండ్ల తెర చీరల పరంపర లోయన ఆకాశమునం బర్వెను. కిడము ధ్వనుల నెల్ల దిగ మ్రింగిన డమాయీల ధ్వనిచే దిశావకాశము లెల్ల చెవుడ్పడెను. వీరభటులు ఒండొరులను కైదువులతో కొట్టుచును చేతులతో నెట్టుచును పోరిరి. మాళవనాథుని సైన్య మండల మంతయు క్షయ మొందెను. అంతట మగధరాజు మాళవరాజును ప్రాణముతో పట్టి కనికరించి వదలిపెట్టి ఆతని రాజ్యమందే నిలిపెను. అనంతరము మగధరాజు ఏకచ్ఛత్రముగా సప్త సాగరములతోడి యీ భూమండలము

నేలుచు, సంతతి లేమిచేత తదర్థమై సకల లోక కారణభూతుని నారాయణుని అర్చించెను.

పిమ్మట నొకప్పుడు అతని పట్టపుదేవి కల్పలతాఫలమును ఆతఁడు తన కిచ్చినట్లు వేకువను నిక్కముగం గనియెను. ప్రాణేశ్వరుని కోర్కె తీఁగకు పువ్వు అయినట్టి గర్భమును దాల్చెను. దేవేంద్ర సంపద కలవాఁ డయిన యారాజు అంతట తన మిత్రులైన రాజుల నెల్ల రావించి, తన సంపదకును కోరిక నెఱవేఱినందులకును తగినట్లుగా పట్టపుదేవికి సీమంతోన్నయ నోత్సవముం గావించెను.

గుణవంతుఁ డా రాజు ఒకప్పుడు ఆప్తవర్గ మయిన మిత్ర మంత్రి పురోహితులతో సభలో సింహాసనము నలంకరించి యుండఁగా, ద్వారపాలకుఁడు వచ్చి, లలాట తట మందు అంజలి ఘటించి,—'దేవా, ఏలినవారిని సందర్శింపఁ గోరినవాఁడు విశేషించి ఏలినవారు అర్చింపఁ దగినవాఁడు ఒకయతి హజారమం దున్నాఁడు.' అని నివేదించి, ఱేని యనుమతి వడసి పోయి, ఆ యతిని ఱేని కడకుం గొనివచ్చెను. వచ్చుచుండఁగానే, రాజు ఆతనిం గని, మాఱువేసంబున నున్న తనచారునిఁగా నెఱింగి, అనుచరుల నెల్ల అవలికి పంపి, మంత్రులను మాత్రము కూడ నుంచుకొని, ప్రణతుని ఆయాగంతుకుని చిఱు నగవు నవ్వుచు 'ఓయి తాపసుఁడా, మాఱువేసముతో దేశములఁ దిరుగుచు నీవు ఏ మేమి తెలిసికొంటివో చెప్పుము.' అని పలుకరించెను. దేశములు ద్రిమ్మరుటయందు సమర్థుఁ డయిన యా వేగు చేతులు మోడ్చి యిట్లు వచించెను:—'దేవా, ఏలినవారి యాజ్ఞను శిరమునఁ దాల్చి, నిర్దోష మయిన యీ వేసమును ధరించి, మాళవరాజ రాజధానిం జొచ్చి, అచ్చట కరము గూఢముగా నుండి, ఆ ఱేని వృత్తాంతముల నెల్ల దెలిసికొని, వచ్చినాఁడను. మానవంతుఁడు మానసారుఁడు తన సకల సైనికుల యాయుస్సునకును విఘ్న మయినట్టి యాదురములో మీవలన ఓటువడి, యుల్లంబునం దల్లడిల్లి, బెట్టిద మయిన పట్టుదలతో మహాకాలక్షేత్రవాసిని కాళీవిలాసిని అనీశ్వరుని మహేశ్వరుని ఆరాధించి తపఃప్రభావముచేత మెప్పించి, ఆదేవునివలన ఏకవీరుఁడగు శత్రువును గూల్చునదైన బెట్టిదంపు గద యొకటి పడసి తన కిఁక నెదురు లే దని యెంచి మీ మీఁదికి పోరికి కడంగి యున్నాఁడు. అటుపైని ఏలినవారి చిత్తము.

దానిని ఆలోచించి మంత్రులు కర్తవ్యమును నిశ్చయించి రాజున కిట్లు విన్నవించిరి.—'దేవా, పగతుఁడు ఓటమి లేని దైవ సాహాయ్యముతో పోర వచ్చుచున్నాఁడు, కావున ఇప్పుడు మనకు యుద్ధము సేయుట మేలు గాదు, తటాలున దుర్గము నాశ్రయింపవలయును.' ఇట్లు వా రెంత చెప్పినను వినక రాజహంసుఁడు గర్వంబు పెంపున దీపించుచు ఎదిరితో నెదిరి పోర సమకట్టెను. శివుని వరమునం గలిగిన హెచ్చు శక్తితో మానసారుఁడు పోరుటకై జోదల నెల్ల మున్నాడి సర్వసామగ్రీ సమేతుఁడై అక్లేశం

బున మగధదేశముం బ్రవేశించెను. ఆ వృత్తాంతమును విని మంత్రులు భూలోక దేవేంద్రుని మగధ నరేంద్రుని ఎట్లో ఒప్పించి అతని రాణివాసములను పగతురకు చొర శక్యము గాని వింధ్యారణ్య మధ్యంబున నుంచి, వారికిఁ గాపుగా మూల బలమును నిలిపిరి.

రాజహంసుఁడు పేరెత్తిన దంట లయిన బీరంపు బంటులతో వడి వడి వెలువడి రోష కషాయితుని విద్వేషిని ఎదుర్కొనెను. ఒండొరులపై బద్ధ వైరు లయిన యా శూరుల కిరువురకును దారుణ మయిన రణము నివ్వటిల్లెను. కుతూహలంబున వియచ్చరులు వచ్చి దానిని అచ్చెరు వంది చూచుచుండిరి. అంతట జయాభిలాషి యై మాళవ రాజు ఎల్ల యాయుధములను దిట్టంపుఁ బ్రయోగములతోడ బహరంబులను ఇంద్రుని వలె నలుపువాఁ డయిన రాజహంసునిపై హరుఁ డిచ్చిన యా గదను వైచెను. రాజహంసుఁడు ఆగదను బాణపరంపరతో తుత్తునియలు చేసెను, అది, శివాజ్ఞ వమ్ము గాదు గావున, అతనిని సొమ్మసిలం జేసి, సారథిం బరిమార్చినది. అంతట ఒడలు గాయపడిన గుఱ్ఱములు వాగె లెడలుటను, రథము నీడ్చుకొని దైవ వశంబున రాణివాసముల డాఁగు రింపుఁ దావల మయిన యా కాఱడవికే పోయినవి. మాళవరాజు గెలుపు సిరిం బడసి గొప్ప దయిన యా మగధరాజ్యమును ఆక్రమించి పుష్పపురము నధిష్ఠించెను.

ఆయుద్ధములో కైదువుల పిండుల ప్రేటులకు సోలి పడియున్న మంత్రులు దైవవశంబున బ్రదికియుండి, తెల్లవాఱు సమయమునఁ జల్లతెమ్మెరలను తెలివిఁ బొంది, ఎట్టకేలకు ఊఱడిల్లి, రాజును ఎల్లెడలను వెదకి, కానక, దిగులుతో దేవికడకుఁ బోయిరి. సేన యెల్ల మడిసెననియు, రాజు కనఁబడలే దనియు, వారివలన విని, వసుమతీదేవి బెగ్గడిల్లి, శోకసముద్రమును దాఁట నశక్తురాలై, రాజుతో సహగమనము సేయ సమకట్టెను. మంత్రులును పురోహితులును 'ఓ, సుమంగలీ, నీపతి మరణము నిశ్చితము గాదు. ఇంతియ గాక, పొగరుకొన్న పగతురను ఇగురఁ జేయువాఁడు సర్వ భూమండలమును ఏలఁ గలవాఁడు మనోహరుఁడు సుకుమారుఁడు కుమారుఁడు నీకడుపులో నెలకొనియున్నాఁడని దైవజ్ఞులు చెప్పియున్నారు. కావున నిపుడు నీకు మరణము సమంజసము గాదు.' అని ఓదార్పఁగా ఆమె ఇంచుక తడవు ఊరకుండెను. పిమ్మట అర్ధరాత్ర సమయంబున పరిజనులెల్ల నిద్రాముద్రిత నేత్రులై యుండఁగా, ఏకాంతమున మేర లేని శోకసాగరమును దాఁట నేరనిదై, అడుగుల సవ్వడి కొంచె మయినను కానీయక మెల్ల మెల్లగా పాళెముయొక్క విడిదలను దాఁటి పోయెను. అట చెంగట నొక మఱ్ఱిచెట్టుండెను. అట నంతకు మున్నే తేరుని బండిని ఈడ్చుకొని పలాయితములై వచ్చి బడలి యున్న గుఱ్ఱములు ఆ చెట్టుకొమ్మలకు బండి తగులుకొన్నందున మఱి నడవ లేక చేయునది లేక ఆదారిలో నిలిచి యుండినవి. వసుమతీదేవి ఆ చెట్టున కొనకొమ్మను మరణసాధనముగా తన పైఁట చెఱంగునే ఉరిగాఁ గట్టుకొని ప్రాణము విడుచునదై, కోకిలలం జీకాకు సేయు మధురవాక్కుతో

బాష్పములచే కలంగిన యెలుఁగుతో నిట్లు వందురెను:—'వెడవిల్తునిం గేరు లావణ్యము గలవాఁడా, ఓ సామీ, పుడమిఱేఁడా, నాకు రాఁగల పుట్టువునందును నీవే వల్లభుఁడవు కావుత.'

దానిని విని చలివెలుఁగు కిరణనికరములు సోఁకుడు మూర్ఛఁ దేఱిన మగధరాజు కడుం దడవు గాయపు గంట్లనుండి నెత్తురు వఱ్ఱోడుచు చేష్టలు దక్కియున్నవాఁడు ఆ వాక్కు వసుమతీ దేవిది యని నిశ్చయించుకొని, ప్రియ వచనంబుల మెల్లగా ఆమెను బిలిచెను. ఆమెయు తొట్రుపాటుతో వచ్చి, డెందంబునందుఁ గ్రందుకొన్న యామందానందముచే వదనారవిందంబు నెరయ విరియ, ఉపవసించినవియుం బోలె తహతహ పడుచున్న కన్నులతో నాతనిం ద్రావి, వికసిల్లిన యెలుంగుతో పురోహితామాత్యులను పిలిచి, వారికి ఆతనిం జూపెను. అమాత్యులును వచ్చి, రాజుం గాంచి, యాతని పాదాంభోజంబులకు నుదురు సోఁక మ్రొక్కి, దైవముప్రభావమును ఉగ్గడించి, యాతనితో 'దేవా, సారథి మడియఁగా గుఱ్ఱములు తేరిని తటాలున అడవిలోనికిం దెచ్చినవి.' అనిరి. రాజు వక్కాణించెను.—'శివు నుపాసించిన యా మాళవరాజు మన సైనికు లెల్లరును బ్రమందిన యాహవరంబున కనికర మేది వైచిన గదచేతి గాటంపు వ్రేటుం బడి నేను మూర్ఛిల్లి ఇచ్చట వేగు సమయంపుఁ జలువ గాలిచేత తెలివి నొందితిని.' అని. అంతట నమాత్యులు ఆతీరున దైవ మనుకూల మయిన యాకాలంబున రాజును మోచికొని శిబిరమునకుం గొనిపోయి, ఒడలం గ్రుచ్చుకొని యున్న యంపములుకుల నెల్ల నెడలించి, త్వరలో గాయపుఁ గంట్ల నెల్ల మాన్పించిరి. ఱేని ముఖారవిందము తేజు పొంది విరాజిల్లెను.

అట్లు దైవము దాయ యై పురుషకారము నడంపఁగా, డిల్లవోయి చెన్ను దఱిఁగి వెతఁ గూరుచున్న యా మగధేశ్వరుని అమాత్యులును మృదుభాషిణియు మతిమంతురాలు నయిన వసుమతియు ఇట్లని హెచ్చరించిరి:—'దేవా, సకల రాజ సమాజములో తేజస్వివి వరిష్ఠుఁడవు గరిష్ఠుఁడవు నైన నీవు ఇపు డిట్లు అడవి నడుమ నివసించుటయే నిదర్శనము: ఎంత రాజిల్లినను సంపద నీటిమీఁది బుడగ వంటిది, మెఱపుఁదీఁగవోలె క్షణములోనే పొడతెంచి నశించునది. కావున కార్య మెల్ల దైవాధీన మని యెఱుంగ వలయును. మఱియు పూర్వము దేవేంద్రతుల్యైశ్వర్యము ననుభవించిన హరిశ్చంద్ర రామచంద్రాది మహీపతులు దైవ మిడిన యిడుమలం గడుం గుడిచి, పిమ్మట చిరకాలము రాజ్యము లేలిరి. అట్లే నీవును చేయుదువు. కొంచెము కాలము దైవ సమాధి కావించుచు వెత మాని ఓపికతో నుండుము.'

అంతట ఎల్ల సైన్యములం దోడ్కొని పోయి సోమకులావతంసుఁడు రాజహంసుఁడు తపస్సుచే జాజ్వల్యమానుఁ డైన వామదేవ మునిని తనకోర్కిం దీర్చువానిని దర్శించెను. ఆయనకుం బ్రణమిల్లి, అతిథి సత్కారంబు లంది, ఆయనకు చెప్పవలసిన దానిని

చెప్పి, శ్రమ దీర్చున దైన యాతని యాశ్రమమందు కొంచెపాటికాలము గడపి ఒకప్పుడు తనరాజ్యమును సాధింపఁ గోరి మితభాషణంబుల మునికి ఇట్లు విన్నవించెను:—'స్వామీ, మానసారుఁడు బల్లిద మయిన దైవ బలముచేత నన్ను ఓర్చి, నాకు భోజ్య మయిన రాజ్యమును తా ననుభవించుచున్నాఁడు. కావున లోక శరణ్య మయిన మీ కారుణ్యంబునం జేసి నేనును తీవ్ర మయిన తప స్సొనర్చి వానిని వెలార్చు వాఁడ నై తపోధనుల రయిన మీ సన్నిధికి వచ్చితిని.' అందులకు త్రికాలవేది యాముని యి ట్లనియె:—'మిత్త్రుఁడా, దేహమును శోషిల్లం జేసెడి తపస్సు నీ కేల? ఎల్ల పగతురను నలి సేయు కుమారుఁడు తప్పక వసుమతి గర్భంబున పుట్టి యున్నాఁడు, కొలఁది కాలము వేచుము.' ఆసమయంబుననే ఆకాశవాణియు 'ఈమాట నిక్కము' అని పలికినది. ఱేఁడును ముని వాక్యము నంగీకరించి యుండెను.

తర్వాత వసుమతీదేవి ప్రొద్దులు నిండి శుభ ముహూర్తంబున సకల లక్షణ శోభితుని కుమారునిఁ గనియెను. కృత్య మెఱింగిన యారాజు బ్రహ్మవర్చసముచేత బ్రహ్మదేవునికి ఉద్ది యయిన పురోహితుని ముం దిడుకొని, సుకుమారుని ఆకుమారుని జాతసంస్కారముచేతను బుధుతతోడవులచేతను విరాజిల్లం జేసి, రాజవాహనుఁ డని పేరిడియెను. ఆ సమయమందే సుమతి సుమిత్త్రి సుమంత్ర సుశ్రుత మంత్రులకు ప్రమతి మిత్త్రిగుప్త మంత్రగుప్త విశ్రుత నాములు ఎక్కుడు శోభ గల కుమారులు పొడుచుచున్న చందురుని కాంతి గలవారు చిరాయువులు జనించిరి. రాజవాహనుఁడు తన చెలికాండ్రయిన యా మంత్రి పుత్త్రులతోఁ గూడ బాలక్రీడ లనుభవించుచు ఎదుగుచుండెను.

పిమ్మట నొకప్పుడు ప్రీతితో తాపసుఁ డొకఁడు రాజ లక్షణములతో విరాజిల్లుచున్న వానిని కన్నుల పండువును సుకుమారు నొక కుమారుం గొని వచ్చి రాజున కప్పగించి యిట్లనియె.—రాజేంద్రా, నేను దర్భలను సమిధలను దెచ్చుకొనుటకై అడవికి పోఁగా, అట దిక్కులేక కన్నీళ్లు విడుచుచున్న దీనురాలు ఒక జవరాలు అగపడెను. 'ఈనిర్జనారణ్యమున ఏల యేడ్చుచున్నావు నీవు?' అని నే నడుగఁగా ఆ పడఁతి వ్రేళ్లతో కన్నీళ్లు తుడుచుకొని ఎలుంగు డొత్తిల్ల నిట్లు వచించెను.—

"ఓ మునీంద్రా, పూవిలుకానిఁ గేరు లావణ్యమువాఁడు దేవసభయందు పర్విన కీర్తివాఁడు మిథిలాపతి, తన చెలికాఁ డయిన మగధ నరేంద్రుని పుట్టువుదేవియొక్క సీమంతోన్నయన మహోత్సవమునకు దార పుత్త్రి సమేతముగా పుష్పపురమునకు వచ్చి, కొంతకాలము అం దుండుడు, మాళవరాజు మహేశ్వరుని ఆరాధించి మగధరాజుమీఁదికి దం డెత్తి వచ్చెను. అంతట ప్రఖ్యాతు లయిన యా మహావీరుల కిరువురకును ఎన్నికకు మించిన యుద్ధము వర్ధిల్లుచుండఁగా, విదేహేశ్వరుఁడు ప్రహారవర్మ, తనకై ప్రాణ మిచ్చు తన దండు విదేహదేశమం దున్నందున, తాను అది లేకయే తనతో వచ్చిన కొంచె

పాటి సైన్యము నడపుకొని, మిత్త్రునికి తోడుగా పోరెను. మానసారుఁడు జయము నొంది ఈయనం బట్టికొని పున్నెంబున కరుణించి విడువఁగా, ఈయన హత శేష మయిన వట్టి సిబ్బందితో తన నగరమునకు తరలెను. దుర్గమ మయిన వనమార్గమునఁ బోవుచుండఁగా, బల్లిద మయిన చెంచుదండు ఆకస్మికముగా వచ్చి తాఁకినది. దాని ధాకకు ఆఁగ లేక ఆ రాజు మూలబలముచేత రాణివాసములను రక్షించుకొనుచు పలాయితుఁ డాయెను. అతని యర్భకులకు కవలకు దాదులము నేనును నా కూఁతురును వేవేగ పోవుచున్న యా రాజుతో సరిగాపో లేక వెనుఁజిక్కితిమి. అంత నట బెబ్బులి యొకటి దూపొందిన కోపమో యన నోరు దెఱచుకొని నన్ను మూర్కొన వచ్చెను. నేను భయపడి చేతు లెత్తి తొట్రిల్లి నేలఁ బడితిని. నా చేతులనుండి బాలకుఁడు జాఱి పడి యొకానొక పుల్లావు పీనుఁగు ఱొమ్ములో దాఁగెను. పులి కోపము కొలఁది ఆయావు పీనుఁగును పట్టి పీఁకు చుండఁగా విలుకాఁ డొకఁ డో బాణ మేసి దాని ప్రాణములను హరించెను. చలించుచున్న ముంగురులతోడి యా బాలుని చెంచులు ఎటకో కొనిపోయిరి. కడను బాలుని ఎత్తుకొని నా కూఁతురు ఎటకుఁ బోయెనో ఎఱుంగను. నేను మూర్ఛం బడి యుండ, గొల్ల యొకఁడు చల్లని యుల్లంబుతో నన్ను తన గుడిసెకుం గొనిపోయి గాయములు మాన్చెను. నేను స్వస్థపడి వెండియు తేని కడకుం బోవం దలపడి తోడు లేకయు కూఁతు వృత్తాంతము తెలియకయు వ్యాకులపడుచున్నాను.'' ఇట్లు వచించి ఆ జవ్వని 'ఒంటిదాన నే పోయి సామిని కలసికొనియెదను.' అని అప్పుడే వెడలెను.

నేను నీ చెలికాఁ డయిన విదేహరాజునకుం గలిగిన యిడుమకై వగచుచు, అతని వంశపు మొలక యయిన యా బాలుని వెదకుచు, సుందర మయిన చండికగుడికి అప్పుడే పోయితిని. అచ్చట ఎల్లప్పుడును ఇట్టి గెలుపుల నొసంగుటకై అమ్మవారికి బాలకుని బలి యిడువారై కిరాతులు 'వీనిని చెట్టుకొమ్మకు వ్రేలఁ గట్టి కత్తితో నఱికిన వైతమా? ఇసుక నేలలో పాదములు పాఁతిపెట్టి గుఱిపెట్టి క్రొవ్వాఁడి కోలలతో గూల్చుతమా? ప్రాఁకుచు పాఱు తెంచునట్లు చేసి జాగిలంపుఁ గొదములచే కఱపించి కడతేర్తమా? ఎట్లు చంపుదము?' అని ఒండొరులతో కలయఁ బలికికొనుచుండిరి. వారితో నే నిట్లు పలికితిని: 'ఓ రోరి కిరాతులారా చీఁకట్లు తాండవ మాడుచున్న యీ ఘోర కాంతారములో దారి తప్పితిని, ముసలిబ్రాహ్మణుఁడును, నా కుమారుని ఒక చోట నీడలో ఉంచి ఇంచుక దూరము పోయి దారి వెదకికొని మరలి వచ్చి, చూచుకొనఁగా కుమారుఁడు లేఁడు. ఎక్కడికి పోయెనో? ఎవరు గొనిపోయిరో? ఎంత వెదకినను కనఁబడ లేదు. వాని నెమ్మొగముం గని పెక్కు దినము లయినవి. ఏమి సేయుదును? ఎటఁ బోవుదును? మీ రే మయినం జూచినారా?' అంతట దైవానుకూల్యమున వారు 'స్వామీ, బాపనయ్యా, ఇక్కడ నొకఁ డున్నాఁడు. వీఁడు నీ కొడుకా? వీఁడే నిజముగా నీ కొడు కని తీసి

కొనిపొమ్ము.' అని ఆ బాలుని ఇచ్చిరి. నేను వారిని దీవించి, బాలకుని గ్రహించి, చల్లని నీళ్లు లోనగు నుపచారములచేత సేద దేర్చి, నిర్భయముగా నీకడకుం దెచ్చితిని. ఈ చిరంజీవిని తండ్రికన్న హెచ్చుగా నీవు ప్రోతువు గాక.—రాజా, మిత్త్రుని యాపదకై తనకుఁ గలిగిన శోకమును ఆతని కుమారునిఁ గాంచెడు సంతోషముచేత కొంతవట్టు మట్టు పఱుచుకొనుచు, ఆబాలునికి ఉపహారవర్మ యని పేరిడి, రాజవాహనునితో సమానముగా పెంచుచుండెను.

రాజహంసుఁ డొకనాఁడు తీర్థస్నానముకై బోయవాడ వెంబడి దారిని పోవుచు, అచట సాటి లేని నెమ్మోమువానిని బాలు నొకనిని ఒక యెలనాగ ఆడించుచుండఁగాఁ గాంచి, కుతూహలంబున దానిని 'ఓ మగువా, సుందరాకారుఁడు రాజలక్షణ సంపూర్ణుఁడు ఈ బాలుఁడు మీకులమునఁ బుట్టినవాఁడు కాఁడు. కన్నులపండు వయిన యీ బాలుఁడు ఎవని నందనుఁడు? ఏమికతంబున నీ చేతికి వచ్చినాఁడు? ఉన్నమాట ఉన్నట్లు చెప్పుము.' అని యడిగెను. శబరి దండ మిడి యిట్లు వచించెను:— 'దేవరా, మా పల్లె చెంగటి దారిలో పోవుచున్న మిథిలేశ్వరుని యెల్ల ధనమును కొల్ల గొన్న బోయదండులో నా మగవాఁడు ఈ కుమారుని దోఁచుకొని వచ్చి నా కిచ్చినాఁడు, నేను పెంచు చున్నాను.' అంతట రాజు ఆమాటను అవధరించి ముని చెప్పిన రెండవకుమారుఁడు వీఁడే యని నిశ్చయించి, మంచిమాటచేతను ఈవిచేతను ఆబోయతను ఒప్పించి, కుమారుని పుచ్చు కొని, అపహారవర్మ యని పేరొసఁగి, దేవికి పెంపు మని యప్పగించెను.

ఒకప్పుడు వామదేవమునిశిష్యుఁడు సోమశర్మ యను వాఁడు ఒక బాలకుని తెచ్చి ఱేని మ్రోల నిడి యిట్లు వక్కాణించెను.—రాజా, నేను రామ తీర్థములో స్నాన మాడి మరలి వచ్చుచు, అడవిలో ముసలి దొకతె ఎత్తుకొని యున్న దేదీప్యమాన మూర్తిని ఈ కుమారునిఁ గని, ఆదరము దొలఁక 'ఓ ముసలీ, నీ వెవ్వతెవు? ఈయడవి నడుమ ఈ బాలకుని ఎత్తుకొని ఏల వడుచు శేచుచు తిరుగుచున్నావు?' అని యడిగితిని. ముసలిది వాక్రుచ్చినది.—

మునీశ్వరా, కాలయవన మను దీవిలో కాలగుప్తుఁ డను మేటి కోమటి ధనవం తుఁడు కలఁడు. అతని కొమారితను కన్నుల పండువును సువృత్త యను దానిని, ఈదేశము నుండి వచ్చిన వాఁడు మగధరాజ మంత్రి పుత్త్రుఁడు రత్నోద్భవనాముఁడు మంచిగుణ ముల పుట్టి నిల్లు భూమండల మెల్లం జరించినవాఁడు అందగాఁడు వేరి యొకఁడు పెండ్లి య్యె, మంచి మంచి వస్తువుల సంపదను మామవలన అరణ మందెను. కొంత కాలమునకు ఆ కోమలాంగి గర్భము దాల్చెను. అంత నాతఁడు తన యన్నను చూడఁ గోరి, ఎట్టకేలకు మామను ఒప్పించి, ఆ చంచలాక్షితోఁ గూడ ఓడ యెక్కి పుష్పపురమునకు చాఁప యెత్తెను. కొంత సబురు అయినంతట తుపాను గొట్టి పెనుగరడముల దెబ్బలకు

ఓడ పగిలి నీట మునిఁగి పోయెను. నెఱమూలువలన ఓప లేక యున్న యా జవరాలిని దాదిగా తోడు వచ్చిన నేను చేతులతో నెత్తుకొని దైవ వశమున దొరకిన యొక పలక మీఁద నెక్కించుకొని ఎట్టులో గట్టు చేర్చితిని. రత్నోద్భవుఁడు తానును మిత్త్రులును అట మునిఁగి పోయెనో ఏదే నొక యుపాయమున దరిఁ జేరెనో యెఱుంగను. మితి మీఱిన పాటు పడిన దై సువృత్త ఈ యడవిలో కొడుకుం గనియెను. కానుపు నొప్పుల చేత స్మృతి తప్పి ఆమె ఒక చెట్టు క్రింద దట్టంపు నీడలో పడి యున్నది. నిర్మానుష్య మయిన యడవిలో నుండఁ జాలమిచే గ్రామమునకు పోవు దారిని వెదకుటకై నేను వచ్చుచు, ఒడ లెఱుఁగక పడియున్న దాని దగ్గఱ వదలి వచ్చుట సరిగా దని ఈనిసువును ఎత్తుకొని వచ్చితిని. —

ఆ నిఃసమములో నటకు అడవియేనుఁ గొకటి ఏతెంచెను. దానిం గని వెఱగొని ఆ దాది బాలుని పడవైచి పాఱిపోయెను. నేను ఆ చెంగట నొక తీఁగడొంకలో చొచ్చి పరికించుచుంటిని. పడిన శిశువును చివురుటాకుల కవణపుఁ బొత్తరం బోలె ఏనుఁగు తొండముతో ఎత్తికొనుచుండఁగా, దానిమీఁదికి మహోగ్రహంబున సింహము దాఁటెను. దానికి జడిసిన తత్తరపాటున ఏనుఁగు బాలకుని మింటికి ఎగుర వైవఁగా, చిరకాలము బ్రదుక వలసిన వాఁడు గావున, ఆ సమీపమున చెట్టు కొమ్మమీఁద నున్న క్రోఁతి యొకటి పండిన పండు అను నాశచేత పట్టుకొని, పండు కానందున వెడలుపుఁబాటి బోదెపయి విడిచి ఎటకో పోయెను. సత్త్వ సంపన్నుఁడు కావున బాలకుఁడు ఎల్ల పాట్లను ఓర్చెను. ఏనుఁగును జంపి సింగము ఎటకో పోయెను. పొదరింటినుండి నేను వెలువడి వెలుఁగుల మొత్తమైన యా బాలకుని మెల్లగా చెట్టునుండి దింపి, అడవిలోపల ఆ పడఁతిని వెదకి కానక, వానినే వీనిని కొనిపోయి గురువునకు నివేదించి, ఆయన యాజ్ఞచేత నీకడకుం దెచ్చితిని.....

ఇట్లు పలికి సోమశర్మ విరమింపఁగా, రాజహంసుఁడు మిత్త్రిల కందఱకును ఒక్కమొగినే దైవము ప్రతికూల మయినందులకు ఆశ్చర్యపడి, రత్నోద్భవుని గతి తెలి యక చింతిల్లుచు, బాలునికి పుష్పోద్భవుఁ డని పేరు పెట్టి, వాని వార్తను వివరించి, దుఃఖ సంతోషముల మిశ్ర మగు దశా విశేషము ననుభవించుచు, సుశ్రుతునికి అతని తమ్ముని కుమారుని అప్పగించెను.

మఱునాఁడు ఒకానొక బాలకుని ఱొమ్మునం బెట్టుకొని వసుమతీదేవి వల్లభుని కడకు వచ్చి, 'వీఁ డెక్కడ దొరకినాఁడు?' అని యాతఁ డడుగఁగా, నిట్లు నుడివెను:—. "మహారాజా, కడచిన రాత్రి ఒకానొక దివ్య వనిత నా యెదుట ఈ బాలుని ఉంచి, నిద్రలో నున్న నన్ను లేపి, వినయంబున నిట్లు వచించెను.—'దేవీ, నేను నీ మంత్రికి ధర్మపాల నందనుఁ డయిన కామపాలునికి దయితను. యక్షకాంతను, మణిభద్రుని కూఁ

తురను; నా పేరు తారావళి. జక్కులఱేని పంపున, నా కుమారుని వీనిని కడలి మొలనూలి పంటవలంతికి ప్రాణేశ్వరుఁడు కాఁగలవానికి నీ కుమారునికి నిర్మలయశోనిధికి రాజవాహనునికి పరిచర్యసేయు నిమిత్తము, తెచ్చితిని. కావున మారునికి మా అయిన యీ కుమారుని నీవు పెంపవలయును.' అంతట అచ్చెరువుచే విచ్చులయిన కన్నులతో నేను సవినయంబుగా సత్కరింపఁగా, ఆ జక్కుల ముచ్చెకంటి దిచ్చుమొగం బాయెను." అంతట రాజహంసుఁడు కామపాలునికి యక్షకాంతతోడి కూటమి గలిగి నందులకు ఆశ్చర్యపడుచు మిత్రరంజకుని సుమిత్రుని రప్పించి, అతని తమ్మునికుమారుని అర్థపాలునిఁ గా పేర్కొని, వృత్తాంత మంతయుం దెలిపి, అప్పగించెను.

ఆ మఱునాఁడు వామదేవముని శిష్యుఁడు మఱి యొకడు ఆ యాశ్రమమందే వసించువాఁడు, దేవత యని కీర్తి వడసిన వానిని మదనునికన్న అందగానిని పుష్పకోమలుని బాలుని ఒకనిం దెచ్చి ఱేని మ్రోల నిడి యిట్లనియె.— రాజా, తీర్థయాత్రమీఁద నేను కావేరీ తీరమునకుం జని, అచ్చట అల్లలనాడు గుంగురులతోడి యీ కుఱ్ఱని తన యొడిలోఁ బెట్టుకొని యేడ్చుచున్న ముసలిదాని నొకతెం గని 'ఓ ముసలీ, నీ వెవ్వతెవు? ఈ కుమారుఁడు ఎవని కన్నుల పంటవు? ఈ పేరడివికి ఏల వచ్చితివి? నీ దుఃఖమునకు కారణ మేమి?' అని యడిగితిని. వృద్ధ రెండుచేతులతోను కన్నీళ్లు తుడుచుకొని, నన్ను తన వగపు మేకును పెకలింప సమర్థునిఁగా నెన్ని, దుఃఖకారణము నిట్లు వెల్లడించెను.

'ఓ విప్ర కుమారుఁడా, రాజహంసుని మంత్రి యయిన సితవర్మ యొక్క చిన్న కుమారుఁడు సత్యవర్మ తీర్థయాత్రార్థమై ఈ దేశమునకు వచ్చెను. అతఁడు ఒకానొక యగ్రహారములో కాళి యను పేరి యొక బ్రాహ్మణకన్యను వివాహమై, ఆమెకు సంతానము కలుగ నందున, ఆమె చెల్లెలిని గౌరి యను దానిని వివాహమై, ఆమెయందు ఈ కుమారునిం బడసెను. కాళి ఓర్వలేనిదై ఒకప్పుడు ఈ సిసువును దాది నయిన నాతోఁగూడ ఒక మిషచేత తోడ్కొని వచ్చి ఈ యేటఁ ద్రోచి పోయినది. ఒకచేత పిల్లవానిని ఎత్తి పట్టుకొని రెండవచేతితో ఈఁదుచు, ఏటివడిచేత వచ్చిన చెట్టుకొమ్మను పట్టుకొని దానిపై శిశువును ఉంచి, ఏటివడిచే కొట్టుకొని వచ్చుచున్నట్టి నన్ను ఆ చెట్టులోని నల్ల త్రాఁచొకటి కఱచినది. నాకు పట్టుఁగొమ్మ యయిన యా చెట్టు ఇచ్చట గట్టు తాఁకినది. విష మెక్కి నేను వచ్చినయెడల ఈ యడవిలో ఈ శిశువునకు రక్షకు లెవ్వరును లేరే యని శోకించుచున్నాను.'

అంతట తీవ్ర విష జ్వాలలు అంగంబుల దరికొల్పఁగా వృద్ధ నేల వ్రాలినది; జాలి గొని నేను మంత్రబలముచేత విషవేగమును దింప నేరక చెంగటి పొదలలో ఒకానొక యోషధిని వెదకి సంపాదించి తెచ్చునప్పటికి చచ్చి పోయినది. అంతట నేను ఆ ముదుసలికి దహన సంస్కారము గావించి శోకాకుల మానసుండ నయి ఈ బాలుని

అశరణుని కైకొంటిని. సత్యవర్మని వృత్తాంతమును విన్నప్పుడు ఆతని కాఁపుర మయిన యగ్రహారము పేరు విననందున ఆతని వెదకుట యశక్య మని తలపోసి, నీ మంత్రికుమారునికి నీ వే రక్షకుఁడవు అని, వీనిని నీకడకుం దెచ్చితిని. —దానిని విని, సత్యవర్మని స్థితి చక్కఁగా తెలియ నందులకు వగచుచు, రాజు, సుమతి మంత్రికి ఆతని తమ్ముని కుమారుని సోమదత్తుఁ డని పేరు పెట్టి, సమర్పించెను. ఆతఁడు తమ్ముఁడే వచ్చినట్లు సంతోషించి ఎక్కువ మక్కువతో వానిని పెంచుచుండెను.

---

## పూర్వ పీఠిక - ద్వితీయోచ్ఛ్వాసము.

### ద్విజోపకృతి.

---

తరువాత నొకప్పుడు, సకల కలలయందును గడి దేఱి, పూవుటమ్ములవాని చెలువంబు కలిగి, ఒండొరులతో సోదరులుగా వర్తించుచు, సాహసంబునఁ గుమారస్వామిని కేరడము లాడుచు, కేలుఁదామరలందు, గెలుపు సిడము, గొడుగు, కలశమును, రేఖారూపముగాఁ గలిగిన సుకుమార కుమార నికరము పరివేష్టించి యున్న రాజహంసునికడకు వామదేవముని వచ్చెను. రాజు ప్రణమిల్లి యాతిథేయ సత్కారములు గావింపఁగా నంగీకరించి, ముని, తన యడుగుఁదామర దోయిపై మూఁగుచున్న జాలుపాల తేంట్లు గల దైవైరులను ప్రక్కలింప నున్న యా కుమార సమాజమును బిగ్గఁ గవుంగిలించి, మితసత్యవాక్కుతో నాశీర్వదించి యిట్లనియె:—'ఓ రాజా, నీ కోర్కులపంటయో యన నిండు లావణ్యంబుతోడి జవ్వనంబును మంచి మిత్త్రులతోడి నీ పుత్త్రుఁడు అనుభవించుచున్నాఁడు. ఈ సంగడీఁతోఁగూడ దిగ్విజయమునకై తరలుటకు ఇతనికి ఇది సమయము. కావున క్లేశముల నోర్వఁగలయట్టి యీతనికి దిగ్విజయ ప్రయాణమును గావింపుము. మారునిం గేరు సౌరు గలవారు, పౌరుషమున శ్రీరామాదులకు ఈడయినవారు, కినిసిరేని పగతురను బుగ్గి గావించువారు, సమీరుని దాఁటెడు వడి గలవారు, ఆకుమారులు రణములకై కదలినంతనే తనకు మంచికాలము వచ్చె నని రాజు నిశ్చయించుకొనెను. కుమారునికి ఇతరులను మంత్రులనుగా నియమించి, మంచిబుద్ధు లుపదేశించి, మంచి ముహూర్తమందు తగిన పరివారముతో నాతనిని విజయార్థము తరలించెను.

రాజవాహనుఁడు మంగళసూచక మయిన శుభశకునముం గాంచి కొంతదవ్వరిగి వింధ్యారణ్య మధ్యంబునం బ్రవేశించెను. అచ్చట నొక్క పురుషుఁడు, మిక్కుటంపుఁ గైదువు ప్రేటుల గాయపుఁ గాయలవాఁడు, ఉక్కువంటి కక్కసంపు మేని వాఁడు, జన్నిదంబుచే బాఁపఁడనియు తీరుచేత బోయ యనియుం దోఁచుచున్న వాఁడు, క్రూర నేత్రుఁడు,

కానిపించి రాజవాహనునికి తగిన మరియాదలు సలిపెను. రాజవాహనుఁ డిట్లు ప్రశ్నించెను:—'ఓయి మానవుఁడా, నరుని పాదము సోఁకక, మెకములకు సుక మయి, చోరను వెలువడను దారులు ఘోర మయిన యీ కాంతారమున వింధ్యారణ్య మధ్యంబున నీవు ఒంటరిగా కాఁపుర మున్నా వేల? నీ బుజముమీఁది జన్నిదము పాఱుఁడ వని తెలుపు చున్నది; కత్తిగాయములు కిరాతుఁడ వని సూచించుచున్నవి. ఇందలి తత్త్వముం దెలుపుము.' ఆపురుషుఁడు ఇతఁ డెవరో తేజా దొలంకుచున్నాఁడు, నిక్కముగా మానుషాతీత పౌరుషుఁడు, అని తలంచి, మిత్త్రులవలన పేరును పుట్టువును తెలిసికొని యీతనికి తన వృత్తాంతమును ఇట్లు వచించెను.—

రాజకుమారా, ఈ యడవిలో వేదాది విద్యాభ్యాసము మాని, తమ కులాచారమును దూరమున కట్టి పెట్టి, సత్య శౌచాది ధర్మ నియమములను వదలి, పాపము నే రోయుచు, బోయలకు అనుచరులై, వారి యన్నముం దినుచు, జీవించు బ్రాహ్మణాధములు అనేకులున్నారు. వారిలో నే నొకని కొడుకను, నింద్య చారిత్రుఁడను, నా పేరు మాతంగుఁడు. నేను కిరాతులతోఁ గూడ దేశములు చొచ్చి, గ్రామములలో స్త్రీ బాల సమేతులను ధనికులను చెఱఁ బట్టి, వారిసర్వస్వము చూఱగొని, ముదించి దయమాలి చరించుచుంటిని. ఒకప్పుడు ఒక కాఱడవిలో నాతోడివారు ఒక బ్రాహ్మణుని చంపఁ దలంపం గాంచి, దయగొని, 'ఓరి పాపులారా, బ్రాహ్మణుని చంప రాదురా.' అని యడ్డ పడితిని. వారు కినుక మెయి కనులకుం గెంపు గదుర నన్ను తద్దయు బెదరించిరి. వారు ప్రేలిన కాఱులను విన నొల్లక నేను ఆ భూసురునిం గాచుటకు పెద్దతడవు పోరి వారిచే వ్రేటులు పడి ప్రాణము వదలితిని.

పిమ్మట యమ నగరమున కేఁగి అచ్చట దేహవంతు లయిన పురుషులు చుట్టుం గొలుచు చుండ, సభామధ్యంబునందు రత్నాల సింహాసనమందు కూర్చున్న యమధర్మరాజును దర్శించి ఆయనకు దండ ప్రణామ మాచరించితిని. అతఁడు నన్నుఁ గని తన మంత్రిని చిత్రగుప్తుని పిలిచి యి ట్లానతిచ్చెను.—'మంత్రీ, ఇతనికి మరణసమయము ఇది గాదు, దుష్ట చరిత్రుఁ డయినను ఇతఁడు బ్రాహ్మణునికొఱకు ప్రాణము వదలి నాఁడు. ఇటుపయిని ఇతనికి పాపము తీఱి పుణ్యకర్మలు సేయ బుద్ధి పుట్టును. పాపాత్ములు ఇచ్చట అనుభవించుచుండెడు తీవ్రవేదనలను కని, యితఁడు తన తొంటి శరీరమునకే పోవును గాక.' అంతట చిత్రగుప్తుఁడు నన్ను వెంటం దోడ్కొని నరకముం జూపెను. యమకింకరులు పాపులను కొందఱను ఎఱ్ఱగా కాలిన యినుపఁ కంబములకు కట్టుచు, కొందఱను కాఁగి తెరలుచున్న నూనె కళాయీలలో వైచుచు, మఱికొందఱను దుడ్డుగుదిలతో అవయములను చిదియఁ గొట్టుచు, వేఱు కొందఱను వాఁడి యులులతో నలుప్రక్కలను

చీల్చుచు, నుండిరి. చిత్రగుప్తుఁడు అట్టి యాయాతనాప్రాణుల నెల్లఁ జూపి, మంచి బుద్ధి యుపదేశించి, నన్ను వీడ్కొలిపెను.

అంతట నేను నా మునుపటి శరీరమునే చొచ్చితిని. మహారణ్యమునడుమ ఆబ్రాహ్మణుఁడు చలువసేవలు సేయుచు పరికించు చుండ, తాలిబండపయి పరుండి క్షణ ముంటిని. అంతలో నా వృత్తాంతము విని నా బంధువులు తటాలున కూడుకొని వచ్చి నన్ను ఇంటికిం గొనిపోయి నా గాయములను కుదిర్చిరి. బ్రాహ్మణుఁడు కృతజ్ఞతచేత నాకు అక్షరములు నేర్పి, నానా శాస్త్ర సారమును బోధించి, పాపక్షయ కారణ మయిన సదాచారము నుపదేశించి, జ్ఞాననేత్రమున కగపడువాఁ డయిన చంద్రార్ధశేఖరునిం బూజించు క్రమమునుం జెప్పి, నా పూజను కైకొని, చనియెను. అప్పటినుండియు నేను కిరాతులతో చేరి యున్న బంధుసమూహమును వదలి, ఎల్ల లోకముల గురువును ఇందుకళావతంసుని ధ్యానించుచు, ఈ యడవిలో కళంకులం దొలంగించుకొని వసించుచున్నాను. దేవా, నీతో విన్నవింపవలసిన రహస్యం బొండు కలదు, నాతో రమ్ము.—

ఇట్లు వచించి యాతనిని మిత్త్రబృందమునుండి ఎడగాఁ గొనిపోయి ఏకాంతమున "రాజా, కడచిన వేకువను గౌరీపతి కలలో వచ్చి, నన్ను కన్నులు మూసికొని నిద్రించుచున్న వానిని లేపి, నా వినయంపు మ్రొక్కు నంగీకరించి దయ దొలంకుచున్న మోము కాంతితో 'మాతంగుఁడా, దండకారణ్య మధ్యములో పాఱుచున్న యేటి తీర ప్రదేశమున, సిద్ధసాధ్యు లారాధించు స్ఫటికలింగమునకు వెనుకటి వైపున, పార్వతి యడుగుజాడ గుఱుతు గలిగిన తాలి చెంత, దైవ ముఖ మోయన బిల మొక్కటి కలదు. అందు బ్రహ్మశాసనమువలె నొక రాగి శాసనము ఉన్నది. దానిం గయికొని దానిమీఁద తెలిపి యున్న విధానమును అదృష్టవిజయముం బోలె నాచరించి, పాతాళలోకమునకు ఏలిక వగుదువు. నీకు సాయపడువాఁడు రాజకుమారుఁడు నేఁడో రేపో వచ్చెడిని.' అని ఆనతిచ్చెను. ఆ యానతి బడి నీవును వచ్చితివి. సిద్ధి నపేక్షించు నీ రాకకు సంతోషించుచున్న నాకు సాయము చేయుము." అని విన్నవించెను. అందులకు అంగీకరించి రాజవాహనుఁడు సంతుష్టిచే నొదలవంచి యా మాతంగుని వెంబడి అర్ధరాత్ర సమయంబున, నిద్రా పరవశులై యున్న మిత్త్రబృందమును వదలి, అడవిలో పలికిం బోయెను.

పిమ్మట అతని యనుచరు లెల్లరును రాజకుమారుని ఎటనుం గానక, డెందంబులందు దిగు లొంది, ఆ యా కాననములందు చక్కఁగ వెదకియు కనిపట్ట లేక, ఇంకను వెదకువారై, దేశాంతరములకు పోవం దలకొని, తా మెల్లరు మరలం గలయుటకై ఒకానొక తావును ఏర్పఱుచుకొని, చీలి పోయిరి.

జగదేకవీరుఁడు రాజవాహనుఁడు కాచుచుండుఁగా, సంతోషముతో మాతంగుఁడు ఆ బిలమును శివుఁడు చెప్పిన గుర్తులవలన తెలిసికొని నిర్భయముగా ప్రవేశించి, రాగిశాస

నముం గైకొని, ఆ దారినే పాతాళలోకమునకు పోయి, అచట ఒక పట్టణము చెంగట ఆటతోఁటలో తామరతంపర నిండిన కొలని చేరువను, శాసనములోఁ జెప్పిన ప్రకారము నానా విధ హోమ ద్రవ్యములను సమకూర్చి హోమము గావించి, కడపట సమిధలతోను నేతితోను అగ్నిని ప్రజ్వలింపఁజేసి, పుణ్యములయిల్లయిన తనయొడలినే, విఘ్న నివారకుఁడైన రాజవాహనుఁడు ఆశ్చర్యపడి చూచుచుండఁగా, మంత్రపూర్వకముగా ఆహుతి చేసి, మెఱుపుఁగాంతి గల దివ్యదేహమును బొందెను.

వెంటనే, రత్నాలంకారములు మెండుగాఁ దాల్చినట్టిది, సకలలోక రమణీమణులకు తిలకమయినట్టిది, యొక కన్య, వినయముతోడి సఖులు పెక్కుండ్రు వెంట రా, రాయంచ నడకతో మెల్లగా వచ్చి, ఆ బ్రాహ్మణోత్తమునికి మెఱుంగులు తుఱంగలించు మణి యొకటి పావడం బొసంగినదై, 'ఎవ్వతెవు నీవు?' అని యాతఁ డడుగఁగా, మెల్ల మెల్లగా మోమ్ముఁగే లెత్తి తమకంబున కోకిలయెలుంగుతో నిట్లు విన్నవించెను.—

"భూసురోత్తమా, నేను అసురోత్తముని కూఁతురను, కాళింది యను దాన. మా నాయన మహానుభావుఁడు ఈ లోకమునకు ఏలిక. ఆయన నిజ పరాక్రమముచేత అమరులను సమరంబునం దఱుమఁగా, సర్వలోక విష్ణుదేవుఁడు ఆయనను తెగటార్చినాఁడు. ఆయనం గోలుపోయిన వనటకడలిలో మునింగిన నన్నుం గని, కనికరంబున తపస్సిద్ధుఁ డొకఁడు 'బాలా, దివ్యదేహమును సాధించిన మానవుఁ డొకఁడు నవీనుఁడు నీకు వల్లభుఁడై పాతాళలోకము నెల్ల ఏలఁగలఁడు.' అని పచించెను. ఆ యాదేశమును విని, వానరాకను వాన కోయిలవలె నీ దర్శనమును ఎదురు సూచుచు, చిర కాల ముంటిని. నాకోర్కి తీఁగయొక్క పండయిన నీ రాక నెఱింగి, నా రాజ్యముయొక్క పట్టుఁగొమ్మలయిన మంత్రుల యనుమతితో, మదిచ్ఛ యనెడి తేరెక్కి, మదనుఁడే సారథిగా, నినుఁ గూర్చి వచ్చితిని. ఈ లోకముయొక్క రాజ్యలక్ష్మిని నీవు చేపట్టి, నన్ను ఆమెకు సవతినిగాఁ జేయుదువు గాక.' ఆ తరుణి యిట్లు విన్నవింపఁగా మాతంగుఁడు రాజవాహనుని యనుమతిని ఆమెను పెండ్లియై, అట్టి దివ్యాంగన దొరకినందులకు కరము హర్షించి, పాతాళ రాజ్యమును స్వీకరించి, పరమానంద భరితుఁ డాయెను.

మిత్త్రుల నందఱను ఏమార్చి వచ్చిన రాజవాహనుఁడు వారిం గనం గుతూహలియై భూలోకమునకుఁ బోఁ గోరి, తాఁ జేసిన సాయమునకుఁ సంతుష్టుఁడైన మాతంగుఁడు, కాళింది యిచ్చిన యామణిని ఆఁకలి దప్పి లోనగు క్లేశముల నడంచు దానిని కానుక యియ్యఁగా, గ్రహించి, తన్ను సాగనంపుటకు కొంత దూరము కూడ వచ్చిన యా మాతంగుని వీడుకొని, బిలమార్గమున వెలువడి భూలోకమునకు వచ్చెను. అచ్చట మిత్త్రి బృందముం గానక పుడమిం జరించుచు, ఉజ్జయిని యోరను ఒక యుద్యాన వనములో విశ్రమింప నుండి రమణీసమేతుని ఆప్తజన పరివృతుని ఆ యుద్యానమునకు

అందళములో వచ్చిన వాని నొక పురుషునిం గాంచెను. ఆతఁడును పరమానందముచేత నుల్లము పల్లవింపఁగా వదనారవిందము వికసిల్లఁగా 'అహో! ఈతఁడు నాదొర, సోమ వంశమునకు శేఖరీభూతుఁడు విమల కీర్తి నిధానము రాజవాహనుఁడు! ఏమి నా భాగ్యము! ఆకస్మికముగా ఈతని యడుగుల దరిం జేరితిని! ఇప్పుడు నాకు మితి లేని కన్నుల పండువు కలిగినది!' అని తొట్రుపాటుతో అందళము దిగి, వడివడిగా అడుగు లిడుచు, విలాసహర్షోత్కర్షముతో నిండి, తన వైపు నూఁడునాలుగు అడుగులు లేచి ఎదురు వచ్చిన యా రాజవాహనుని పాదకమలములకు నుల్లసిల్లుచున్న మల్లెపూ సరము జాఱుచున్న సిగ సోఁక మ్రొక్కెను. రాజవాహనుండును తన కనుదోయినుండి ఆనంద బాష్పములు వెల్లి వొడువ, ఒడ లెల్ల గగుర్పొన్న యా పురుషుని బిగ్గఁ గవుంగిలించి 'అహో! సౌమ్యుఁడా సోమదత్తుఁడా!' అని పలుకరించెను.

అంతట ఒక పొన్న చెట్టు క్రింద చల్లని దట్టంపు నీడలో కూర్చుండి రాజా ప్రేమ దొలంక, 'సఖుఁడా, ఇంతకాలము ఏ దేశములో ఏ ప్రకారము నీవు ఉంటివి? ఇప్పుడు ఎట కేఁగుచున్నావు? ఈ యెలనాగ యెవతె? ఈపరిజనము నీ కెట్లు కలిగి నది? అంతయుం జెప్పుము.' అనెను. అతఁడును మిత్త్రసందర్శన యోగము చింతా జ్వరంపుఁ బెంపుం ద్రోపాడ కేలుఁదామరదోయి మోడ్చి వినయము గదుర తన వృత్తాం తము నిట్లు వక్కాణించెను.

---

## పూర్వపీఠిక - తృతీయోచ్ఛ్వాసము.

## సోమదత్తచరిత్రము.

---

దేవా, నీపాదకమలములం గనఁ గోరి తిరుగుచు నేను ఒకానొక యడవి ప్రదేశ మందు దప్పిగొని తీవలు పొదవికొనిన చల్లని యేటినీరు త్రాగుచుండఁగా, అచట వెలుం గులు పిసాళించు రత్న మొకటి యగపడెను. దానిం గయికొని కొంత దారి నడచి మెండుకొన్న రవి యెండకు బెండువడి ఈ కానలోనే ఒక దేవళముం జొచ్చితిని. అందు దీనవదనుని బహు పుత్త్రపరివృతుని ముసలి బ్రాహ్మణు నొకనిం గని దయ గలిగి కుశల మడిగితిని. దైన్యముచే వెలవెలం బోవుచు మనస్సు నిండ ఆశ పెట్టుకొని బ్రాహ్మ ణుఁడు 'మహాభాగుఁడా, తల్లిలేని యీ కొమరులను అనేకోపాయములచేత పోషించుచు, ఇప్పుడు ఈ పాడుదేశములో బిచ్చ మెత్తి వీరికి పెట్టుచు ఈ శివునిగుడిలో వసించు చున్నాను.' అని చెప్పెను. 'ఓ భూసురుఁడా, ఈ దండునకు దొర ఏ దేశపురాజు? ఇతని పే రేమి? ఇట కేల వచ్చినాఁడు?' అని నే నడుగ బ్రాహ్మణుఁడు వచించెను:—

'సౌమ్యుఁడా, ఈ దేశపు రాజు వీరకేతుఁడు. ఇతని కొమారితను వామలోచన యను పేరి తరుణీమణిని సాటి లేని లావణ్యము గలదానిని లాటేశ్వరుఁడు మత్తకాలుఁ డను వాఁడు విని విని తన కిమ్మని ఇతని నడిగెను. వీరకేతువు ఆ ప్రార్థనను తిరస్కరించెను. మత్తకాలుఁడు వీరకేతుని నగరమును పాటలిని ముట్టడించెను. అంతట భయపడి వీరకేతుఁడు కొమారితను గొప్ప కానుకగా మత్తకాలునికి అర్పించెను. తరుణి దొరకినందులకు సంతుష్టుఁడై లాటరాజు తన నగరమందే వివాహము మాడఁ గలయు నని నిశ్చయించుకొని, తన దేశమునకుం బోవుచు, వేఁట యాటకై యీ కాటిలో దండు విడిసినాఁడు. కన్యకం దోడుగా పంపఁబడిన వీరకేతుమంత్రి మానపాలుఁ డను నాతఁడు కరముపరువు గలవాఁడు చతురంగబలసమేతము గా వేఱొకతావున శిబిర మేర్పఱుచుకొని తనదొరకుఁ గలిగిన యవమానమునకు మనంబున ఖేదంబు నొంది లోలోపల బెడిసియున్నాఁడు.' అని.

పాపము! ఈబ్రాహ్మణుఁడు పెక్కు బిడ్డలవాఁడు విద్వాంసుఁడు పేద ముసలియుఁ గాన దానయోగ్యుఁడు అని కరుణాపూర్ణమానసుఁడనై ఆతనికి ఆ రత్నము నిచ్చితిని. మహాసంతోషముచే ముఖము వికసింప బ్రాహ్మణుఁడు నాకు పెక్కు దీవనలు వచించి ఎటకో పోయెను. దారి నడిచిన శ్రమచేత నేను అచటనే పరుండి హాయిగా గాఢనిద్రం జెందితిని. పిమ్మట ఆబ్రాహ్మణుని పెడ రెక్కలు విఱిచి కట్టి ఒడ లెల్లఁ జాఱలు చాఱలుగా చబుకులతో దెబ్బలు కొట్టి పలువురు ఖడ్గపాణులు తోడ్కొని వచ్చిరి. వారికి 'వీఁడుగో దొంగ' అని యాబ్రాహ్మణుఁడు నన్ను చూపెను. అంత నా రాజభటులు ఆ బ్రాహ్మణుని వదలినవారై, ఆ రత్నము నాకు దొరకినవిధమును నేను చెప్పఁగా నమ్మక, నిర్భయుని నన్ను గాటముగా త్రాటం గట్టి చెఱసాలకుం గొనిపోయి 'వీఁడుగో నీ చెలికాండ్రు' అని సంకెలలం బడియున్న కొందఱఁ జూపి నాకును కాళ్లకు సంకెలలు వైచిరి.

నేను తప్పించుకొన నుపాయము లేని క్లేశము ననుభవించుచు, ఏమి చేయనుం దోఁపక, ఆబద్ధులను 'గాటంపుబీరంబు గల యో మేటిమగలారా, ఏమికతంబున మీరు చేటు దెచ్చున దైన యీ చెఱకాఁపురంపు దుఃఖము ననుభవించుచున్నారు. మీరు నాకుం జెలికాండ్రఁట, అది యేమి?' అని యడిగితిని. అంత నా చోరవీరులు ఆతీరున నున్న నన్నుం గని, మున్ను ఆబాడబునివలన నేను విన్నయా లాటరాజు వృత్తాంతమును వక్కాణించి, వెండియుం బలికిరి. 'మహాభాగుఁడా, మేము వీరకేతు మంత్రికి మానపాలునికి కింకరులము. ఆయన పంపున లాటరాజును పరిమార్చుటకై రాత్రి సొరంగముగొండ అతని నిలువరముం జొచ్చి, అట ఆతఁడు లేమిచే విసుగొంది, పెక్కుధనము కొల్లగొని, పేరడవిం జొచ్చితిమి. మఱునాఁడు మమ్ము వెదకుకొని, ఆతని లెంకలు పలువురు వచ్చి దొంగసొత్తుతోడి మమ్ము చుట్టవైచికొని, దిట్టముగా కట్టి, తమపాళెంబునకుం గొనిపోయి, సొత్తునెల్ల సోదన చేసికొనుచో

వెల లేని మాణిక్య మొకటి లేనందున, మమ్ముఁ జంపుటకును మాణిక్యముం బడయుటకును మమ్ము సంకెలల వైచినారు. రత్నవృత్తాంతమును విని రత్నముతో పట్టుపడిన మానిసిని ఎఱింగి యున్న నేను అదే ఆ భూదేవునికి నే నిచ్చిన మాణిక్య మని నిశ్చయించుకొని, ఆ దుఃఖితులకు నా పుట్టువును నా పేరును నిన్ను వెదకుచు నేను దేశములు భ్రమ్మరుచుంటయుం దెలిపి, వారితో సమయోచితము లయిన ముచ్చటలతో చెలిమి కావించితిని. పిమ్మట అర్ధరాత్రమందు వారికిని నాకును సంకెలలం బగులఁ గొట్టి, వారిని వెంటఁ బెట్టుకొని, ద్వారమందు నిద్రించుచున్న పహరా జవానులచేతి కైదువులం గయికొన్న వారమై, ఎదురుపడిన పాళెపుగస్తీలను పగటిమి వాఁడి మీఱ క్రీడగా మీఁదఁ బడి త్రోసికొని పోయి మానపాలుని శిబిరముం జొచ్చితిమి. మానపాలుఁడు తన భటులవలన నా కుల గౌరవములను అప్పుడు నా చూపిన యాపరాక్రమమును విని నన్ను గౌరవించెను.

మఱునాఁడు మత్తకాలుఁడు పంపిన భటులు కొందఱు మానపాలునికడకు వచ్చి 'మంత్రీ, మారాజునింట సొరంగముగుండ బహుధన మపహరించి దొంగ గండంద్రులు నీ శిబిరముం జొచ్చి యున్నారు. వారి నప్పగింపుము. అప్పగింప వేని ఎంతయుం జేటు వాటిల్లును.' అని కర్కశముగా వక్కాణించిరి. దానిని విని కోపంబున కన్నులందు కెంపు దీపింప మంత్రి 'లాటరాజన నెవఁడు? వానితో చెలిమి యేమ నెట్టిదె? మఱి యీ ముక్కడిని కొలుచుటవలన ఫల మేమి? ' అని వారిని ధిక్కరించెను. వారును మానపాలుఁడు పలికిన కాఱులు అట్లే మత్తకాలునికి వచించిరి. అంతట లాటరాజు కోపంబు హెచ్చు పెరుఁగ బాహుబల దర్పంబున కొంచెపాటి దండుతో పోరుటకు మానపాలుని మీఁదికి వచ్చెను. మున్నె పోరాటమునకు నిశ్చయించుకొని యున్న మానపాలుఁడు సన్నద్ధు లయిన జోదులం దోడ్కొని పోరు కోరికతో నిర్భయముగా వెడలెను. నేను సత్కార పూర్వకముగా మంత్రి యిచ్చిన వానిని— పెక్కుగుఱ్ఱములును చతురుఁ డయిన సారథియుం గల రథమును, నా చేతికి తగిన వింటెని, నానావిధ బాణములు నిండిన పొదుల జతను, తగిన కైదువులను కయికొని, యుద్ధ సన్నద్ధుఁడ నై, నా బలంబునందుఁ గల నమ్మకముచే వైరిని వెలార్పం గడంగిన మంత్రితోఁ గూడ పోయితిని. ఒండొరులపై మత్సరంబున దొమ్మిగా పోరుచున్న యా యిరువాగును దాఁటి, పెచ్చు పెరుఁగుచున్న భుజదర్పాడంబరముతో పగతుని మేనిపై అంపవాన గురియించుచు, వానిం గొట్టితిని. మఱి తత్తడులను హెచ్చరించి, వడి మెఱయ నా తేరిని వాని కడకుం దోలి, వాని తేర మీఁదికి చెంగున లంఘించి వాని తలను కోసి వైచితిని.

అతఁడు కూలఁగా, మిగిలిన తదీయ సైనికులు పరారు కాఁగా, నానావిధ మయిన యశ్వ గజాది వస్తు సమూహమును స్వీకరించి పరమానంద పరవశుఁ డైె మానపాలమంత్రి నాకు పలువిధముల సత్కారములు గావించెను. అతఁడు ముందుగా పంపిన కింకరులవలన

రాజు నావృత్తాంతము విని సంతోషించి ఎదురుగా వచ్చి, నామగంటిమికి అచ్చెరువడుచు, మహోత్సవముగా మంత్రి బాంధవ సమ్మతితో శుభదినంబున తన కొమారితను నాకిచ్చెను. అంతట నేను యువరాజనై మామగారిచిత్తము వచ్చునట్లుగా నడచుకొనుచు ఈ వామలోచనతోఁ గూడ నానావిధ సౌఖ్యము లనుభవించుచు నీతోడి యెడఁబాపు దుఃఖంపుటలుఁగు హృదయంబుం జీలుచుండ, సిద్ధాదేశప్రకారము మిత్త్రి దర్శనము నొడఁగూర్చునదైన యీ తావునకు మహాకాలక్షేత్రవాసి యగు మహేశ్వరుని సేవించుటకై ప్రేయసితోఁ గూడ నిపుడు వచ్చినాఁడను; భక్తవత్సలుఁ డయిన గౌరీపతి ప్రసాదంబున నీ పాదారవిందముల సందర్శనముకలని యానందసందోహముం బొందినాఁడను.

ఇట్లు సోమదత్తుఁడు చెప్పఁగా విని రాజవాహనుఁడు అతని పరాక్రమమును మెచ్చుకొని నిరపరాధులను దండించునదైన విధిని నిందించి, ఆతనికి క్రమముగా తన చరిత్రమును వచించెను. ఆ యవసరంబున ఎదుట పుష్పోద్భవుఁ డగపడెను. తొట్రుపాటుతో తన యడుగుల వ్రేళ్లకు నుదురు సోఁక మ్రొక్కి మోడ్పుఁగేలెత్తి నిలిచిన యాతనిని రాజవాహనుఁడు లేచి క్రిక్కిఱియఁ గవుఁగిలించి, ఆనందబాష్పములు క్రందుకొన్న వికసిల్లిన కన్నులతో 'సౌమ్యుఁడా, సోమదత్తుఁడా, వీఁడుగో మన పుష్పోద్భవుఁడు!' అని యాతని కాతనిం జూపెను. వా రిరువురును చిరవియోగదుఃఖమును మఱచి ఒండొరుల కవుఁగిటి సుఖమును అనుభవించిరి. అంతట ఆచెట్టునీడలో నే కూర్చుండి రాజు ఇట్లు ముచ్చటించెను.—'మిత్త్రులారా, బ్రాహ్మణునికార్యము చేయువాఁడనై, నేను, మిత్త్రులకు తెలిసినచో తప్పక విఘ్నము సేయుదు రని మిమ్ము నిద్రితులను వదలి వెడలితిని. తర్వాత మిత్త్రులు మేలుకొని ఏ మనకొని ఏమి నిశ్చయించుకొని నన్ను వెదకుటకై ఎటకుఁ బోయిరి? నీవు ఒంటిగా ఎక్కడికి పోవుచున్నావు?' ఇట్లు రాజవాహనుఁ డడుగఁగా, అతఁడును ఫాలతటంబునం గేలు మోడ్చి వినయము దొలంక నిట్లు వక్కాణించెను.

---

పూర్వపీఠిక - చతుర్థోచ్ఛ్వాసము.

పుష్పోద్భవ చరితము.

---

దేవా, భూసురునికి సాయపడుటకే నీవు పోయితి వని నిశ్చయించుకొనియు, నీవు పోయిన దేశ మేదో నిర్ణయించుటకు శక్యము గాక, మిత్త్రిబృందము ఒండొరులం బాసి నిన్ను వెదకుటకు దిక్కుదిక్కునకుం బోయెను. నేనును నిన్నే వెదకుటకై దేశములు ద్రిమ్మరుచు ఒకప్పుడు మింటినడిమికి వచ్చిన మింటిమణి వెలుంగుల మంట నోర్వలేక, కొండ పఱియలలో నొకచెట్టుక్రింద దట్టంపు నీడలో క్షణము కూర్చుంటిని. నా ప్రో

లను ఆమట్టమధ్యాహ్నపువేళ అవయవము లన్నియు ముణుఁచుకొని, తొలుత చేట వలెను, తర్వాత తాఁజేటి వలెను, ఒకనీడ తోఁపఁగా, నేను మొగమెత్తి ఆకాశమునుండి మహావేగమునం బడుచున్న యొక మనుష్యుని కనికరముచే కరఁగిన యుల్లంబుతో నడుమనే పట్టుకొని, అల్లనల్లన నేలమీఁద ఉంచి, ఎత్తునుండి పడినందువలన నష్టమయిన తెలివిని చలువసేవలచేత మరల రప్పించి, దుఃఖాతిశయముచేత కన్నుల బాష్పధారలు గురియుచున్న యాతనిని కొండచఱియనుండి పడినందులకు కారణ మడిగితిని. ఆతఁడు వ్రేళ్లతో కన్నీళ్లు తుడుచుకొని యిట్లు వచించెను. 'సౌమ్యుఁడా, మగధరాజు మంత్రి పద్మోద్భవుఁ డుండెనే, ఆతని కుమారుఁడను రత్నోద్భవనాముఁడను నేను బేరమునకై కాలయవనద్వీపమునకుఁ బోయి, అట నొక వైశ్యకన్యను వివాహమై, ఆప్రేయసితోఁ గూడ మరలి వచ్చుచు, దరికి ఎక్కువ దవ్వుగాని చోటనే ఓడ పగిలినందున, అందఱును మునిఁగి పోఁగా, ఎట్టులో దైవానుగ్రహంబున దరిఁ జేరి, నా రమణీమణితోడి యెడఁబాపునంత కడలిలో ఈఁదుచు, ఒకానొక సిద్ధతాపసుని యాదేశమందలి యాదరముచేత పదునాఱు సంవత్సరములు ఎట్టకేలకుఁ గడపియు, దుర్దశకు అంతము గానక, ఒక్కుమ్మడి దుఃఖశాంతికై కొండచఱియనుండి పడితిని.' అని.

ఆహాదన ఏదో స్త్రీయెలుఁగు వినఁబడెను —'ఇది సరిగాదు సుమా, పెనిమిటినిం గుమారునిం గలసికొనియెద వని సిద్ధుఁడు చెప్పియుండఁగా, వియోగము నోర్వక చిచ్చులో నుఱికెదవు.' అని. దానిని విని, నామనస్సునకు తనంతటనే తెలిసిన యానాతండ్రితో, 'బాబూ, నీతో విన్నపము సేయవలసిన విషయములు పెక్కులు గలవు. కానీ, తర్వాత సమస్తమును చెప్పెదను, ఇప్పుడు స్త్రీమొఱను నేను ఒప్పరికింపఁ జనదు. నిముసము నీవు ఇచట నుండుము.' అని వచించి, వెంటనే వడిగా కొంచెము అవలికి నడచితిని. అచట ఎదుట భయంకర జ్వాలామాలా సముల్లోల మయిన చిచ్చునందు అంజలిమోడ్పుతోఁ జొచ్చుచున్న తెంపరిని చంపకాఁగిని కాంచి, తటాలున నిప్పునుండి వెలికి తెచ్చి, మొఱ వెట్టుచున్న యా ముసలిదానితోఁ గూడ నాతండ్రికడం జేర్చి, ముసలిని 'ముసలమ్మా, మీ రెక్కడివారు? ఈ కాఱడవిలో ఏకారణంబున దుర్దశం బొగులుచున్నారు? చెప్పుము.' అని యడిగితిని.

ఆమె డగ్గుత్తికతో చెప్పెను.—"కొడుకా, ఈ కోమలి కాలయవనద్వీపములో కాలగుప్తుఁడను నొక వర్తకుని కొమారిత, పేరు సువృత్త, తనకాంతుఁడగు రత్నోద్భవునితో వచ్చుచు, సముద్రములో ఓడ మునిఁగి పోఁగా, తన దాది నయిన నాతోఁ గూడ దైవయోగంబున నొక పలకం బట్టుకొని గట్టునకు వచ్చినదై, ప్రొద్దులు సొచ్చి ఒక కానలో కుమారునిఁ గనియెను. నా దుర్దృష్టముచేత ఆబాలుని ఆడేనుఁగు కైకొనఁగా, నేనే తోడుగా తిరుగుచు, 'ఇఁక పదునాఱేండ్లకు మగనిని కొడుకును కలసికొందువు' అని

యొక సిద్ధ తాపసుఁడు చెప్పఁగా, ఆమాటను నమ్మికొని ఒక పుణ్యంపు మునిపల్లెయందు ఆ చెప్పినంత కాలమును గడపి మేరలేని శోకమును ఓరువలేక, మంట లెగయుచున్న నిప్పులో తన దేహమును ఆహుతి సేయుటకుఁ గడఁగినది.'' అని. నేను దానిని విని, ఆమెను మాయమ్మనుగా తెలిసికొని, ఆమెకు సాష్టాంగ దండ ప్రణామం బాచరించి, ఆమెకు నా వృత్తాంతము నంతయు చెప్పి, దాదివచనముచేత వికసిల్లిన మోముతో అచ్చెరువుచేత హెచ్చుగా విచ్చిన కన్నుదోయితో నాచేఁత నన్ను నాయనను చూపించితిని. తల్లిదండ్రులు ఇరువురును ఒండొరులను ఆనవాలు పట్టి సంతోషముతో నిండిన యంతరాత్మలతో ఆనంద బాష్ప వర్షములతో నన్ను తోప్పదోఁగించి, చిక్కఁగ గవుంగిలించి, ఔదల మూర్కొని, ఒక చెట్టు నీడయందు కూర్చుండిరి. 'మహారాజు రాజహంసుఁడు ఎట్టు లున్నాఁడు?' అని నాయన యడుగఁగా నేను ఆయనకు దొరతనము తొలఁగుటయు, నీ పుట్టుకయు, కుమారు లందఱు దొంకుటయు, నీవు దిగ్విజయముకై తరలుటయు, నీవు మాతంగునితో పోవుటయు, నిన్ను మేము వెదకం జొచ్చిన కారణమును, సర్వము చెప్పితిని. తర్వాత వారిని ఒకానొక మునీంద్రుని తపోవనములో నుంచితిని.

తర్వాత స్వామిని వెదకుటకు పూనుకొని నేను సకలకార్యములకును సాధనము ధనము గదా యని నిశ్చయించుకొని, నీ యనుగ్రహంబున దొరకిన యొక సాధకునికి సహకారము సేయ నేర్పరి యగు శిష్యబృందమును ఏర్పాటు చేసి, వింధ్యారణ్యము నడుమ పాడుపడిన ప్రాఁతపట్టణముల తావులకుం బోయి, నానా నిక్షేపములకు గుఱుతు లయినట్టి చెట్టులకు క్రింద పాఁతి పెట్టిన కలశములను ధనసంపూర్ణంబులను సిద్ధాంజనముచేత తెలిసికొని, చుట్టును రక్షకులను ఉంచి, త్రవ్వెడు పనిముట్టులతో వెకలించి, లెక్కలేని పసిఁడి నాణెములను ప్రోగు పోసి, కొంచెపాటి దూరములో ఆ సమయాన వచ్చి విడిసిన వర్తకుల బిడారమునకుం బోయి, అందు బల్లిదము లయిన యెద్దులను గోనెలను విలిచి, ఆ గోనెలకొలఁది ధనమును వేఱుసర కని మిష పెట్టి ఆ యెద్దులమీఁద మెల్లగా ఆ బిడారుం జేరచితిని. దాని యొడయఁడు చంద్రపాలుఁ డను కోమటికి కుమారుఁడు. నేను ఆతనితో చెలిమి చేసికొని అతనితోఁ గూడ నే ఉజ్జయిని కేఁగితిని. పిమ్మట నాతల్లిదండ్రులను గూడ ఆపట్టణమునకు చేరపించితిని. చంద్రపాలునితండ్రి సకలసుగుణముల పుట్టినిల్లయిన బంధుపాలుఁడు తోడ్కొని పోఁగా మాళవరాజును దర్శించి, అతని యనుమతి మీఁద ప్రచ్ఛన్నముగా నచట నివసించి యుంటిని. తర్వాత అడవిప్రదేశములలో నిన్ను వెదకం దలకొన్న నన్ను విని పరమమిత్త్రుఁడు బంధుపాలుఁడు 'మిత్త్రుఁడా, అపార మయిన భూలోక మెల్ల వెదకుట నీవలన నగునా! నీవు మనోదైన్యము మాని ఊర కుండుము. నీ నాయకుని దర్శనమును తెలిపెడి శుభశకునమును చూచి నేను చెప్పెదను.' అని మందలించెను.

అమృతమువంటి యీ మాట నాహృదయమును ఓదార్పఁగా, నేను ప్రతిదినము అతని సరసలో నుండి, ఒకనాఁడు ఎలజవ్వనము నివ్వటిల్లిన యంగంబుల యిందువదనను నేత్రచంద్రికను బాలచంద్రిక యను బాలామణిని మూర్తీభవించిన కోమటియింటి సిరినిం బోలె కాంచి, దాని లావణ్యముచేత నాదిట్టతనంబు అట్టిట్టు కాఁగా, పూవుటమ్ముల జోదునకు గుఱి యైతిని. బెదరిన లేడిలేఁగ కనుఁగవంటి కనులు గలది ఆకలికి పూవుటంప జోదు కోలగాఁ గ్రాలుచున్న క్రేఁగంటి చూపుతో నన్ను సారె సారెకుం జూచి, మెల్లని పిల్లతెమ్మెరకు అసియాడుచున్న తీవయుం బోలె చలించెను. ఎదు నగుచు కుదియుచు కలపునకును లజ్జకును నడుమ అపాంగరంగంబున నర్తించుచు ఉన్నట్టి యొకతీరుచూపుల చేత ఆకొమ్మ నాకు తనమనమ్ములోని గుట్టును వెల్లడించెను. నేను చదురుమెఱయు రహస్య వ్యాపారములచేత అయ్యువిదమదిలోని యనురక్తిని రూఢిసేసికొని సులువయిన సంగమోపాయమును ఆలోచించుచుంటిని. ఇంతలో నొకనాఁడు బంధుపాలుఁడు శకునములచేత నీ పోబడి కనిపట్టువాఁడ నై నగరముతుది యుద్యానవనమునకు నన్నుం దోడ్కొని చని, ఒకచెట్టునందు పక్షికూఁతులను వినుచుండెను.

వలవంత నొక్కింత కొంత అంత సేయుటకై ఉద్యానభువిం గ్రుమ్మరుచు నేను తామర కొలంకుదరిని చింతాధీనమానసను దీనాననను నామనోరథంబుల యాటపట్టును బాలచంద్రికను గాంచితిని. తత్తఱముతోడ ప్రేమలజ్జాకుతూహలంబులు పెనంగొనఁ జిత్తహారులైన యమ్మత్తకాశిని బిత్తరపుఁ జూడ్కుల యొత్తున మత్తిల్లి, ఆకోమలి మోముఁదమ్మియందు మదనకదనాయాస సంజాతమయిన విషాదంబుం గనిపట్టి, అందులకారణ మెఱుంగువాఁడనై, అల్లనం దత్సమీపంబునకుం జని, 'సుముఖీ, నీ నెమ్మోముఁదమ్మియందలి దైన్యమునకుం గతం బేమి?' అని యడిగితిని. ఆసుందరి ఏకాంతమువలని నమ్మకముచేత నానయు జంకును మాని అల్లన నిట్లనియె.—'సౌమ్యుఁడా, మాళవరాజు మానసారుఁడు ముదిమి పెంపున తన తనయుని దర్పసారుని ఉజ్జయినికి నభిషేకించెను. ఆకుమారుఁడు ఏడుసముద్రముల మేరతోడి భూమండల మెల్ల నేలం గోరి, తన మేనత్త కొమరులును ఉద్దండకర్ములును అగు చండవర్మ దారువర్మలచేతిలో రాజ్యభారమును ఉంచి, తపము సలుపుటకు రాజరాజగిరికిం బోయినాఁడు. రాజ్య మంతయు ఎదురు లేకుండ చండవర్మ యేలుచుండఁగా, దారువర్మ అన్నమాటను మేనమామమాటను సరకుగొనక పరదారగమన పరధనాపహరణాదిదుష్టకర్మలు చేయుచున్నవాఁడు, ననవిలుకాని కెన యైన నీయొక్క లావణ్యమునకు చిత్తము నప్పన చేసిన నన్ను ఒకప్పుడు చూచి, కన్నియం జెఱుచు దోషమునకు వెనుదివియక బలిమి సేయ నుద్యమించుచున్నాఁడు. ఆచింతచే దిగులుపడి యున్న దాన.' ఆ చెలిమనంబున నిండియున్న నామీఁది యనురాగమును నా మనోరథము నెఱవేఱుటకు కలిగిన విఘ్న

మును విని, కంటి నిండ కన్నీరు గ్రమ్మిన ప్రేయసి నూరార్చి, దారువర్మను దోరించు నుపాయ మారసి యిట్లు హెచ్చరించితిని.

తరుణీ, నిన్నుఁ గోరిన యాదుష్టచిత్తుని మాయించుటకు సులువయిన పన్నాగము నాలోచించితిని.—“ ‘యక్షుఁ డొకఁడు బాలచంద్రికను పూనియున్నాఁడు. దాని యందంపు సంపదచే బందంబు వడిన డెందంబువాఁడు సంబంధయోగ్యుఁడు తెంపరి ఎవఁడు కామకేళీ మందిరమందు ఆ యక్షుని ఓడించి ఒంటిచెలికత్తెతోడి యా హరిణాక్షితోడ సల్లాపసుధా మధురిమ నాస్వాదించి చెక్కు చెదరక వెలువడునో, వాఁడు జక్కవలకవ యనెడి సందియమునకు ఇక్క అయిన పాలిండ్లదానిని అక్కలికిని పెండ్లియాడఁ దగును.’ అని సిద్ధుఁ డొకఁడు వచించినాఁడు.’ అని పురజనులయెదుర నీవారు నిజ మాడువారు పలుమాఱు వలుకవలయును. అంత దారువర్మ ఇట్టివాక్యమును విని విని భయపడి మిన్నక యున్నచో మంచిదే. ఒకవేళ దౌర్జన్యంబున నీతోడి కూటమిం బాటించు నేని, అప్పుడు వానితో నీ వారు ‘సౌమ్యుఁడా, దర్పసార భూనాయకుని మంత్రి వైన నీకు ఈయింట సాహసమాచరించుట తగవు గాదు. పురజనులు, సాక్షులుగా నీయింటికి ఆకోమలాక్షిం గొనిపోయి, దానితో నచ్చట క్రీడించి ప్రాణములు దక్కించుకొంటివేని, అప్పుడు, ఆతరుణిం బరిణయం బై, నీ కోరినభోగముల ననుభవింపుము.’ అని పలుక వలయును. వాఁడును అందులకు అంగీకరించును. సఖీవేషము దాల్చిన నేనే తోడుగా కూడ రాఁ, నీవు వాని మందిరమునకుం బొమ్ము. నేను ఏకాంతగృహమందు పిడికిళ్లతోను మోఁకాళ్లతోను అడుగులతోను వానిని గ్రుద్ది పొడిచి తన్ని క్షణములో బిద్దించి, వెండియు సఖీమిషచే నీతోఁగూడ నిశ్శంకముగా వెలువడెదను.

చెలి ఈ యుపాయమునకు అంగీకరించి లజ్జాభయముల నుజ్జగించెను. వెండియు వచించితిని.— ‘ప్రేయసీ, నీ తల్లిదండ్రులతోను అన్నతోను మన ప్రేమాతిశయమును వక్కాణించి తప్పక మనకు వివాహము గావించునట్లు వారిని వేఁడుము. వారును వంశము సిరి లావణ్యము యౌవనము కలవానికి నాకు నిన్ను తప్పక యిత్తురు. దారువర్మకై నా యరసిన మారణోపాయమును వారికి తెలిపి వారి యుత్తరమును నాకు చెప్పుము.’ అని. ఆతన్వంగి అరవిరిసిన తమ్మిం బోని నెమ్మోముతో ‘సొబగుఁడా, క్రూరకర్ముని దారువర్ముని నీవు నంపుట సరియైన పని. వాఁడు తెగటారెనా, తప్పక నీ కోరిక పండును, కావున నీవు ఆపని చేయవలసినది. నీవు చెప్పిన దెల్ల నేను అట్లే చేసెదను.’ అని వాక్రుచ్చి, నన్ను సారెసారెకు వెనుకకు మోము మరల్చి కాంచుచు మెల్ల మెల్లగా ఇంటికిం జనియెను. నేనును బంధుపాలునిం గలసికొంటిని. ఆతఁడు శకునంబులం బరికించి, ముప్పదియవ దినము ముగియఁగానే నీదర్శనము అయ్యెడు నని చెప్పెను. తర్వాత బంధుపాలుఁడు నాతోఁగూడ తన యింటికిం జని నన్ను నాయింటికి వీడ్కొలిపెను.

నా మోసంపుఁ బన్నాగంపు టురిత్రాటిలో తగులుకొన్న దారువర్మ రతిమందిరమందు రమించుటకు పిలిపించును, పోవునదై, బాలచంద్రిక నాకడకు దూతిం బంపెను. నేనును రతనాలవి అందెలు ఒడ్డాణము కడియాలు పంజాలకమ్మలు ముత్తెపుఁ బేరులు వలిపము కాటుక అను నీ పలుదెఱంగుల పడఁతి తొడవులను మేన నాయాయి తావుల నిపుణముగాఁ దాలిచి, ఒప్పుల కుప్పగా సవరించుకొన్న వేసముతో ఆ ప్రాణవల్లభతోఁ గూడ వాని యింటి హజారము కడకు పోవుదెంచితిమి. మా రాకను దౌవారికులు తెలుపఁగా దారువర్మ ఆదరముతో ఎదు రేఁగుదెంచి ద్వారముకడనే పరివారము నెల్ల నివారించి బాలచంద్రికను నన్నును సంకేతగృహమునకుం దోడ్కొని పోయెను.

ఊర నెల్ల అల్లరి యై యున్న యక్షకథను పరీక్షించువారై పౌరులును కుతుకంబున దారువర్మని హజారము నొద్ద మూఁగిరి. తెలివి మాలినవాఁడు దారువర్మ రాగంబు పెల్లు రేఁగి, రతనాలు చెక్కిన బంగారు మంచముపై హంసతూలిక గ్రుక్కిన పఱపుపై ఆతరుణిని చేర్చి, దానికిని, చీఁకటిలో బొత్తిగా మగతనము ఎఱుకపడని మనోహర స్త్రీ వేషికి నాకును, బంగారపు మణిభూయిష్ఠ భూషణంబులును, చిత్రవర్ణముల వలిపవస్త్రంబులును, కస్తూరి కలిపిన హరిచందనమును, కప్పురము గుప్పిన తాంబూలమును, తావులు వెదచల్లు పూవులును, తాయంబుల సముదాయంబును, ఒసఁగి, రెండు ముహూర్తముల సేపు నవ్వులాట మాటల సరసము లాడుచు, ఉండెను. తర్వాత పిసవెట్టి ముసరి కనుగానక సువదనను కవుఁగిటం బొదువుటకు చిత్త మిడెను. రోషకషాయితుండనై కొంకక యేను మంచముమీఁదినుండి క్రిందికి పడఁ ద్రోచి నిర్ఘాత ప్రాయము లయిన ముష్టి జాను చరణాఘాతములచే చదిపితిని. బాహుయుద్ధంపు వడిచే చెదరిన కైసేఁతను ఎప్పటియట్లు సవరించుకొని, భయముచే వడంకుచున్న నతాంగిని బాలచంద్రికను బుజ్జగించుచు ఇంటి ముంగిటికి వచ్చి, భీతిచేత వణంకుదానివలె బిగ్గరగా 'అయ్యో! బాలచంద్రికను పూనిన యక్షుఁడు ఘోరరూపుఁడు దారువర్మను చంపుచున్నాఁడు. త్వరగా రండు మాడుఁడు.' అని కెవ్వున నఱచితిని. ఆకేక విని జనులు గుమి గూడి కన్నీరు పోటెక్కుచుండ, హాహాకారముచే దెసలు చెవుడ్పఱుచుచు 'బాలచంద్రికను పట్టిన యక్షుని బలవంతునిఁగా వినుచుండియు, దారువర్మ మదాంధుఁడై దానినే మోహించినాఁడు; కావున నీతఁడు తనచేఁతచేతనే మడిసినాఁడు. ఇతనికై ఏడిచి ఏమి ప్రయోజనము!' అని యొండొరులతో నుడువుకొనుచు లోనం జొచ్చిరి. ఆ గందరగోళములో తరలేక్షణతోఁ గూడ మెలపున వెలువడి నాయింటి కేఁగితిని. పిమ్మట కొన్ని దినములకు ఊరివారి సమక్షమున ఆ సిద్ధాదిష్ట ప్రకారంబున ఇందువదనం బెండ్లి యై, మున్ను కోరుకొన్న భోగములను యథేచ్ఛముగా అనుభవించితిని. బంధుపాలుని శకునములవలన నిర్ణీత మయిన

యీ దినమందు వెలువడి ఊరి వెలుపలికి వచ్చి యుండి, కన్నుల పండువు సేయు నిన్నుఁ జూచు సుఖమును అనుభవించుచున్నాను.

మిత్రుని యీ వృత్తాంతమును ఆలకించి రాజవాహనుఁడు విలసిల్లిన యుల్లంబుతో తనయు సోమదత్తునియు వృత్తాంతమును ఆతనికి వచించి 'సోమదత్తుఁడా, మహాకాళేశ్వరారాధనం గావించి, పిమ్మట నీ వల్లభను పరిజనముతో ఆమెయూరు చేరిచి రమ్ము.' అని పంపి, పుష్పోద్భవునివలనం గొలువందుచు భూలోకామరావతిని అవంతీపురిని ప్రవేశించెను. అచట పుష్పోద్భవుఁడు 'ఇతఁడె నాస్వామికుమారుఁడు' అని బంధుపాలాది బంధుజనులకుం దెలిపి, వారిచేత రాజవాహనునికి నానావిధ పూజలు సేయించుచు, 'సకల కలాప్రవీణుఁడు బ్రాహ్మణుఁడు' అని నగరములో వెల్లడి సేయుచు, తనయింటనే రాజూనకాతనికి ప్రతిదినము స్నానభోజనాదికముం గావించు చుండెను.

---

## పూర్వపీఠిక - పంచమోచ్ఛ్వాసము.
## అవంతిసుందరీ పరిణయము.



అనంతరము మలయగిరిదరులయందలి తరులయందుఁ గ్రందుగా వసించు పాములు ఆఘ్రాణింపఁగా మిగిలినదియుం బోలె కడు సన్నమై, ఆడించిన హరిచందనముల నెత్తావుల మొత్తంపు బరువుచేతనుం బోలె మెల్లనై, వీతెంచుచున్న చేఁపజెండా పామసా దక్షవాయు యగు దక్షిణమారుతునిచేత విరహులయెదలయందలి వలరాచ చిచ్చును దరికొల్పించుచు, తియ్య మామిళ్లలో చిగుళ్లను తేనెయు అని రక్తి యెక్కిన యెలుంగులు చెలంగు తేఁటి కోయిలల కాకలీ కలకలముచేత దిక్చక్రమును వాఁగించుచు, మానస సరోవరంబున అలలం బోలె మానినీ మానసమునందు కోరికల నీరికలెత్తించుచు, మామిడి వాలిలి ఎఱ్ఱకంకేళి మోదుగు బొట్టుగు అనెడి చెట్లులందు మొగ్గం బుట్టించుచు, మరుని పెనుఁబంటుగునకై రసికుల యుల్లముల నుల్లాస మొందించుచు, వసంతసమయము అరుదెంచెను. అతి మనోహర మయిన యా కాలంబున మానసారుని కొమారిత యవంతి సుందరి యనునిందుముఖి నెచ్చెలి యగు బాలచంద్రికతోఁ గూడ ఊరిచేరువ నున్న రమణీయోద్యానంబునకు వనవిహారేచ్ఛచేత ఊరి సుందరీమణుల బృందముతోడం గూడుకొని యేఁగుదెంచి, ఒకానొక మావిగున్న క్రిందఁ జల్లని దట్టంపు నీడలో, చందనము పువ్వులు పసుపు సేసఁబ్రాలు చీనాంబరములు లోనగు పూజాద్రవ్య సంభారముతో చేతోజాతుని నూచుచు, క్రీడించు చుండెను.

రతీదేవికి ప్రతిరూప యయిన య య్యవంతిసుందరిని అచట వసంతద్వితీయుఁ డై చూడ వచ్చిన కాముఁడో యన, రాజవాహనుఁడు పుష్పోద్భవసహాయుఁ డై ఆయుపవనింబ్రవేశించి, అట నట మలయానిలునిచే ఊఁపఁబడుచున్న కొమ్మలయందు ఒత్తుగా పొటమరించిన పల్లవ పుష్ప ఫలంబులతో నుల్లసిల్లుచున్న మామిడి చెట్టులయందు పికశుక మధుకరముల గముల మధురాలాపములను ఆలించి యాలించి, నల్లనివియు ఎఱ్ఱనివియు తెల్లనివియు నగు కలువల తండంబులయందును తామరల తంపరలయందును కేళీలోలుపములై రాయంచలు బెగ్గురులు కన్నెలేడులు జక్కవలు అను జలపక్షుల గుంపులు కూయు తియ్యని కూఁతలచే విఘూర్ణిల్లుచునుల్లని స్వచ్ఛోదకముచేత శోభిల్లుచును ఉండు కొలంకులను చూచి చూచి, పేర్చిన విలాసంబున ఆ తేజవరాలి కందువకుం జనుదెంచెను. బాలచంద్రిక నిశ్శంకముగా చేతితో సన్నచే ఇటు రండు అని పిలుచుచు, నిజతేజోజిత మేఘవాహనుఁ డగు రాజవాహనుఁడు అవంతిసుందరిచెంతకుం జనియెను. ఎవతె వసంతసహాయుఁ డయిన మన్మథుఁడు వేడుకచేత రతీదేవికి ఆటబొమ్మ యొకటి చేయఁగోరి, ముందుగా మనస్సులో నొక యపూర్వ సుందరీతిలక రూపమును రచించుకొని తదనుగుణముగా మూర్తి యొసంగుచో, చరణద్వయంబును తనకేళికొలనియందలి శరత్కాలారవిందంబు నందబుతోను, లీలాలస మయిన నడక యొయ్యారంబును ఉద్యానంపు డిగ్గియలోని మదించిన రాయంచ నడకతీరుతోను, జంఘాద్వయంబును అమ్ముల పొదుల లావణ్యముతోను, ఇంపయిన చిఱుదొడలను అరఁటుల సొంపుతోను, ఘన మైన జఘనమును గెలుపు టరదంపుఁ జక్రంపు బాగుతోను, గంగలోని సుడికి తోఁబుట్టు వైన పొక్కిటిని అరవిరిసిన లీలావతంసంపుఁ గలువ కోటరంబుననువృత్తిచేతను, ముత్తెములను మేడమెట్ల పరిపాటితోను, నూగారును అల్లెత్రాటి తేఁటిబారు నీలిమ సొరుతోను, పాలిండ్ల కవను నిండు పసిండి గిండ్ల శోభతోను, బాహువులను ప్రియంగులతల కొమరుతోను, కంఠమును గెలుపుఁ జిందంబు నందమ్ముతోను, దొండపండును ప్రతిబింబీకరించు కెమ్మోవిని విలాసిజనకర్ణావతంస మయిన తీయ మామిడి చిగురుఁ గెంజిగితోను, తెల్లని చిఱునగవును పూవుటమ్ముల ధాళధళ్యంబుతోను, మాటలతేటను మొదలిదూతి యగుకోయిల తోయలి పలుకుల తీయనతోను, ఊరుపు గాలిని ఎల్లజోదుల పడవా లయిన మలయమారుతుని సౌరభముతోను, కన్నుఁగవను గెలుపుసిడ మయిన మచ్చెంపుఁ గచ్చుతోను, బొమ తీవలను తుంటవింటిగంటులతోను, నెమ్మోమును మొదలి చెలికాఁ డయిన యమృతకిరణునికి కళంకం దొలంగించుడు వెలింగెడు కాంతితోను, తలకట్టును ఆటనెమలి కుంచియ సంచుతోను, కావించి, ఎల్లతేసెలను కస్తూరియు కలిపిన గందపు

ద్రవముతో కడిగి, కపురంపు రజముతో తుడిచి, నిర్మించినట్లు, మూర్తి దాల్చిన లచ్చి వోలె విరాజిల్లు చుండెనో, ఆ మాళవరాజకుమారియు తన నోమునకు సంతసించి తాఁ గోరిన వర మొసంగుటకు రూపు దాల్చి ప్రత్యక్ష మైన మదనునిం బోలె నాతనిం గనుం గొని, మదనావేశవతియై, మందమారుత మాడించిన ప్రేంకణపుఁదీవ వోలె కంపించెను. వెంటనే క్రీడయందలి స్వచ్ఛందవృత్తిం దక్కి, సిగ్గున కగ్గమై, వర్ణింప నలవి గాని భావ విశేషములకుం దావల మాయెను. 'లలనా మణులను సృజించు నవసరమున నిక్కముగా విధాత ఇక్కోమలిని కొయ్యఁదొలుచుపురువు నక్కరపు నాయమున నిర్మించినాఁడు. అట్లు గాదేని, కమలసంభవుఁడు ఇట్టి సృష్టి సేయ నేర్చునేని, ఈ తరుణితో సాటి వచ్చు లావణ్యము గల దానిని ఇంకొకతెను ఏల చేయఁడు?' అని అచ్చెరువడి యనురక్తితోఁ గాంచుచున్న యాతని మ్రోల నిలుచుటకు సిగ్గుపడి, ఆ తన్వంగి ఇంచుక సఖీజనముల చాటున మఱఁగి, బొమతీవల నిక్కించిన క్రేగంటి చూపుల నతని మోము దెస నిగిడించుచు కుదియించుచు, తన మది యను జింకకువలయు మయిన లావణ్యము వానిని ఆ రాజవాహనుని విలోకించుచు, నిలుచు చుండెను. అంతట విషమశరుఁడు ఆ భామకు అప్పుడు ఉదయించిన భావరసముల సామగ్రి తనకు అలవడిన కతంబున బల్లిదుఁడాయెనో యన ఆతనిమానసమును గుఱి సేసి, విసువక ఏయఁదొడంగెను.

ఆ యెలజవ్వని తన మనస్సులో నిట్లు తలపోసెను.—'అనన్యసామాన్య లావణ్యుఁడీతఁడు ఏయూర భాగ్యవతు లగు తరుణులకు కనుఁబండువు సేయుచున్నాఁడు? ఈపుత్త్రి రత్నముం బడసినందున ఏయమ పుత్త్రివతు లగు సీమంతినులకు సీమంతముక్తామణి యయినది? ఇతని దేవి యెవతె? ఇతఁ డిచ్చటికి వచ్చినందులకు కతం బేమి? మన్మథుఁడు తన లావణ్యమును అపహసించిన యీతనిం గనుచున్న నన్ను తద్దయు మథించుచు తన పేరు సార్థకము గావించుకొనుచున్నాఁడు! ఏమి సేయుదును? ఇతనిని ఎఱుంగుట యెట్లు?' అని. అంతట బాలచంద్రిక ఆయిరువుర యితరేతరానురాగవృత్తిని భావ విశేషములచేత నెఱింగి, ఇంతుల గుంపుచెంత రాజకుమారుని వృత్తాంతమును వివరముగాఁ జెప్పుట యొప్పు గా దని యెంచి, లోకసామాన్య వాక్యములతో 'భర్తృదారికా, ఈయన సకల కలాప్రవీణుఁడు, దేవతాసాన్నిధ్యము చేయువాఁడు, యుద్ధకుశలుఁడు, మణిమంత్రౌషధు లెఱిఁగినవాఁడు, భూదేవకుమారుఁడు, నీకు పూజార్హుఁడు; ఇతనిం బూజింపుము.' అని హెచ్చరిక సేసెను. దానిని విని రాజకన్య తనమనస్సులో నున్న దానినే బాలచంద్రిక చెప్పినందులకు సంతోషించినదై, మందానిలుఁడు తరంగపంక్తిం బోలె మదనుఁడు తన్ను ఆకులపాటొందించుచు, మారునిం గేరు నారాజకుమారుని ఉచితాసనమునం

గూర్చుండఁ జేసి, సఖీహస్తముచేత గంధ కుసుమాక్షత కర్పూర తాంబూలాది నానా వస్తువులతో పూజ సేసెను.

రాజవాహనుఁడును 'నిక్కముగా ఈరమణి పూర్వజన్మమందు నాభార్య యజ్ఞవతి; కానిచో, నామనంబులో ఈ సుందరిమీఁద ఇట్టి యనురాగము పుట్టదు. తపోనిధి యిట్టిన శాపము తీఱినంతట పూర్వజన్మజ్ఞానము మా కిరువురకును సమానమే అయినను, సమయోత్పన్న విశేషములను సూచించు మాటలచేత ప్రియతమకు జ్ఞప్తి కలిగించెదను.' అని తలంచెను. ఆసమయంబున సోయగం బయిన యొక రాయంచ క్రీడ సల్ప వేఁడి అతనిచెంత కరుదెంచెను. దానిమీఁద ఆసపడి రాజకన్య దానిం బట్టుకొమ్మని బాలచంద్రికను నియోగింపఁగా, అదే పలుకరించుటకు తగిన సమయ మని సంభాషణనిపుణుఁడు రాజవాహనుఁడు లీలగా నిట్లు ముచ్చటించెను.—"సఖీ, పూర్వము శాంబుఁ డను రాజు మనోదయితతోఁగూడ విహరించు కోరికచేత తామరకొలంకుం జేరి అందు ఎఱ్ఱగలువతుటుముచెంత నిద్రాధీనమానస మయిన రాజహంసమును పట్టి తామరతూఁటి దారమును దాని యడుగుదోయికి సంకెల కట్టి, ప్రేయసిముఖమును ప్రేమతో చూచుచు, చిఱునగవుచేత గండమండల మొకటి వికసిల్ల, 'చంద్రాననా, నేను కట్టిన యీ రాయంచ శాంత మయి మునివలె నున్నది. దీనిని స్వేచ్ఛగా పోనిచ్చెదను.' అని వచించెను. ఆ రాజహంస శాంబుని 'ఓ రాజా, ఈ తామరతంపరయందు అనుష్ఠాన పరాయణుండనై పరమానందంబున నున్న నైష్ఠికుని నన్ను నిష్కారణముగా రాజ్యగర్వముచేత అవమానించితివి కావున, ఈ పాపముచేత కాంతతోడి యెడఁబాపు దుఃఖమును అనుభవింపుము.' అని శపించినది. అంతట ఖిన్నముఖుఁడై శాంబుఁడు ప్రాణేశ్వరితోడి వియోగమును ఓర్వలేక నేలమీఁద పడి, ఆ మునికి దండప్రణామ మాచరించి, వినయముతో 'మహానుభావా, తెలియక నాచేసిన నేరమిని మన్నింపుము.' అని విన్నవించుకొనెను. అంతట తాపసుఁడు మనస్సులో కనికరము పూని రాజుతో 'ఓ రాజా, ఈ జన్మమందు నీకు ఈ శాపము ఫలింపకుండుఁగాత, మఱి నామాట తప్పదు గావున రాఁగల జన్మమందు ఈసరసిజాక్షికే అనురాగముతోడి భర్తవై, ఇప్పుడు రెండు ముహూర్తముల కాలము నా పాదయుగళమునకు నిగళము వైచిన దోసమునకై రెండు మాసముల కాలము చరణములు గొలుసు సంకెలం బడుదు రమణిని ఎడఁబాయు దుఃఖము ననుభవించి పిమ్మట చిరకాలము వల్లభతోఁ గూడ రాజ్యభోగముం బొందుము.' అని యనుగ్రహించెను. కావున, ఓతలోదరీ, నీవు రాజహంసను కట్టింపఁగూడదు." ఇట్లు రాజవాహనుఁడు వచింపఁగా విని ఆ రాజపుత్త్రియు తన తొలిపుట్టువు వృత్తాంతమును స్మరించి, అతఁడు నిశ్చయముగా తన

ప్రాణప్రియుఁ డని తనమనస్సులో నెఱిఁగి, అనురాగముచేత నుల్లంబు పల్లవింప లేనగ వంకురింప, 'ఓయి సౌమ్యుఁడా, పూర్వము శాంబుఁడు యజ్ఞవతిపనుపును గౌరవించుటకై ఆ తీరున హంసను పట్టి కట్టెను. అట్లే గదా లోకములో తెలివి గలవారు సయితము మోమాటమిచేత అకార్యము చేయుదురు.' అని పలికెను. కన్నియు రాజన్యుఁడును ఇట్లు ఒండొరుల తొలిపుట్టువునందలి పేరులను తమ కౌతుక మయినవానిని ఒకరొకరికి తెలియుటకై ఆనవాళ్లతో పలికి మనస్సులనిండ మదనరాగము వహించి యుండిరి.

ఆసమయమున మాళవేంద్రుని పట్టపుదేవి పరిజనసమేతయై కొమారితయొక్క క్రీడం జూచుటకై అచ్చోటికి వచ్చెను. బాలచంద్రిక ఆమెను దూరమునఁ గాంచి గుట్టు బయటఁబడు నను భయముచేత వేగిరముగా చేతితో సంజ్ఞ సేయఁగా రాజవాహనుఁడును అతనిం గొలుచును పుష్పోద్భవుఁడును దేవి కగపడకుండ చెట్లచాటున మఱిఁగిరి. మానసారుని పట్టపురాణియు నెచ్చెలితోడి కొమారితయొక్క నానావిధ క్రీడావిలాసముం గనులారఁ గాంచుచు నిముస ముండి, కూఁతుం దోడ్కొని, తన మందిరమునకుం జనం గడంగెను. తల్లితో పోవుచు అవంతిసుందరి 'రాజహంసకులతిలకుఁడా, ఆసతో విలాసకాననమందు నాకడకు వచ్చినట్టి నిన్ను ఆకస్మికముగా వదలి నాయ మని కాదు సుమా నేను అమ్మతోఁగూడం బోవుట. కావున ఇందువలన నీ మదిలోని ప్రేమ మాఱకుండును గాక.' అని రాయంచమిషమున రాజకుమారుం గూర్చి ఒప్పిద మయిన పలుకులు పలుకుచు, మరల మరల వెనుకకు మరలి మరలి దీనదృష్టులతో రాజవాహనుని వదనమును కాంచుచు తన నగరికిం జనియెను.

అచ్చట మనోవల్లభుని వృత్తాంత ప్రసంగమున ఆతని వంశ నామధేయములను బాలచంద్రిక చెప్పఁగా, మదనుఁడు అంపకోలను మనస్సునఁ గాఁడ నేయఁగా, వియోగపు నెగులుచేత కృష్ణపక్షచంద్రకళవలె కృశించి కృశించి, భోజనాది సకలవ్యాపారములను మాని, ఏకాంతగృహమందు చందనద్రవములో ముంచిన పుష్పపల్లవములతోఁ జేసిన పఱపు మీఁద మైదీఁగను వైచెను. అందు అట్టి యా దుర్దశ ననుభవించుచు మదనాగ్నికి తపించుచున్న యా కోమలాంగిని పరికించి, నెచ్చెలులు కొందలం బంది హరిచందనము వట్టివేరు కప్పురము గుప్పి పసిండి గిండుల నిండించి యుంచిన చన్నీళ్లతో జలక మాడించి, తమ్మితూండ్లలోపలి పోఁగులతో నేసిన వలువలు గప్పి, తామరాకుల సురటీలు వీచి, ఇంక నిట్టి సంతాపహరణ సాధనములఁ జెల్లుగా సమకూర్చి, ఆ కొమ్మనెమ్మేనికి చలువ యుపచారములు గావించిరి. కాని ఆశీతలోపచార మెల్ల క్రాఁగిన నూనియలో నీరు వోలె ఆమె మేన సంతటను మంటలనే పుట్టించెను. ఏమి సేయనుం దోఁపక దిగులు

చెంది యున్న బాలచంద్రికను క్రేఁగంటి నించుక తెఱచి కన్నీటిబొట్లచే కలంగిన చూపుతో చూచి విరహాగ్ని వలన వేఁడి యెక్కిన నిట్టూర్పులచే వాడిన కెమ్మోవితో ఆ కోమలాంగి ఎలుంగు దొట్రిల అల్లన ''నెచ్చెలీ, కామునికి కైదువులు పూవు లని, అమ్ములు అయిదని, నిశ్చయముగా అసత్యమే పలుకుచున్నారు. అది ఎట్లనఁగా, ఇతఁడు లెక్కలేని యమ్ములతో నన్ను ఏయుచున్నాఁడు. సఖీ, చంద్రుఁడు బడబానలముకంటెఁ గ్రాఁచువాఁ డని నామతము. ఏల యన, ఇతఁడు లోనం జొచ్చిన సముద్రము ఇంకును, వెలువడిన వర్ధిల్లును. దోషాకరుని దుష్కృత్యమును నే నెంత యని వర్ణింతును? ఏల యన, ఈతఁడు తన తోఁబుట్టు నగు సిరికి ఇల్లయిన కమలమును సయితము కమలించును. నిక్కముగా ఈ మలయానిలము వియోగాగ్నిచే గ్రాఁగిన హృదయముల తాఁకుడుచేత వేఁడిఁ జెంది సన్నగిల్లుచున్నది. క్రొంజివుళ్లతో రచించిన యీ పానుపు మదనాగ్ని శిఖల మొత్తము వోలె దేహమునకు తాపము నేయుచున్నది. పచ్చగందము సయితము తొల్లి తనకాయ్యకుం జుట్టుకొన్న పాములు కోఱల దీటుకొనఁగా నాటుకొన్న మిక్కుటంపు విసముతో కూడియున్నది. ఏలయన, నది దేహమును తపించుచున్నది. కావున వృథా శ్రమ యయిన శీతలోపచారములను మానుఁడు. మదనుని గెల్చినలావణ్యమువాఁడు రాజకుమారుఁడే ఈ మదన జ్వరమును కుదుర్చుటకు వెజ్జు. ఆతఁడో పొంద శక్యుఁడు గాఁడు. ఏమి సేయుదును?' అని విలపించెను.

ఇవ్విధంబున మెండుకొన్న కందర్ప జ్వరముచేత దందహ్యమాన యై మానసంబును రాజవాహనుని లావణ్యమునకు కైవసము చేసి వేఱు శరణము లేక దురపిల్లుచున్న యకోమలాంగిని కని బాలచంద్రిక తనమనంబులో నిట్లు వితర్కించెను.—'కుమారుని నేను త్వరగా తేవలయును. లేనిచో మీనకేతనుఁడు నా చెలిని స్మరింపఁ దగిన దశకుం దేఁగలఁడు. అయ్యుద్యానములో నియ్యిరువురు నొండొరులం జూచుతఱిని ఇరువురపయిని విషమబాణుఁడు ఒక్కమ్మడినే అమ్ములం బ్రయోగించినాఁడు. కావున కుమారుం దెచ్చుట సులభంబ.' అని. తర్వాత సమయమునకుం దగిన చేఁతలయందు చతుర లయిన చెలుల పిండును అవంతిసుందరీరక్షణార్థము నియోగించి, రాజకుమారుని మందిరమునకుం జనియెను. మారుని నారసమ్ములకు పొది యగుచున్న యెదతో మారునికాఁకచే చీకాకయిన యవయవముల తాఁకుడుచేత వాడిన లేఁజివురుసెజ్జను అధివసించి రాజవాహనుఁడు ప్రాణేశ్వరిం గూర్చి పుష్పోద్భవునితో సల్లాపించుచు, అయ్యవసరంబున వచ్చిన ప్రియవయస్యను బాలచంద్రికను చూచి, వెదకం బోయిన తీఁగ కాళ్లకుం దగులుకొన్నట్లు బాలచంద్రిక వచ్చిన దని సంతోషించి, తన్నుం గని ఫాలదేశంబున అంకారార్థము

దాలిచిన యంబుజ జాలకం బన కేలు మొగ్గం గీలించిన యా బాలచంద్రికను 'ఇటం గూర్చుండుము' అని తగినయాసనంబు నిర్దేశించెను. ఆ తరుణియు ఆసీనయై అవంతి సుందరి పంపిన వీడెంబును వినయంబున నర్పించెను. సాదరంబునం గైకొని రాజవాహనుఁడు జరిగినవృత్తాంత మడిగెను. బాలచంద్రిక వినయంబున నిట్లు వక్కాణించెను.—"దేవా, విహారవనమందు నిన్నుం గన్నప్పటినుండి యక్కన్నియ తన్ను మన్మథుఁడు పెట్టుమథనం బులను తాళలేక పుష్పశయనాదులయందు తాపశమనముం గానక, ఎత్తైన చెట్టుపండును గుజ్జుదియుంబోలె, అందని దైన నీహృదయముం బొందువు సౌఖ్యమును మదనాంధతచేత కోరుచున్నదై, నాచెలి తానే కమ్మవ్రాసి 'దీనిని వల్లభునిచేతికి అందిమ్ము' అని నన్ను పనిచినది." అని. రాకుమారుఁడు ఆకమ్మం గైకొని చదివెను.—

గీ. సొబగుకాఁడ, కుసుమ సుకుమారమును లోక
మోహనంబు నీదు మురువుఁ గాంచి
యభిలషించె నిను మదంతరాత్మంబు నీ
యెదనుఁ జేయు మటులె మృదులముగను.—

ఇట్లు చదివి సాదరంబున ననియె.—'సఖీ, నీడవోలె నాతోడ నుండెడి పుష్పో ద్భవుని వల్లభవు నీవే ఆయేణీవిలోచనకు బయటఁ జరించు ప్రాణమువుగా వర్తిల్లుచున్నా వు. నీజాణతనము ఈ పనితీఁగకు పాదయినది. నీయుష్ట మేదో దేనివలన ప్రేయసికోరిక పండునో దాని నెల్ల నేను సాధించెదను. నతాంగి నామనంబు కఠిన మని తెలిపినదిగదా. ఎప్పుడు కేళివనమందు ఈ కురంగీవిలోచన నాకనుదోయికిం దోఁచెనో అప్పుడే తాను నా మనస్సును దోఁచుకొని పోయి తన నగరు సేరెను. కావున తన మనస్సుయొక్క మార్దవ కాఠిన్యములను తానే యెఱుంగును. కన్యాంతఃపురముం బ్రవేశించుట సులువు గాదు. కావున అందులకుం దగిన యుపాయంబుం బన్ని రేపో ఎల్లుండియో నతాంగిం గలసికొనెదను. నావార్తను ఇట్లని వచించి, దిరిసెన పూవుం బోని యా కోమలాంగి మేనికి వాటిల్ల కుండునట్టి యుపాయమును నీవు చేయుము.' అని. బాలచంద్రిక ప్రేమగర్భిత మయిన యాతని యా మాటను ఆలించి సంతోషించి అవంతిసుందరికడకుం జనియెను.

రాజవాహనుండును ప్రాణవల్లభం గాంచిన సుఖ మెచ్చట నలవడెనో ఆయుద్యాన మునకు విరహఖేదమును మఱచుటకై పుష్పోద్భవ ద్వితీయుఁడై చనుదెంచెను. అందు, సుందరిలలాము కిసలయ ప్రసూనములు కోసిన వృక్షవాటికను, ఇందువదన కందర్పునిం

బూజించినతావును, నతాంగియొక్క యడుగుజాడగుర్తులు గల చల్లని యిసుము నేలను, సుదతి అనుభవించి వదలిన బండిగురివెంద తీవమండపములోపలి చివురాకుఁ దలిమంబును, కనుంగొనుచు, లలనామణిని చూచిన సమయాన జనించిన విశేషములను స్మరించి స్మరించి, పిల్లతెమ్మెర యల్లన నాడించుచున్న గున్నమామిడి పల్లవములను మదనాగ్నిజ్వాలలంబోలె బెదరి చూచి చూచి, పిక శుక మధుకర రణితంబులను వలరాజు కడ చెప్పుకొండియంబులం బోలె విని విని, మారవికారంబున నెక్కడ నుండలేక త్రిమ్మరుచుండెను.

ఆసమయంబున నొక బ్రాహ్మణుఁడు పలువన్నెల వలిపంబు దాల్చి, తళ తళ లాడుచున్న రతనాల కుండలంబులు పెట్టుకొని, బోడితలల బాలుర దండ నుంచుకొని చదురయిన వేసముతో భాసిల్లుచు, తన యిచ్చ మెయి వచ్చి, తేజోరాజీ పరివృతుని రాజవాహనునిం గాంచి, ఆశీర్వదించెను. రాజు ఆదరముతో ఆతనిని 'ఎవరవు నీవు? ఏ విద్యయందు నిపుణుఁడవు?' అని యడిగెను. 'నాపేరు విద్యేశ్వరుఁడు, నేను ఇంద్రజాల విద్యా విశారదుఁడను, రాజుల చిత్తములను రంజించుటకు నానాదేశములు తిరుగుచు ఇపుడు ఉజ్జయినికి వచ్చితిని. అని యాతఁడు చెప్పెను. వెండియు రాజవాహనుని చక్కఁగా పరికించి 'ఈకేళీవనియందు పాలి యుండుటకు నిమిత్తమేమి? అని సాభిప్రాయముగా నవ్వి యడిగెను. పుష్పోద్భవుఁడు ఐంద్రజాలికునిచేత తమ కార్యము సాధించుకొన వచ్చునని ఆలోచించి ఆదరపూర్వకముగా నిట్లనియె:—'అయ్యా, సాధువుల చెలిమికి ఒండొరులతోడి సంభాషణమే కారణ మగుటచేత చాలసేపు మధురముగా భాషించినవాఁడవు నీవు మాకు నెచ్చెలి వయితివి. మిత్త్రులకు చెప్పఁగూడనిదేమున్నది? ఈ విహారవనమునకు వసంత మహోత్సవమునకై వచ్చిన మాళవరాజకన్యకను ఈ రాజకుమారునికిని ఆకస్మిక సందర్శనముచేత ఒండొరులపై మట్టు మీఱిన వలపు తలకొనినది. దానంజేసి నిరంతరము సంభోగము లనుభవించుటకు ఉపాయము అలవడమిచేత ఈతఁడు ఇట్టి యవస్థపాలయినాఁడు.' అని. విద్యేశ్వరుఁడు లజ్జామనోహరంబును రాజవాహనుని ముఖముం గని చిఱునగవు నవ్వుచు 'దేవా, నీయనుచరుఁడను నేనుండఁగా అసాధ్యమయిన నీ కార్య మేమున్నది? నేను ఇంద్రజాల విద్యచేత మాళవరాజును కనుకట్టి పౌరజనుల సమక్షమందే అతని కొమారితను నీకుం బెండ్లిచేసి మిమ్ము కన్యాంతఃపురము నం బ్రవేశ పెట్టెదను. ఈవృత్తాంతమును ముందుగా రాజకన్యకు సఖీముఖముగా చెప్పవలయును.' అని పలికెను. రాజవాహనుఁడు సంతోషించి అకారణమిత్త్రునిమాయపనులయందు నేర్పుదెలిపిన వానిని మోసమును కపటస్నేహమును వాస్తవస్నేహమును ఎఱింగిన వానిని అవిద్యేశ్వరుని పసదనం బిచ్చి పంపెను.

పిమ్మట రాజవాహనుఁడు విద్యేశ్వరుని నేర్పుచేత తన కోరిక ఈడేఱిననే యని తలంచి, పుష్పోద్భవునితోఁ గూడ తన యింటికి పోయి, బ్రాహ్మణుఁడు ఒనర్చియున్న సంగమోపాయమును ఆదరపూర్వకముగా బాలచంద్రికాముఖంబున తనవల్లభకు తెలియఁజేసి, ఆ వింతసిద్ధికై యువ్విళ్లూరుచు, 'ఈరాత్రిని ఎట్లు గడపుదును!' అని తలపోయుచు, నుండెను. మఱునాఁడు తెల్లవాఱఁగానే విద్యేశ్వరుఁడు రసభావగతిరీతి చతురుఁడైన తాను, అట్టిదే అయిన గొప్పపరిజనముతోఁ గూడ, రాజమందిరద్వారసమీపమునకుం బోయి, దౌవారికులకు తన వృత్తాంతమును దెలుపుకొని, తటాలున వారు పోయి రాజునకు ఐంద్రజాలికుఁడు వచ్చినాఁడు, అని నమస్కారపూర్వకముగా విన్నవింపఁగా, రాజు తాను చూడఁగోరి రాణివాసములను చూడఁగోరుచు, తెమ్మని ఆనతీయఁగా, లోపలి కక్ష్యం జొచ్చి వినయపూర్వకముగా ఆశీర్వదించి, ఱేని యనుజ్ఞ వడసి పరిజనులు వాయించు వాద్యములు మ్రోఁగుచుండఁగా, మదకల కోకిలా మధుర కంఠలైన పాటకత్తియలు పాటరక్తిచేత సామాజికుల చిత్తవృత్తులను రంజించుచుండఁగా, నెమలికుంచె యాడించి, పరివారముతోడి మహారాజును మోహపెట్టుచు, కనులు మూసికొని క్షణము ఉండెను. వెంటనే, వెక్కసంబుగా కక్కసంపు విసముం గ్రక్కుచు, పడగ తోడవులయిన మణిరాజులచేత రాజమందిరంపు వీధిని నీరాజించుచు, పాములు భయము పుట్టించుచు వెలువడినవి. పెక్కులు గద్దలు పాపఱేండ్లను ముక్కులతోఁ గమిచికొని ఎగసి మింటం బాఱుతెంచుచుండినవి. అంత నాబ్రాహ్మణుఁడు నరసింహస్వామి దైత్యేశ్వరుని హిరణ్యకశిపుని చీల్చుట నభినయించెను. అది యెల్లం గాంచి మహాశ్చర్యము నొందియున్న మాళవేంద్రునితో విద్యేశ్వరుఁడు 'దేవా, కడపట ఏలినవారు శుభసూచకమును చూచుట ఉచితము. కావున కల్యాణపరంపర చేకూరునట్లుగా నీకుమారితరూపుగల తరుణికిని సకలలక్షణసంపన్నుఁ డయిన రాజకుమారునికిని వివాహమును జేయవలయును.' అని విన్నవించెను. దానిం గనం గుతూహలపడి రాజు సెలవీయఁగా, అతఁడు తన మనస్సులో సంకల్పించుకొన్న కార్యము నెఱవేఱును గదా యని ముఖవికాసము నొంది, ఎల్లవారికిని మోహ మొదవించునదైన కాటుకను తన కన్నులకుం బెట్టుకొని, నలువంకలం జూచెను. ఎల్లరును ఐంద్రజాలికప్రయోగమే యని తలంచి చూచుచుండఁగా, రాగము చివురొత్తుచున్న హృదయముతోడి రాజవాహనునితో అనేకభూషణభూషితాంగిని పూర్వసంకేతము ప్రకారము వచ్చిన యవంతిసుందరిని వైవాహికమంత్రతంత్రనైపుణ్యముచేత అగ్నిసాక్షికముగా కూర్చెను. పని ముగియఁగానే 'ఇంద్రజాలపురుషులారా, మీ రందఱుం బొండు.' అని విద్యేశ్వరుఁడు బిగ్గరగా వచింపఁగా మాయా

మానవు లందఱును ఎక్కడివా రక్కడ మాయ మైరి. రాజవాహనుఁడు పూర్వమేర్పఱచు కొన్న రహస్యపుఁ బన్నాగంపుఁ బాటవంబున ఐంద్రజాలిక పురుషుఁడుగా కన్యాంతః పురము ప్రవేశించెను. మాళవరాజు అది ఇంద్రజాలాద్భుతమాత్ర మని తలఁచి ఆబ్రాహ్మణునికి విశేషముగా ధన మిచ్చి 'విద్యేశ్వరుఁడా, నీ విఁక పోయి రమ్ము.' అని యాతనిం బంపి, తాను లోపలి నగరికి పోయెను. అంతట అవంతిసుందరియు నెచ్చెలితోను పరివారముతోను వల్లభునితోను సుందరీమందిరమునకుం బోయెను. ఈవిధముగా దైవబలముచేతను పురుషకారముచేతను తన కోరిక నెఱవేఱుడు, రాజవాహనుఁడు సరస మధుర చేష్టలచే అల్లనల్లన హరిణలోచనకు నానఁ బోనడఁచుచు, ఏకాంతంబున తనతో స్వేచ్ఛగా నుండునట్లు చేసికొనుచు, సంభాషణయందు ఆసుందరియొక్క వాగమృతంబును ఆస్వాదింపఁ గోరి చిత్రచిత్రమై చిత్తహారియైన యీ రేడులోకముల వృత్తాంతమును వినిపించెను.



*

# ఆంధ్ర-దశకుమార చరితము.

## ప్రథమోచ్ఛ్వాసము.

### రాజవాహన చరితము.

---

లోకవృత్తాంతమును విని యావ్వాగవర్తిని యవంతిసుందరి ఆశ్చర్యముచే వికసిల్లిన కన్నులతో ఎలనగవుతో ఈమాట చెప్పెను..— 'ప్రాణేశ్వరా, నీయనుగ్రహంబునంజేసి నాశ్రోత్రవృత్తి కృతార్థం బయినది. ఇప్పుడు నామదిలోని తమమ్ముం జిమ్ము జ్ఞానదీపమును నీవు వెలిఁగించితివి. నీపాదముల నుపరిచరించు ఫలము నాకిప్పుడు పండినది. ఈ నీయనుగ్రహంబునకు ఏమి బదులు సేసి నేను ప్రత్యుపకారము చేసినదానను అగుదును? నీది కానిది నాదేదియును లేదు గదా. అయినను నాకును ఒక విషయమందు స్వాతంత్ర్యము కలదు. సరస్వతి నోటితో గ్రహించినందున ఎంగిలి యయిన నీ కెమ్మోవిని నాయిచ్చ లేక నాచేత చుంబింపించుటకును, పద్మాలయా స్తనతటము లనుభవించిన నీయురమ్మును చిక్కఁగ కవుంగిలింపించుటకును శక్యము గాదు గదా.' అని. అంతట ప్రియునివక్షఃస్థలంబున వర్షాలక్ష్మి ఆకాశమందుం బోలె గురుపయోధరమండలంబుం గీలించి, ముదిరిన నేలయూఁటి పూవుదోయిఁబోలె గాటంపుఁగెంపు సొంపారినవిలోచనయుగంబును ఉల్లసిల్లం జేయుచు, మైవ్రాలినతేఁటిల్లచేత చంద్రకంబుల యొప్పు చూపడిన పువ్వులతోడి వేసలి నెమలి పించియ యందమ్ముం బచరింప, కడపపూమొగ్గం బోని కాంతుని కెమ్మోవిని కొఱతెగువతో చుంబించెను. అయ్యారంభమువలన పెల్లుగా నుప్పొంగిన రాగవృత్తిచేత అతిమాత్ర చిత్రోపచార మనోహరం బయిన రతిప్రబంధము సారెసారెకు ప్రవర్తిల్లెను. పిమ్మట నిద్రఁ జెందిన యా యిరువురకు కలలో నొక ముదియంచ తమ్మితూఁటి త్రాటి సంకెలం బడిన పాదములతోడిది కానిపించెను. అంత నిరువురును మేలుకొనిరి.

మేలుకొన్నంత రాజవాహనుని చరణయుగళము, కమలభ్రమచే చంద్రుఁడు తన కిరణములతో త్రాడుపేని ఆ త్రాటితో కట్టి పట్టెనా యనునట్లు, వెండిగొలుసుసంకెలం బడియుండెను. దానిం గని, ఇదేమని పెనుభీతిచే బెగ్గడిల్లి, రాజకన్య వావిచ్చి యేడ్వం

దొడంగెను. దానం జేసి రాజకన్యాంతఃపుర మెల్ల, చుట్టురా నిప్పంటుకొన్నదో యన, దయ్యము కొట్టినదో యన, వణఁకుచు, ఏమి సంభవించి యున్నదియుం దెలియక, ఏమి చేయునుం దోఁపక, రహస్యముం గావవలయు ననుకట్టడను లక్ష్యపెట్టక, నేలం గుప్పకూలి మొత్తుకొనుచు, గొంతు చినుఁగ నేడ్చుచు, చెక్కిళ్లు గానరాని యట్లుగా కన్నీళ్ల జడిం గురియుచు, కలగుండు వడియెను. ఆ గందరగోళములో అడ్డువారు లేక అంగజాల లైన పురుషులు ఏమి ఏ మని యడుగుచు తటాలున లోఁగిటం జొచ్చి ఆ యవస్థలోని రాజ కుమారునిఁ గాంచిరి. అతనిం బట్టుటకు కోరిరి గాని తదీయ ప్రభావముచేత వెనుకకు జంకి తత్క్షణమే అతనివృత్తాంతమును చండవర్మకు నివేదించిరి.

అతఁడును కోపంబున నేతెంచి, నిప్పులు రాలుచున్న చూపుతో చూచి ఆనవాలు పట్టి 'ఏమీ! వీఁ డెవఁడు! నాతమ్ముని మరణమునకు కారణభూతురా లయిన యీపాపాత్మురాలు బాలచంద్రికయొక్క పతికి - మిక్కుటముగా ధనసుద మెక్కిన యీపరదేశి వైశ్యకుమారునికి పుష్పోద్భవునికి-మిత్త్రుఁడు! రూపమునకు గర్వించినవాఁడు, కళలకు పొగ రెక్కినవాఁడు, పలుదెఱంగుల పన్నాముగల నేర్పుచేత పౌరమూఢులను వశీకరించి వారి వలన దేవతాసాన్నిధ్యము గలవాఁ డని వట్టిఖ్యాతిని పొందినవాఁడు, లోకులను వంచించుటకై పైకి ధర్మవర్తన మవలంబించుచు లోలోపల పాప మాచరించుచు నుండు చపలుఁడు బ్రాహ్మణాధముఁడు! మాబోఁటి పురుషసింహులను సరకు సేయని యీపాపాత్మురాలు అవంతిసుందరి ఎట్లుగా వీనిపై వలచుకొన్నది! చూచినచో యీకులదూషకురాలు ఇప్పుడే పతిని కోర్తికి సిగపూవునుగా.' అని బెదరించుచు లలాటతటము కాఱ్ఱకొనునట్లు భయంకరముగా బొమలు ముడిచికొని యముఁడుం బోలె ఉక్కుదూలమువలె గట్టిదైన బాహుదండముతో కమలరేఖలును చక్రరేఖలును గుర్తుగా గల దైనకేలుఁదమ్మిని పట్టుకొని రాజపుత్త్రిని బలిమిమెయి నీడ్చెను. అతఁడు స్వభావధీరుఁడును ఎల్లపురుషకారములకును ఎల్లయు నయ్యున్, అయ్యాపద దైవకృత మనియు దానికి ఓర్పే ప్రతీకార మనియు నిర్ధారించుకొని, 'ఓ, యంచయానా, అహంసకథను జ్ఞప్తి చేసికొమ్ము. బాలా, రెండునెలల పాటు ఓర్చుకొనుము.' అని ప్రాణేశ్వరిని ప్రాణము వదల నుద్యుక్త యయినదానిని ఓదార్చి, పగతునికి కైవస మాయును.

పిమ్మట ఈవార్త విని మహాదేవియు మాళవరాజును దుఃఖితులై ఆకారప్రభావముచేత అల్లునియందు పక్షపాతము వహించినవారై, అతనిం జండవర్మ చంపం గడంగుడు, అతనిం జెనకినం దామే చచ్చెద మని చెప్పి, వానినుండి అతనిని రక్షించిరి. కాని, ప్రభుత్వము తమచేతిలో లేనందున అతని నయ్యాపదనుండి యుద్ధరింపఁ జాల రైరి. దారుణకర్ముఁ

డయిన యీచండవర్మఁడు ఆవృత్తాంత మెల్ల రాజరాజగిరియందు తపస్సు చేసికొనుచున్న దర్పసారునికి సందేశించి, పుష్పోద్భవునికుటుంబము నెల్ల సర్వస్వధనహరణ పూర్వకముగా చెఱలో వైచి, తనకు అడిగినను కొమారితనియ్యక తిరస్కరించిన యంగరాజుమీఁదికి దాడి వెడలి, రాజవాహనుని ఎవరియందును తనకు నమ్మకము లేనందున ఎవరికిని అప్పగింపక తనతో కూడనే తోడుకొని, చమూసమూహముల భరముచేత క్షమాచక్రము ఘూర్ణిల్లు నట్లుగా పోయి, చంపానగరమును ముట్టడించెను. సిగలో దోఁపి బయటికిం గనఁబడకుండు నట్లు కట్టుకొని యున్న చూడామణియొక్క ప్రభావమునం జేసి రాజవాహనుఁడు ఆఁకలి డప్పి లోనగు ఖేదములు తప్పి స్వస్థముగా నుండెను. చంపేశ్వరుఁడు సింహవర్మ అసహ్యపరాక్రముఁడు ప్రాకారమునందు గండి పొడుచుకొని గొప్పదండుతో వెలువడి, దూతిముఖమునం దాఁ బంపిన పిలుపు అంది తోడ్పడుటకు వడివడి నరుదెంచుచున్న పుడమి ఱేఁడుల కూడిక త్వరలోనే సమకూడ నున్నను దానికై వేచక, దేహము దాల్చిన దర్పంబువోలె ఓర్పన్నమాట లేక, ఎదిరిదండు నెదుర్కొనియె. దారుణం బయిన పోరాటంబున తన సైన్యమండలం బెల్ల క్షయ మొందఁగా లెక్కకు మిక్కిలి యయిన తీక్ష్ణాయుధముల వ్రేటులుపడి మర్మములు వ్రస్సియున్న సింహవర్మను మానుషాతీత మయిన ప్రాణబలము కలవాఁడయిన చండవర్మ ఏనుఁగునుండి ఏనుఁగుమీఁదికి దుమికి పట్టుకొనెను. అబలారత్న మని ప్రఖ్యాతి నొందిన యాతని కొమారితను అంబాలికను తాను అతిమాత్రముగా వలచినవాఁడు గావున ఆతని ప్రాణమును హరింపక గాయములనుండి ములుకుల నెల్ల వెలుఁవరించి చెఱసాలయం దుంపించెను. ప్రతిన తప్పనివాఁడై పెక్కుగణకుల చేత ఆరాత్రి కడపటి ముహూర్తమే రాజకన్యను వివాహ మాడుటకు శుభసమయ మని గణింపించెను.

వివాహమునకై ఆతఁడు పెండ్లికొడుకై మంగళకంకణమును ధరించుచు, కుబేరపర్వతమునకు పోయివచ్చిన కాలరి ఏణజంఘుఁ డనువాఁడు ప్రభు వయిన దర్పసారుని ప్రత్యుత్తరమును ఇట్లు తెలియఁజేసెను.—'ఓయి మూఢుఁడా, కన్యాపురదూషకుని మీఁద నయితము కనికరమునకు కారణ మున్నదా? ముసలివాఁడు ఆరాజు ముదిమిచేత మది దప్పి మానావమానములు వదలుకొన్నవాఁడై చెడిపోయిన కూఁతుమీఁది పక్షపాతముచేత ఏమేని ప్రేలిన, నీవును ఆతని యిచ్ఛప్రకారము నడచుకో వలయునా? తామసింపక ఆకామోన్మత్తుని చిత్రవధ చేసి ఆవార్త మాకు శ్రవణోత్సవము గావింపుము. ఆ చెడుకన్నెను దాని తమ్ముఁడు కీర్తిసారునితోఁ గూడ కాళ్లకు సంకెలలు వైచి చెఱలో వైవవలయును.' అని. దానిని విని చండవర్మ 'తేపు తెల్లవాఱుఁగానే ఆదురాత్ముని కన్యాపురదూషకుని

తెచ్చి నిలుపవలసినది. మదపుటేనుఁగును చండపోతక మనుదానిని తగినట్టు సన్నద్ధ పఱిచి అచ్చటనే తెచ్చి నిలుపవలయును. వివాహకర్మ ముగించికొని నేనే అదురాచారుని ఆయేనుఁగునకు ఆట బొమ్మం జేసి, దానినే ఎక్కి-పోయి, శత్రువునకు తోడ్పడుటకై వచ్చుచున్న రాజుల సమూహమును వారి బొక్కసమును వారి వాహనములను సమస్తమును పట్టెదను.' అని వచించి, పార్శ్వచరులను 'సన్నద్ధులరై యుండుఁడ'ని హెచ్చరించెను. మఱునాఁడు సంజకెంజాయ ఆకసంబునం బొడతెంచు చుండఁగానే, రక్షులు రాజ కుమారుని రాజాంగణమునకుం దెచ్చిరి. గండస్థలములకు మంగలకత్తులం గట్టిన చండపోతం బును వచ్చెను. ఆ నిముసంబున రాజవాహనుని యడుగుదోయినుండి యా వెండిగొలుసు ఊడిపోయెను. అదియు నెలవంక కాంతితోడి యొకానొక యచ్చరగా మాఱి రా కొమరుని వలగొని కేలుదోయి మోడ్చి యిట్లని విన్నవించెను.—

ప్రభూ, అనుగ్రహముతో చిత్తగింపుము. నేను చంద్రకిరణంబునం బుట్టిన సురాం గనను, సురతమంజరి యనుదాన. ఒకప్పుడు ఆకసమున నాముఖమును బేల యొక రా యంచ తామర యనుకొని ముసరుకొనఁగా, దానిం దఱుముటకై నాపడిన త్రొక్కట ములో నాముత్యాల పేరులోని పేట యొకటి యూడి, మంచుకొండలో మందోదకమను సరస్సులో మునిఁగి లేచిన మార్కండేయమహర్షి యొక్క శిరమున, ముడిమివలని నరపును ముక్తామణుల కిరణములచే ఇనుమడించుచు, దైవవశంమునం బడినది. ఆయన కోపించి నన్ను శపించెను.—'పాపాత్మురాలా, లోహజన్మ మెత్తి చైతన్యము లేక పడి యుండుము.' అని. నేను బతిమాలుకొనఁగా, నీపాదపద్మ యుగళమునకు రెండు మాసముల కాలము సంకెలగా నుందు వనియు దాన నాశాపము తీఱు ననియు సంకెలతనమందు ఇంద్రియ పాటవము మాత్రము తగ్గకుండు ననియు అనుగ్రహించెను. మహాపాపంబునం జేసి వెండి గొలుసనై పడియున్న నన్ను, ఇక్ష్వాకువంశ్యునకు వేగవంతుఁడను రాజునకు పౌత్త్రుఁడు మానసవేగుఁ డనువానికొడుకు వీరశేఖరుఁ డనువిద్యాధరుఁడు కని కైకొనియెను. మఱి యాతఁడు తన తండ్రి చేసికొన్న వైరి యగువిద్యాధర చక్రవర్తిని వత్సరాజవంశ వర్ధనుని నరవాహనదత్తుని ద్వేషించి, అతనికి కీడు సేయు నితఁడు దంట యని కైలాసమందు తప స్సు సల్పుచున్న దర్పసారునితో చెలిమి చేసికొనియెను. అతఁడును ఇతనికి తన చెల్లె లిని అవంతిసుందరిని వాగ్దానము చేసినాఁడు. ఒకప్పుడు వీరశేఖరుఁడు ఆకసమునందు పండువెన్నెల నిండారి యుండఁగా, తనమనోరథప్రియాతమను అవంతిసుందరిని చూడఁ గోరి ఇంద్రియములను నిగ్రహింప నేరక దేవేంద్రభవనముం బోని కన్యాంతఃపురమునకు వచ్చెను. తిరస్కరిణీ విద్యా ప్రభావంబున ఒరులకంటికి కనఁబడక ప్రవేశించినవాఁడై,

ఆ సమయంబున నీదేహమునంటి పరుండిన యాసుందరిని-ముల్లోకముల సృష్టిస్థితిసంహార సంబద్ధము లయి అవ్యాహతము కాలువ గట్టుచున్న నీ వచించు కథలను వినుటచే నీదెస రాగంబు వెల్లి వొడుచు చున్న దానిని - గాంచెను. కోపముం జెందియు నీతేజముచేత వేఱు హాని చేయుటకు వెఱచినవాఁడై, మీరు ఒండొరుల కవుంగిట నత్యంతసుఖనిద్రం జెందియున్న తఱిని, విధిప్రేరణచేత నీ యడుగుదామరదోయికి వెండిగొలుసనై యున్న నన్ను సంకెలగాఁ దగిలించి, రోసంబున వెసమై నోసరించెను. నాకు ఆశాపమును నీకు ఆ రెండుమాసముల పరాధీనతయు ఇప్పుడు తీఱినవి. దయ యుంపుము, నే నిప్పుడు నీ కేమి సేయవలయును?'—ఇట్లు వచించి ప్రణమిల్లిన యా సురాంగనను రాజవాహనుఁడు 'ఈవార్తచే నాప్రాణసమానను ఓదార్పుము.' అని పనిపెట్టి వీడ్కొల్పెను.

ఆ నిముసమునందే 'వచ్చె వచ్చె చండవర్మ! సింహవర్మకొమారిత యంబాలిక చేతిని తాఁకుటకు ఆసాస బాహుదండముం జాఁపఁగానే, దానినే గట్టిగా పట్టుకొని తటాలున నీడ్చి ఎవఁడో అలవిగాని పని సేయు జగదొంగ క్షణములో చిక్కటారితో ఒక్క పోటుననే వానిప్రాణమును గ్రుక్కొన్నాఁడు; రాజమందిరప్రదేశమును వందలు వందలుగా పీనుఁగుల పెంటం గావించుచు అదొంగ నిర్భయముగా క్రీడించుచున్నాఁడు.' అని గొల్లు వినఁబడినది. దానిని విని రాజవాహనుఁడు మావటీని త్రోసివైచి ఆ మదపుటేనుఁగు మీఁదనే ఎక్కి వేవేగ రాచనగరికడకు ఉఱవడించెను. ఏనుఁగు త్రోసికొని వచ్చెడు వేగమునకు చెల్లాచెదరై కాల్బంట్లు దారి తొలఁగఁగా, నగరిలోపల ప్రవేశించి అమోఘు మేఘనిర్ఘోషముం బోని గంభీరస్వరంబున వలికెను.—'మానవమాత్ర దష్కర మయిన యీ దొడ్డచేతం గావించిన యా మహాపురుషుఁ డెవఁడు? అతఁడు వచ్చి నాతోఁ గూడ ఈ మదపుటేనుఁగుపై కూర్చుండుఁ గాక. నాచెంత నున్నట్టి యాతనికి దేవదానవులతో పోరుచున్నను నిర్భయమే.' అని. ఈమాట విని హర్షోత్కర్షంబున ఆ వీరుఁడు వెలువడి అంజలి చేసి సంజ్ఞచే మోఁకరించినయేనుఁగుమీఁదికి తగిలియుండగులకుండ లాఘవమున ఆరోహించెను. ఎక్కుచున్న యాతనిం గనుంగొని రాజవాహనుఁడు సంతోషముచేత కన్నులు వికసిల్లఁగా, 'ఓహో! నాప్రియవయస్యుఁడు అపహారవర్మ!' అనియాశ్చర్యపడెను. తన వెనుకవైపు కూర్చుండి యాతఁడు తన భుజమూలములయందుఁ జొనిపిన తదీయ భుజాగ్రయుగళమును బట్టి ముందటికి తివిచి తన్ను కవుంగిలింపించికొనెను. తానును తనబాహువులను వెనుకకు మరల్చి ఆతనిని కవుంగిలించెను. క్షణములో ఆలింగన సంభావనంబుం గుదియించి అపహారవర్మ తన్నుం జుట్టవేసికొని పలుదెఱంగులం బోరుచున్న యెదిరి దండులోని ఘోటి మగలను, విల్లు, చక్రము, ఇనుపగుదియ, డొంకెన,

ఈఁటె, బల్లెము, రోఁకలి, చిల్లకోల, లోనగు కైదువుల సముదాయముల ప్రయోగము చేత నేలం గూల్చెను. ఆక్షణములో ఆతఁడు చూచుచుండఁగా ఆవైరిసైన్యమును గూర్చి అన్ని దెసలనుండి గొప్పరాణువలు పరువున వచ్చి చుట్టువాఱుకొన్నవి.

తరువాత ఒకానొకపురుషుండు కొండగోఁగుఁ బువుఁ బసిమి మిసిమి మేనితో, నీలాల వన్నెముంగురులతో, కమలకోమలము లయిన కరచరణములతో, వీనుల నాను కొనుచున్న పాలతెలుపు నిద్దంపు నల్లని కన్నులతో, మొలతో చెక్కుకొన్న రతనాల సురియతో, పట్టువలువతో, సన్నపాటి నడుముతో, పేరురముతో, తనరారి, చేయి తీరినవాఁ డగుటం జేసి వైరిబృందములను అంపవానచే పెంపఱం జేయుచు, కాళ్లబొట్టన వ్రేళ్లతో బిట్టుగా పొడుచుటచేత వడి మీఱిన యేనుఁగుమీఁద ఏఁగుదెంచి, తాను మున్ను విన్నగుఱ్తులచే 'ఇతఁడే సామి రాజవాహనుఁడు' అని కనిపట్టి కేలుమోడ్చి ప్రణమిల్లి, అపహారవర్మపై చూపు నిలిపి, 'నీవు ఆజ్ఞాపించినతీరున అంగరాజునకు సాయ పడుటకు ఈ రాజన్యసమూహమును గుమికూర్చి రప్పించితిని. పగతుని దండు కొంత కూలినది, మిగత పటాపంచ లైనది, దానికైదువులను స్త్రీలును బాలురను హరించి కొని పోవుచున్నారు. ఇంకను ఏమి సేయవలయును?' అని వచించెను. సంతోషించి అపహార వర్మ వాక్రుచ్చెను:—'దేవా, ఈకింకరుని కటాక్షముచే అనుగ్రహింపుము. ఈతఁడును నేనే అనియు ఈరూపముచేతను ధనమిత్త్రుఁ డనుపేరిచేతను మఱుఁగుపడి యున్నాఁడనియు దేవర తలంపవలయును. ఆక్షేప మేమియు లేదేని, ఈతఁడు ఇపుడు అంగరాజును చెఱ విడి పించుఁ గాక, ఎదురులు విడిచి పోయినబొక్కసమును వాహనములను ఒకచోట చేర్చుఁ గాక, ఏకాంతమున నుపవేశించి యుండు దేవరను మనపక్షము వా రయినయీ రాజులతోఁ గూడ వచ్చి కలసికొనును గాక.' అని. రాజవాహనుఁడు 'నీయిచ్చచొప్పన చేయుము.' అని పలికెను. పిమ్మట ఆతఁడు చూపినదారిని పోయి తద్దయుం బెద్ద దైన యొకానొక మఱ్ఱిచెట్టుక్రింద, గంగాతరంగముల గాలి వీచుటచే చల్లని దై దుకూలమువలె తెల్లని దయిన నేలయందు, ఏనుఁగును దిగి, ముందుగా దిగిన యపహారవర్మ తనచేతులతో వడి గాచదును సేయుఁడు, పటికపుఱాలిడియుం బోలె నొప్పచున్న మిన్నేటి యిసుకతిన్నెయందు సుఖముగా కూర్చుండెను.

అట్లు కూర్చున్నయాతనికి ఉపహారవర్మార్థపాల ప్రముతి మిత్త్రగుప్త మంత్ర గుప్త విశ్రుతులతోను మిథిలానాథుఁ డైనప్రహారవర్మతోను కాశీపతి యయినకామపాలు నితోను చంపేశ్వరుఁ డయిన సింహవర్మతోను కలసి వచ్చి ధనమిత్త్రుఁడు ప్రణమిల్లెను. రాజవాహనుఁడు సంతోషంపుఁ దొట్రుపాటుతో వారిం గూర్చి లేచి 'ఏమి! నా మిత్త్రు

బృంద మెల్ల వచ్చినది! ఏమి యభ్యుదయము!' అని యథోచితోపచారముల కనంతరము మిక్కిలి చక్కఁగాఁ గవుంగిలించెను. కాశీపతి మైథిలాంగరాజులను మిత్త్రుల వలన నెఱిఁగి తండ్రులం బోలె గౌరవించెను. తన్ను వారును సంతసంబున నరపవేంద్రుకలు గగుర్కొనుచుండఁగా ఆలింగనము చేయుడు అత్యంతము ఆనందించెను. పిమ్మట ప్రీతిపూర్వకసల్లాపములు ప్రవర్తిల్లఁగా, నెచ్చెలుల విందు అమరఁగా, రాజవాహనుఁడు తనయును సోమదత్త పుష్పోద్భవులయును చరిత్రమును వర్ణించి మిత్త్రుల వృత్తాంతమును వరుసగా వినుటకై ఆప్రస్తావము తెచ్చినవాఁడై దానిం జెప్ప వారిని నియోగించెను. వారిలో మొదట అపహారవర్మ తనవృత్తాంతమును నొడువం దొడంగెను.

---

REGISTRAR
OSMANIA UNIVE

## ద్వితీయోచ్ఛ్వాసము.

## అ ప హా ర వ ర్మ చ రి త ము.



దేవా, నీవప్పుడు బ్రాహ్మణుని కుపకరించుటకు పాతాళబిలముం జొరఁగా, నిన్ను వెదకుచు మిత్త్రబృందము తరలఁగా నేనును పుడమిం గ్రుమ్మరుచు, అంగదేశములో చంపానగరమునకు వెలుపల గంగదరిని తపఃప్రభావమువలన దివ్యదృష్టిం బొందినవాఁడు మరీచి యను మహర్షి యొకఁడు కలఁడని ఉబుసు లాడుకొనుచున్న యొకజనసమాజము వలనం దెలిసికొని ఆ తావునకుం బోవుదెంచితిని. అట నా యాశ్రమంబున నొక గున్న మామిడిక్రింద కూర్చున్న యొకతాపసుని భ్రాంతుని చందమ్మున వివర్ణుఁడై యున్న వానిని కాంచితిని. ఆతఁడు నాకు ఆతిథేయోపచారములు గావింపఁగా, క్షణము సేపు విశ్రమించి, 'అయ్యా, మరీచిమహాముని ఏఁడీ? మా చెలికాఁడు మాతో ఉండి మమ్ముం బెడఁబాసి ఎటకో పోయినాఁడు, అతని గతిని ఆయనవలన తెలిసికొనఁగోరి యున్నాను. అబ్బురంపు జ్ఞానప్రభావము కలవాఁడని యామహర్షి లోకమందు ప్రఖ్యాతుఁడు గదా.' అని యడిగితిని. అంత నాతఁడు వేఁడి నిట్టూర్పు నిగిడ్చి యిట్లు వచించెను.—

ఈయాశ్రమమందు అట్టిముని యుండెను. అతనిని ఒకప్పుడు అంగపురికి సిగపూవని చెప్పఁదగినట్టిది కామమంజరి యను వారతరుణి పయోధరములపై నెక్కొన్న కన్నీటిబొట్టు రిక్కలతోను మొగంబునం గనఁబడుచున్న విరక్తితోను చనుదెంచి సెమలి కుంచియంబోని కేశకలాపంబుతో నేలం బొదువుచు నమస్కరించెను. ఆ నిముసంబుననే దాని తల్లి దాసీవర్గముతో దాని వెంబడిం బఱతెంచి అచటనే ఎడతెంపు లేక చదికిలం

బడియెను. మునీంద్రుఁడు జాలిగొని వారిని చల్లనిమాటల నూరార్చి ఆ భోగముపిల్లను దుఃఖకారణ మడిగెను. అదియు లజ్జతోనుం బోలె నెగులుతోనుం బోలె గౌరవముతోనుం బోలెను 'ఓ భగవానుఁడా, ఐహికసుఖము ప్రాప్తి లేనియీమానిసి ఆముష్మికకల్యాణము నభిలషించి అగ్రానుగ్రహపరాయణము లయిన మీచరణములనే శరణముగా అండ గొన్నది.' అని చెప్పుకొనెను. అంతట దాని తల్లి మోడ్పుఁగే లెత్తి నరపువలనిపలువన్నెలు గల దైనజుట్టుముడి నేలకు తగులునట్లుగా మ్రొక్కి లేచి ఇక్కరణి వక్కాణించెను.—

ఓ భగవానుఁడా, దీనియెడ నేను జేసిననేరమిని ఇదె మీదాసిని నేను విన్నవింపు చున్నాను. నాదోష మే మన, నా చేయవలసిన దానిని నేను చేయుట. ఇది గదా వేశ్యకు తల్లి చేయవలసినది.—కూఁతునకు పుట్టువు మొదలుగా పసుపునూనియులమర్దనసేఁత, తేజమును బలమును వన్నెను మేధను సంవర్ధించునదియు వాతాదిదోషత్రయమును జాఠరాగ్నిని ధాతువులను సమావస్థయందు ఉంచునదియు నైనమితాహారముచే శరీరపోషణము, ఐదేండ్లప్రాయము దాఁటినప్పటినుండి తండ్రిని సయితము ఎక్కువగా చూడ నీయమి, పుట్టినదినములందును పుణ్యదినములందును మంగళము గావించి పండువు సేఁత, అంగములతోడి యనంగవిద్యలను నేర్పించుట,—ఆట పాట, వాద్యము వాయించుట, నటనము, చిత్తరువు వ్రాఁత, చవు లూరునట్లు ఆసవాదులను భోజ్యములను సిద్ధపఱుచుట, పరిమళద్రవ్యములం గూర్చుట, పూవులు గ్రుచ్చుట - అనెడి కళలయందును వ్రాఁతలో ఎఱుఁగుటలో మాటలోను చక్కఁగా నేర్పు పొందించుట, తర్క వ్యాకరణ జ్యోతిశ్శాస్త్రములయందు మాటమాత్రనే గ్రహింప నేర్పుట, జీవిక నెఱుంగుటయందును ఆట నేర్పునందును, సజీవ నిర్జీవ ద్యూతకళలయందును గల కిటుకులను ఉపదేశించుట, ఆభ్యంతర కళలయందు నమ్మక మయినవారివలన నేర్పులకరించుట, దేవతల జాతరల యుత్సవములందు ఆదరముతో కైసేసి సమృద్ధ మయిన పరిషవముతో బయటఁ జూపుట, సంగీతాదిప్రసక్తులు కలిగినప్పుడు ఎవరిమాట చెల్లునో అట్టివారిని ముందుగా వశీకరించుకొని వారిమూలముగా సిద్ధి పొందించుట, ఆయాశిల్పములలో పేరెత్తినవారిచేత నానాదిక్కులందు కీర్తిని వెల్లడి చేయించుట, సాముద్రికాదులచేత శుభలక్షణములను ప్రకటింపించుట, విట విదూషక పీఠమర్ద భిక్షుకీ జనములచేత జాణలగుపురుషుల కూటువులయందు రూపాచారమాధుర్యములను ఉగ్గడింపించుట, కోడెకాండ్రకోరికలకు గుఱి యైన తఱిని రోయిని మిక్కిలి ఎక్కువగా నిర్ణయించుట, తానై వలపుచే మైమఱచి యున్న వానికేని దాని యనురాగభావమును కని వేఁడుదుగొన్న వానికేనియు జాతి రూప వయో ధన శక్తి శౌచ దాన దాక్షిణ్య శిల్ప మాధుర్య సంపత్తి గల స్వతంత్రునికి ఇచ్చుట, గుణో

తత్ప్రష్టుఁడును మహాప్రాజ్ఞుఁడును అగువాఁడు అస్వతంత్రుఁడై కొంచెమే ఇచ్చినను విస్తారము ఇచ్చినట్లు చెప్పుకొనుచు వానికి ఒప్పగించుట, నాయకుఁడు ధన మీయక కేవలకామోపభోగపరాయణుఁ డయ్యెనేని అధికరణమందేని సాధించుట, నాయకుఁ డనురక్తుఁడేని కూఁతును మఱి యొకనితోఁ బోనీయక వానితోనే ఏకనాయికానియమము నాచరింపించుట, హరింపఁగా మిగిలిన విటధనములను చిత్రోపాయములచేత నిత్య ప్రీతిదాయములుగాను నైమిత్తికప్రీతిదాయములుగాను అపహరించుట, ఇయ్యని పిసిఁడి వానితో ద్వేషించి యుండుట, మరు లూనిన పిసినారికి పోటిగాండ్రను పురికొల్పుటచేత త్యాగశక్తిని రగులఁ గొల్పుట, ఫలహీనుని కాఱులు పల్కుటచేతను లోకులయెదుట ఱట్టు సేయుటచేతను కూఁతును వానినుండి ఆటంకపఱుచుటచేతను సిగ్గు పుట్టించుటచేతను ఇతరులను వానిమీఁదికి లేపుటచేతను అవమానించి తఱిమివేయుట, ధన మిచ్చు వారును చెట్టలం బోనిట్టువారును అదూష్యులును అగుధనికులతోఁ గూడుటచేఁ గలుగుకీడుమేళ్లను గుఱించిన సంశయములను చక్కఁగా విచారించుకొని వారితో మాటిమాటికిం గూర్చుటయు. బోగము దానిపాలి యే పుర-విటులయెడ రక్తవోలె నటించుటయే గాని రక్తి వహింపమి, అనురక్తి కలిగినను తల్లిమాటను గాని తల్లితల్లిమాటను గాని అతిక్రమింపమియు.

లోకమర్యాద యిట్లుండఁగా, ఈపిల్ల బ్రహ్మదేవుఁ డేర్పరించిన తనధర్మమును అతిక్రమించినదై ఈయూరికి ఎటనుండియో వచ్చిన యొకయొఱపరి నిఱుపేద బాపనకోడె కానితో తన ధనమే వ్యయించుచు ఒకనెల యంతయుఁ గడపినది. విటజను లెందఱో ధనవంతులు దీనిచే నిరాకృతులై కోపగించినారు. అయ్యో! మాకుటుంబము కూలిపోయినది. 'ఈబుద్ధి చెరుపు, మంచిది కాదు.' అని నేను అడ్డగింపఁగా, ఇది కోపంబున వనవాసమునకుం దగలి వచ్చినది. దీనిపట్టును ఇది వదలదేని మే మందఱము గత్యంతరము లేక ఇటనే తిండి మాని క్రుంగెదము. — అని.

అంత తాపసుఁడు ఆభోగపుజవ్వనిని 'ఓసి కల్యాణీ, ఈ వనవాసము దుఃఖముల నిచ్చునది; ఇందులఫలము మోక్షమో స్వర్గమో; అందు మొదలిది ఉత్తమజ్ఞానముచేత అలవడునది; ప్రాయికముగా అందనే అందదు. రెండవది యన్నను తమతమకులధర్మము నాచరించువారి కెల్ల సులువుగా దొరకునదే. కావున శక్యముకాని పూనికను మాని తల్లి మాట బడి నడచుకొమ్ము' అని కనికరముతో బోధించెను. వారతరుణి బదులు చెప్పెను.— 'భగవానులవారి పాదమూలము శరణము కాదేని దీనురాలికి సాకు హవ్యవాహనుండే శరణ మగుఁగావుత.' అని యుమ్మలించెను. అంత నాముని పరికించి వేశ్యామాతతో అనియె:— 'ఇప్పుడు నీ యింటికి పొమ్ము. కొలఁది దినములు ఎదురు సూడుము. ఈలోపల ఈకోమలాంగి

సుఖోపభోగములకు అలవాటుపడినట్టిది అడవికాఁపురమునకు బడలియు మాటిమాటికి మాచేయు బోధనలం దెలివి నొందియు సహజస్థితికి రాఁగలదు.' అని. అందుల కంగీకరించి దాని స్వజనము మరలిపోవుడు, ఆగణిక ఆఋషియందు అధికభక్తిగలదై ఉదికిన రెండు మడుగు వలువలం దాల్చి దేహసంస్కారమునందు ఎక్కువ యక్కఱగొనక, ఆశ్రమము లోని గున్న చెట్లపాదులనిండ నీరు వోయుటచేతను, దేవతార్చనకై పూమొత్తములను అలఁతయోర్చి కోయుటచేతను, నానావిధము లయిన పూజోపహారములను సిద్ధము చేయుట చేతను, కామోద్దీపనార్థమై గంధ మాల్య ధూప దీప నృత్య గీత వాద్యాదిక్రియలచేతను, ఏకాంత మందైననో ధర్మార్థకామములకు సంబంధించిన కథలచేతను బ్రహ్మతత్త్వముంగూర్చిన వాదములచేతను స్వల్పకాలములోనే ఆయనను అనురంజించెను. ఒక నాఁడు ఏకాంతమున ఆతని రక్తునిగా నెఱింగి, 'ఎంతమూఢులు జనులు! అర్థకామములను ధర్మముతోఁగూడ ఎన్నుచున్నారు!' అని ఇంచుక మందహాసము చేసెను. 'చెప్పవే పిల్లా, ఏయంశమున అర్థకామములకంటె ధర్మము ఉత్కృష్టమని నీయభిప్రాయము?' అని మరీచి ప్రేరింపఁగా వేశ్య లజ్జ యడ్డపడినట్లుం బోలె అల్లనల్లన వచింపం దొడంగెను.

ఈమానిసివలన నఁట భగవానులవారు ధర్మార్థకామముల పరస్పరతారతమ్యము తెలియంగుట! కాదేని అదియు దాసజనము ననుగ్రహించెడి యొకప్రకారాంతరము. కానిండు, వినుఁడు. స్వామీ, ధర్మమువలనం గాక అర్థకామములు పుట్టనే పుట్టవు వానితోఁ బనిలేకుండ ధర్మము నివృత్తిసుఖమును గనునట్టిదియు, మనస్సును సరిపఱుచుకొను మాత్రముచే లభించునదియు. అర్థకామములకుం బోలె బయటిసాధనములు ధర్మమునకు ఆవశ్యకములు గావు. మఱి తత్త్వదర్శనబలము కలిగిన ధర్మము ఒకపాటి యర్థకామముల సేవచేత హానిం జెందదు. చెందినను కొంచెపాటిప్రయాసచే సరిపడి ఆదోషమును తొలఁగించుటయే గాక మహత్తర మయిన శ్రేయస్సును కూడ నొడఁగూర్చును. అందులకు - బ్రహ్మదేవుఁడు తిలోత్తమను వలచుట, పరమశివుడు వేనవేలను మునిపత్నులను చెఱుపుట, శ్రీకృష్ణులవారు పదునాఱువేలమంది రాణివాసములతో విహరించుట, నలువ తన కొమారితయందే మరులూనుట, ఇంద్రుఁడు అహల్యను కామించుట, చంద్రుఁడు గురుభార్యను కూడుట, సూర్యుఁడు గోడిగను దాఁటుట, వాయువు కేసరి భార్యను గవయుట, బృహస్పతి ఉతథ్యభార్యను పొందుట, పరాశరుఁడు జాలారిపిల్లను చెఱుపుట, వేదవ్యాసుఁడు సోదరభార్యలయందు ప్రవర్తిల్లుట, అత్రి మృగాంగనతో సంగమించుటయు - నుదాహరణములు. దేవతలకును ఆయాకార్యములయందు అకృత్యాచరణములు జ్ఞానబలముచేత ధర్మహానిని కలిగింపవు. ధర్మముచేత పవిత్ర మయిన మనస్సునకు ఆకాశ

మునకు దుమ్మువోలె రజోగుణము ఎంత మాత్రమును అంటుకొనదు. కావున అర్థకామములు ధర్మముయొక్క నూఱవభాగమున కేని సాటి గావని నాయభిప్రాయము.

దీనిని విని ముని రాగము రేఁగి యిట్లడిగెను.—'ఓసి విలాసినీ, చక్కఁగా కనిపట్టితివి, తత్త్వజ్ఞానవంతులకు విషయోపభోగముచేత ధర్మహాని కలుగదని. కాని పుట్టువుం దొట్టి అర్థకామము లన్న మాటయేని యెఱుంగనివారము మేము. దీనికి స్వరూప మేమో పరికర మేమో ఫల మేమో వినఁగోరికగా నున్నది.' అని. వెలయాలు పలికెను:— 'వానిలో అర్థమనుదానికి గడించుట, పెంచుట, కాపాడుటయు స్వరూపము.! సేద్యము, పశుపోషణము, బేరము, ఒడంబడిక, పోరు మొదలగునవి పరికరములు; పాత్రమున కిచ్చుట ఫలము. కామ మనఁగా విషయాసక్తమానసు లగు స్త్రీపురుషులకు పెంపుమీఱిన యింపొసంగెడు నొకానొక తాఁకుడు; రమణీయమును ప్రకాశమానమును అగు వస్తువెల్లను దానికి పరికరము; మఱి ఫల మే మనఁగా-పరమాహ్లాద మిచ్చునది, ఒండొరుల సమ్మర్దముచే జనించునది, జ్ఞప్తికి వచ్చినప్పుడు సయితము మనస్సును హరించునది, అభిమానమును పోనడచునది, ఎవరికి వారే ఎఱుఁగవలసినది, తనకు మించినది లేనట్టిది ప్రత్యక్షసుఖము. దానికోసమే మానవులు ఉత్కృష్టస్థానములయందు నెలకొని కష్టమయిన తపస్సులు చరింతురు, మహాదానము లిత్తురు, ఘోరయుద్ధములు సేయుదురు, భయంకరముగా సముద్రమును దాఁటుదురు.' దీనిని విని, విధిబలముచేతనో, దాని నేర్పుచేతనో, తన బుద్ధిమాంద్యముచేతనో, తన నియమములను మాని దానియందు తగులము వహించెను. అదియు తద్దయు మొద్దఁడయినయాతనిని అందలములో నెక్కించి పట్టణమునకుం గొనిపోయి కరము శోభమానమయిన రాజవీధిగుండ తనయిల్లు సేర్చెను. 'రేపు కామోత్సవ'మని చాటింపు మ్రోఁగెను.

మఱునాఁడు స్నానమాడి కలపమలంది తలకు పూదండం జుట్టి కాముకజనులనడవడిం గయికొని మునిచర్యపై నభిలాషమాని, నిముసమేనియు ఆచాన పాసిన చిత్తంబున నుత్తలంబడుచున్నవానిని ఆఋషిని విభవవంతమయినరాజవీధిలో ఉత్సవంపు గుంపుతోఁ గొనిపోయి, ఒకానొక తోఁటలో నొక్కెడ సుందరీ సందోహములు బలసి కొలుచుచున్న రేనిమ్రోల దగ్గఱి నిలిచెను. రాజు చిఱునగవు నవ్వుచు 'ఓశోభనురాలా, స్వామివారితోఁ గూడ కూర్చుండుము.' అని యానతీయఁగా, ఒయ్యారము లొలుకుచుం బ్రణమిల్లి కూర్చుండెను. అంత నచ్చట నొకవరాంగన లేచి కేలుమోడ్చి 'దేవరా, నేను ఈమెకు ఓడితిని, నేఁటినుండి ఈమెకడ వరవుడమునకు ఒడంబడినదాన.' అని పలికి రేనికి మ్రొక్కెను. ఆశ్చర్యసంతోషముల మూలమున అచటిలోకుల గొల్లు పెల్లుగా నుప్పతిల్లెను. రాజు మెచ్చు

కొని వెలపొడుగు తొడవులను గొప్పవిభవంబును ప్రసాదించి వీడు కొల్పఁగా, కామమం జరి తన్నువారముఖ్యులును పౌరముఖ్యులును గుంపులు గూడి పొగడు చుండఁగా, తన యింటిదాఁకం బోకయే ఆమునితో 'భగవానుఁడా, ఇదె మీకంజలి చేసెద, పెద్దయుం దడవు ఈ దాసిని అనుగ్రహించితిరి. ఇఁక పోయి మీపనిని మీరు చూచుకొనవచ్చును.' అని విన్నవించెను. అతండో రాగంపువేగంబున పిడుగు తాఁకిన వాఁడుంబోలె బమ్మెరపోయి 'ప్రియా, ఇదేమి? ఎక్కడినుండి వచ్చినది ఈయొప్పరికము? ఏమయినది నామీఁది యా యసామాన్యప్రేమ?' అని మొఱ యిడెను. అంత నావెలనెలఁత ఎలనగవుతోఁ బలికెను.— 'స్వామీ, ఇప్పుడు రాజమ్రోల నాకలన ఓటమిని ఎవతె ఒప్పుకొన్నదో దానికిని నాకును మాటలరాయిడి య్యె 'ఔరా! మరీచిమహర్షిని వలపించినదానివలె పొగడు కొనెదవు!' అని నన్ను అది దెప్పినది. అంతట నేను దాస్యమే పందెముగా ఈపనికి పూనితిని. నీయను గ్రహంబునం జేసి గెలుపు నొందితిని.' అని. ఆతీరున నా గణిక విడనాడఁగా-ఆదుర్మతి పశ్చాత్తప్తుఁడై ఏమియుం దోఁపక నివర్తిల్లెను. ఎవనిని అది యట్లు గావించినదో ఆ దీనుఁ డను నేనే యని, మహాభాగుఁడా, ఎఱుంగుము. నేర్పుమెఱసి ఆచెడిప తాను నాటినరాగ మును పెకలించి తానే పరమవిరాగతను అర్పించినది. నన్ను నీకార్యము నెఱవేర్చుటకు సమర్థునిఁగా త్వరలోనే చేసికొనఁగలను. అంతవఱకు ఇటనే చంపయందే ఉండుము.

పిమ్మట, ఆమునిమనంబును వీడి వెలువడినతమము తన్నుతాఁకునో యను భీతిచే తనుం బోలె సూర్యుఁడు అస్తమించెను. ఋషివదలిన రాగము సంజగా పరిణమించెను; ఆతనికథచే వైరాగ్య మొందినవియుంబోలె తామరపండములు ముకుళించినవి. నేను మునియానతి సంగీకరించి ఆతనితోనే సంధ్యోపాసన కావించి, తగిన కథలుచెప్పుకొని అతనివెంబడిం బరుండి రాత్రి గడపి పొడుపుగుబ్బలి నెత్తంపు పెరగలివోలె కల్పపాద పంపుఁ జివురు జొంపముల కెంపుం గ్రేణి సేయుచు నరుణకిరణములవెల్లు పొడతెంచుడు, మునిని నమస్కరించి నగరమునను కదలితిని. దారిచెంత నొకక్షపణకవిహారమునకు బయట విజన మయిన యట్టికంకేళిగుబురులో మనోవ్యాధిచేత కృశించియున్న దీనవర్ణుని సమాధి సేయక కూర్చున్న యొకక్షపణకుని చూచితిని. అతని అగ్లమున మొగమునుండి రాలుచు మురికి తిరికలను కరఁగించుచున్న కన్నీటి బొట్టులను కనుఁగొంటిని. చెంత గూర్చుండి యడిగితిని, 'తప స్సెక్కడ? ఏను పెక్కడ? రహస్యము కాదేని దుఃఖకారణమును వినఁ గోరుచున్నాను.' అని. ఆతఁడు ఇట్లు వక్కాణించెను.—

"సౌమ్యుఁడా, వినుము. నేను ఈచంపాపురియందే నిధిపాలితుఁ డను సెట్టికి పెద్ద కొమారుఁడను. నా పేరు వసుపాలితుఁడు. విరూపుఁ డను గాన విరూపకుఁ డని నామాం

తరము ప్రసిద్ధ మయినది. ఈయూరనే ఇంకొకఁడు సుందరకుఁడని యథార్థనాముఁడు కలాగుణ సమృద్ధుఁడు ధనముమాత్రము దండిగా లేనివాఁడు ఉండెను. వైరములు పెట్టుటచే జీవించువారయిన యూరితుంటరులు మాయిరువురకును సొంపునుసంపదను నిమిత్తములంజేసి వైరము కల్పించిరి. వారే ఒకప్పుడు మమ్మిరువురను ఉత్సవసమాజములో ఒండొరులను అవమానించి నిందించునట్లుగాఁ జేసి, తామే వల్లార్చి 'సొంపుగాని సంపదగాని మగతనమునకు కారణము గాదు. మఱి గుబ్బెతల సిగపూ వయిన కామమంజరి ఎవనిని వలచునో వాఁడు సొబగుఁడౌను కైకొనుఁగాక.' అని ఏర్పాటు చేసిరి. అందులకు 'మే మిరువురము ఒప్పుకొని దానికి దూతల నంపితిమి. నేనే కదా దానికి వలరాచ వేడుకలకు హేతువ నైతిని. కూర్చుండియున్న మాయిరువురలో నన్నే డగ్గఱి అక్కలికి నల్లగలువలదియుం బోని కడకంటి చూపుల మాలికను నామేన వైచుచు అతనికి అవమానముచే తలవంపు గావించెను. అంతట సొబగుఁడను నేను నాధనమునకు నాయింటికి నాగుణమునకు నాయొడలికిని నా ప్రాణమునకును ఆభామినినే స్వామినిని గావించితిని. నన్ను నది గోచిపాతరాయనిం గావించినది. అది నాధన మెల్ల హరించి నన్ను నెట్టి వైచెఁగా, నేను లోకుల పరిహాసములకు గుఱినై, ఊరిపెద్దల చీవాట్లను సైఁపలేక, ఈక్షపణక విహారమునందే ఒకమునివలన ఈదారి నేర్చి, భోగపుగూడెమునుండి వెలువడినవానికి ఈవేసము సులువుగదా అని వైరాగ్యము తలకొనఁగా ఆగోచిని నయిశెము పాటి వైచితిని.

అటుతర్వాత ఒడలంతయు మురికిముద్దమై, వెండ్రుకలను తండసముగో పీఁకించుకొను వెనుబాధ పడుచు, మీఱిన క్షుత్పిపాసాదుల వలనదుఃఖము చెందుచు, స్నానాసన శయన భోజనములయందు బలీయములయి నిర్బంధములచేత క్రొత్తగా పట్టువడిన యేనుఁగువోలె బెగ్గడిల్లి నాలోనే నిట్లూరసికొంటిని.—'నేను ద్విజన్ముఁడను గదా. నాకు ఈపాషండమార్గము నంబడుట స్వధర్మము గాదు. శ్రుతిస్మృతులందు చెప్పఁబడిన మార్గముననే నా పూర్వులు వర్తిల్లిరి. అదృష్టహీనునికి నాకు పాడువేసము వేయించునది బలుశోకములకు ఉనికిపట్టు హరిహరబ్రహ్మాదిదేవతలను నితంతరము నించుచుండుటచేత చచ్చినపిమ్మట సైతము నరకమునకే నడపునది నిష్ప్రయోజనము వెనుమోసము అగు నీయధర్మమార్గము ధర్మముగా ఆచరింపవలసినది అయినది.' అని. నాదుర్నీతిని ఆకళింతముఁ దెచ్చుకొని ఏకాంత మయిన యీయశోకములగుబురునందు గూర్చుండి దుఃఖము తీఱ కన్నీళ్లు విడుచుచున్నాను." అని.

దీనిని విని కనికరమున నే నంటిని:—'భద్రుఁడా, కొంచెపాటి కాలము వేఁపుము; ఇటనే యుండుము; నీధనమును తెచ్చి ఆవేశ్యయే నీకిచ్చునట్లు నేను యత్నించెదను. అందులకు ఉపాయము లున్నవి.' ఇట్లు ఆతని నోదార్చి నేను లేచి పురముం జొచ్చుచు

నే లోకుల సంభాషణలవలన ఊర పిసినారి ధనికులు నిండియున్నారని గ్రహించి, వారిని ధనములు స్థిరములు గావని చూపి సహజ స్థితికి తెచ్చువాఁడనై మూలదేవుఁడు చెప్పిన మార్గమును అవలంబింపం దలపెట్టితిని. జూదపు సమాజములో ప్రవేశించి జూదరులతో కలసితిని. వారియందు జూదమునకును సారెలకును సంబంధించిన యిరువది యైదు తెఱంగుల కళలలో నెల్ల నేర్పును, పాచికలందును నేలయందును చేతియందును ఎంతమాత్రమును కనిపట్టరాని మోసపుఁ బనులను, ఆ కారణంబునఁ గర్వముతోడి నిందలను, ప్రాణముమీఁది యభిమానమును మానిన వేగిరంపుఁ జేఁతలను, ఒడంబడిన యర్థమును సాధింప సమర్థములును వ్యవహారము న్యాయము బలము ప్రతాపమును దీపించునవియు నగు జూదపునాయకుని శపథములను, బలవంతులను మంచిమాట లాడుకొనుట, దుర్బలులను బెదరించుట, పక్ష మేర్పరించుకొను నిపుణత, నానావిధముల బెలిపించుట, పందెపు భేదములను వర్ణించుట, ధనమున పాలిచ్చెడు నౌదార్యము, నడుమనడుమ బూతుమాటలతో నిండిన కిలారింపులును, అను వీనిని ఇంకనిట్టివానిని కని తనియనైతిని. ఒక జూదరి సారెను పొరఁబాటుగా వైవఁగా ఇందుక నవ్వితిని. ఎదిరి జూదరి కోపంబునం గెంపెక్కిన చూడ్కితో నన్ను ఏర్చువాఁడువోలె ఉఱిమి చూచి 'ఏమిరా! నవ్వుమిషచే జూదపుదారి నేర్పెదవా? నేర్వనివాఁడు ఈ ముక్కఁడి యటుండుఁగాక; రా, నెప్పరితో నీతో నే ఆడెదను.' అని పలికి జూదపునాయకుని యనుమతితో నాతో మొనసెను. నేను వానిని పదియాఱువేల దీనారములు గెలిచితిని. అందులో సగము నాయకునికిని సభ్యులకును ఇచ్చి, మిగతసగమును తైకొని లేచితిని. అక్కడివారు హర్షముతో నన్ను ఒక్క మెంగి పెల్లుగా నుగ్గడించిరి. నన్ను వేఁడుకొన్న ద్యూతనాయకుని యిష్టమును మన్నించి అతని యింటనే భోజనము చేసితిని ఎవనిమూలమున నేను జూదములోనికి దిగితినో వాఁడు విమర్దకుఁ డనువాఁడు నాకు మిక్కిలి నమ్మకమయిన రెండవ హృదయ మాయెను.

వానివలన నగరమందు ఎల్లరదియు సారము పని నడువడి సమస్తమును తెలిసికొని, మిత్తిగొంగ కుత్తుకనలుపువంటి నలుపు బలిసిన చీఁకటిలో నీలివలువ చల్లడము దాలిచి వాఁడికత్తి కట్టుకొని, తవ్వుగోల-కత్తెర-పట్టుకాలు-మగతల-మచ్చుపొడి-మోఁగవత్తి - కొలనూత్రము-కొక్కెత్రాడు-లాంతరు-తుమ్మెదల బరణి-లోనగు పెక్కు పనిముట్లు తీసికొని పోయి,ఒక లోభీశ్వరునియింట కన్నము వైచి, చూపు గొట్టింపు సన్న బొక్కగండ ఇంటిలోని వృత్తాంతముం గనిపట్టి, శ్రమ లేక సొంతయింటనుంబోలె ప్రవేశించి, ధనముతోడి పెద్ద గంటును తైకొని వెలువడితిని. కాలుమబ్బుల పేర్పులవలె బలిసిన యిరులు

గ్రుక్కియున్న రాజవీథిలో తటాలున మెఱపులు మెఱసినట్లు నిముసము ఒక వెలుతురుం గంటిని. అంతట పురమును దోఁచుకొన్నందులకు కనలిన పురదేవతయో యన మాటుమణిఁగిన వేళయందు వెడలినట్టిది తళతళ మెఱయు నగలతోడిది ఒక లేజవరాలు తోఁతెంచెను. 'ఎవతెవు నీవు కూఁతురా, ఎట కేఁగెదవు?' అని నేను దయతో నడుగఁగా, ఆమె తొట్రుపడు వెలుంగుతో నాకు ఇట్లు వచించెను.

"అయ్యా, ఈపురమున కుబేరవల్లభుఁ డని మేటికోమటి కలఁడు. నేను ఆతని కూఁతురను. పుట్టినప్పుడే నన్ను మా నాయన ఈయూరివానికే ధనమిత్త్రుఁ డను పేరి ధనిక పుత్త్రునికి వాగ్దానము చేసెను. అతి దాత యాధనమిత్త్రుఁడు తల్లిదండ్రుల స్వర్గగమనమున కనంతరము తనధనముతో యాచకబృందమువలననుండి దారిద్ర్యమును విలుచుకొని పేద పడుఁడు, ప్రీతులైన లోకులవలన ఉదారకుఁ డని శ్లాఘ్య మయిన నామాంతరము పొందిన యాసుజనుఁడు నిషేధించుచున్నను, మా నాయన, ఈ డొందిన నన్ను అతనికి దరిద్రుఁ డని యీయక మఱియొక సార్థవాహునికి అర్థపతి యను సార్థకనామునికి ఇయ్యఁ దలఁచి యున్నాఁడు. ఆయమంగళము రేపు తెల్లవాఱఁగానే జరిగెడు నని యెఱింగి, ముందుగానే నాప్రియతమునికి సంకేతము తెలిపి స్వజనమును కనుఁబ్రామి వెలువడి చిన్నతనములో అలవాటయిన దారివెంట మన్మథుఁడు తోడుగా అతనియింటికి పోవుచున్నాను. కావున నన్ను వదలుము, ఇంద విూ భూషణముం గయికొమ్ము." అని ఒలిచి నా కిచ్చినది. దయ గాని నే నిట్లంటిని. 'ఓ సాధ్వీ, రమ్ము, నీప్రియతముని కడకు నిన్ను నేను తోడ్కొనిపోయెదను.' అని మూఁడు నాలుగు అడుగులు నడచితిని. అంతలో దివ్వటీల వెలుతురుచే చీఁకటిప్రోవులను మాయించుచు లాటీలుం గత్తులుం గేలఁ గలిగి ఊరి కావలివాండ్ర గొప్పతుటుము అరుదెంచెను. వణఁకుచున్న కన్నియతో నంటిని:—"కల్యాణీ, భయపడకు, కత్తితోడిది నా బాహువు ఉన్నది; కాని నిన్ను గుఱించి ఈ సుకు మార్గోపాయమును ఆలోచించితిని. నేను విష మెక్కినవాని వికారములు చేయుచు పరుండెదను. నీవు వీరితో నిట్లు చెప్పకొనుము:—'అయ్యా, మేము రాత్రి ఈయూరికి వచ్చితిమి, నాపతి ఈయన, ఈయనను ఇల్లిదిగో ఈబాటసారుల శాలలోనే ఒకమూల పాము కఱచినది. మీలో ఎవరయిన మంత్రము తెలిసినవారు ఈయనను బ్రదికించి అనద నయిన నాప్రాణమును దక్కింపుఁడు.' అని." ఆబాలయు వేఱు ఉపాయము లేక భయముతో గద్గదస్వరముతో కన్నీళ్ల జడితో వడవడ వడంకుచు ఎట్లో పోయి నేను చెప్పి నట్లే చేసినది. నేనును విషవేగము నభినయించుచు పరుంటిని. వారిలో మంత్రవాది యని యభిమానము వహించిన వాఁ డొకఁడు నన్ను చక్కఁగా చూచి ముద్రాతంత్ర మంత్ర

ధ్యానాదులచే చికిత్సించి ప్రయోజనము గానక 'ఇతఁడు యమునివాతం బడినాఁడు, చచ్చినవాఁడే; అంతే గదా, ఒడలెల్లను కొయ్యపాటి కప్పువన్నెం బొందినది, చూపు ప్రతిబద్ధ మయినది, వేఁడి చల్లాఱినది; అమ్మాయీ, ఏల యేడ్చెదవు ? ఊపు ఇతనికి అగ్ని నొసంగెదము. దైవమును దాఁట నెవ్వరితరము!' అని వచించి ఇతరులతోఁ గూడ పోయెను.

అంతట నేను లేచి ఆమెను ఉదారకునియొద్దకు చేర్చి చెప్పితిని: 'నే నొక దొంగను; నీకే తగులుకొనియున్న మనస్సే తోడుగా నిన్ను అభిసరించుచున్న యీకోమలిని మధ్య దారిలో కలసికొని దయగొని నీకడకు తెచ్చితిని. ఇదిగో ఈనగ యీమెది.' అని కిరణపుంజముచేత ఇరులుం జీల్చుచున్న యీతొడవును కూడ ఇచ్చితిని. దానిం గైకొని యుదారకుఁడు లజ్జయు హర్షంబును సంభ్రమంబునుం బెనంగొన నాతో ని ట్లనియె:—
"అయ్యా, నీవే యీప్రాణప్రియను ఈ రాత్రి నా కిచ్చితివి, కాని నావాక్కును అపహరించితివి. కావున, ఈ నీచేఁత అద్భుత మని వచించుటకు నేరకున్నాను. అయ్యా, నీ నడత అద్భుతమువలె తోఁచుచున్నది. ఇట్లు ఇంతకు ముందు ఎవ్వరును చేయమికి కత మేమన, ఒక్కొకవస్తువునందు ఒక్కొకశక్తి నియతమై యుండుటయే. ఇతరులయం దుండులోభాదులు నీయందు లేవు. ఇప్పుడు నీవు మంచితనమును బయటఁ బెట్టితి వనుట ఇంతకు మును పటి నీ గొప్పచేఁతల ముందఱ సరసము గాదు. నీయభిప్రాయము నూహింపక ఔదార్య స్వరూపమును ఇప్పుడు చూచితి నని నిశ్చయించుట యుక్తము గాదు. ఈ పున్నెపుఁబనిచే నన్ను దాసునిఁగా విలిచితి వనుట, అసారమును కడు గొప్పదానిచే విలిచితి వని నీప్రజ్ఞను ఆక్షేపించుట యగును. ప్రియాదానమునకు నాశరీరమును ప్రతిదానముగా ఇచ్చెద ననుట సరి గాదు, ఏల యన, ప్రియు దొరకదేని మృతిఁ జెంద నున్నట్టిది గాన ఈశరీరము కూడ నీ విచ్చినదే. కావున ఇప్పటినుండి ఈదాసుని నీవు భరింపవలయును, అని విన్నపించుకొనెద." అని పలికి నాపాదములయందు వ్రాలెను. అతనిని లేపి, ఉరమునం జేర్చి, 'భద్రుఁడా, నీవు ఇప్పు డేమి సేయ నున్నావు?' అని యడిగితిని.

అతఁడు వచించెను.—'ఈతరుణిని తండ్రిసమ్మతి లేక పెండ్లియాడి ఇక్కడ జీవించుటకు శక్తుఁడను గాను. కావున ఈరాత్రియే దేశమును వదలఁ దలఁచియున్నాను. అయినను నే నెవఁడను ఏమి సేయుటకును, నీ వే మాజ్ఞాపింతువో అట్లు చేసెదను.' అని. అంత నే నంటిని.—ఈతలంపు ఉండుఁ గాక. నేర్పరి యగుపురుషునికి స్వదేశము పరదేశము అనెడి యీ భేదము లేదు గాని, ఈమె బాల అత్యంతకోమలాంగి, అడవిదారులు దుర్గమములు కష్టములు అపాయములతో నిండుకొని యుండును. ఇట్టి చెనుపూనికచేత

ప్రజ్ఞాబలములకు కొంత జబ్బు తగిలె నని లోకులు తలంతురు. కావున ఈమెతోఁ గూడ ఇచటనే నివసింప వలయును. రా, ఈమెను తనయింటికి కొనిపోవుదము.' అని అందులకు నిశ్శంకముగా అతఁ డంగీకరించుడు, తత్క్షణమే ఆమెను కొనిపోయి తనయిల్లు చేర్చి, అచట ఆమెయే మాకు వేగు కాఁగా, ఆయింట మట్టికుండలు మిగతగా సమస్తము దోఁచుకొంటిమి. అటనుండి వెలువడి చోరితకము నొకచోట పాఁతిపెట్టి, కదలితిమి. అంతలో గస్తీల తుటుము మొకటి రాఁగా దారిప్రక్క తెండియున్న యొకమత్తగజమును సైమానిసిని ఈడ్చివైచి ఎక్కితిమి. మెడత్రాట ఇరుగాళ్లును దూర్చి నేను లేపఁగానే అదియు క్రిందికి ద్రొబ్బిన మావటీని వెడందరొమ్మును అడ్డముగా అడిచి వాని ప్రేవులు చుట్టుకొనియున్న దంతకాండములతో ఆగస్తీల తుకిడీని నుగ్గు చేసెను. దానిచేతనే అర్థపతి యింటిని పడఁగూల్పించితిమి. దానిని దూరముగా కేడించుకొని పోయి ఒక్కెడ పాడటిన తోఁటలో కొమ్మ పట్టుకొని దిగితిమి. స్వగృహమునకుఁ బోయి స్నానమాడి శయనించితిమి.

అంతలోనే పొడుపుగుబ్బలి తేని తామరకెంపుఁగొమ్ము వంటిది కల్పవృక్షంపు బంగారపుఁ జివుళ్ల సిగదండవంటి పాటలవర్ణముతో భానుబింబము మున్నీటినుండి నెగయుదెంచెను. మేము లేచి మొగము గడుగుకొని ప్రాతర్మంగళములను గావించుకొని మా కేయిచేఁతచేత గందరగోళ మైన యూరవెంట తిరుగుచు పరులయిండ్లలో స్త్రీలగలగల భాషణములను వింటిమి. పిమ్మట అర్థపతి కుబేరదత్తునికి ధనము లిచ్చి యోదార్చి కులపాలిక పెండ్లి నెలనాఁటికి జరుగవలసినట్లు ఏర్పరించెను. నేను ఏకాంతమున ధనమిత్త్రునికి ఇట్లు ఉపదేశించితిని.—

మిత్త్రుఁడా, ఏకాంతమున అంగరాజును దర్శించి ఈ మేలి తోలుసంచిన్ని ముందుంచి వచింపుము:—“ఏలినవారికి విశదమే గదా, నేను అనేక కోట్లధనమునకు ఒడయుఁడైన వసుమిత్త్రునికి ఏకపుత్త్రుఁడను ధనమిత్త్రనామధేయుఁడను అని. నేను యాచక కోటివలన మూలధనము సయితము కోలుపోయి, లోకులచే అవమానపడినవాఁడనై నాకొఱకే తాను పెంచిన కూఁతును కులపాలికను కుబేరదత్తుఁడు ఇపుడు నాదారిద్ర్య దోషంబునం జేసి అర్థపతికి ఈయ నిశ్చయించుకొనఁగా, ఆదుఃఖముచేత ప్రాణములు వదలుటకై ఊరివెంబడి వల్లకాటికి పోయి కంఠమునం గత్తి యిడుకొనునంతలో జడదారి యొకఁడు నన్ను ఆఁపి ‘ఓయి, నీయీసాహసమునకు కారణ మేమి?’ యని యడుగుడు, ‘అవమానము సౌందర్యము దారిద్ర్యము’ నని నేనుత్తరము చెప్పుడు, కరుణాపరాయణుఁడు ముని అనుగ్రహించెను:—‘బాబూ, ఎంత తెలియనివాఁడవోయి! ఆత్మహత్యకంటె

పాపిష్ఠతమము మఱియొకటి లేదు; సజ్జనులు తమ్ముఁ గాడపుకొనకయే ఉద్ధరించుకొందురు; ధనార్జనమునకు ఉపాయము లెన్నియేని కలవు, గాని తుండించిన కంఠమును మొండెమున కంటించి ప్రాణము పోయను మాత్రము ఒకటి యేనియు లేదు. ఈమాట లేల? ఇదే నేనున్నాను మంత్రసిద్ధుఁడను. లక్షవరాలు ఈనునట్టి యీ మేలితోలుసంచిని నేను సాధించి యున్నాను. దీనిప్రాపున నేను కామరూప దేశమందు చిరకాలము ప్రజలకు కోర్కులు తీర్చుచు నివసించితిని. నాపై ముదిమి మచ్చరికింపఁగా ఇచ్చోట ఈభూలోక స్వర్గమును చొచ్చువాఁడనై వచ్చితిని. దీనిని నీవు పుచ్చుకొమ్ము. ఇది నాకుఁగాక వర్తకుల కేని గొప్ప వేశ్యల కేని పిదుకును, అని సుమా దీనిని గుఱించిన ప్రఖ్యాతి. కాని, ఎవనివలననుండి ఏ మేమి అన్యాయముగా అపహరింపఁబడినదో దానిని వానికి ఇచ్చివేఁయువలయును, న్యాయార్జిత మేమి కలదో దానిని దేవబ్రాహ్మణులకు ఇయ్యవలయును, మఱియు ఇది పవిత్ర మయిన తావున ఉంచి దేవతనుంబోలె పూజించుచున్నయెడల ప్రతిదినము వేకువను వరాలతో నిండియుండును. దీనికల్పము ఇది.' అని. నేను చేతులు జోడించుకొని నిలుచుంటిని. మోడ్పుఁగేలితోడి నాకు దీనిని ఇచ్చి ఆయన ఒకానొక ఊళి బిలముం జొచ్చెను. మే లయిన యీతోలుసంచిని ఏలినవారికి నివేదింపక అనుభవింపరా దని తెచ్చితిని. అటుపైని ఏలినవారి చిత్తము." అని. నిక్కముగా రాజు 'భద్రుఁడా, సంతోషించితిని, పొమ్ము, నీయిచ్చవచ్చినట్లు దీనిని అనుభవింపుము.' అని వచించును. మరల వచింపును: 'దీనిని ఎవ్వఁడును ముచ్చిలకుండునట్లు ఏలినవారు కాపాడవలయును.' అని. అందులకును అతఁడు తప్పక అంగీకరించును. పిమ్మట ఇంటికి తెచ్చి పైఁజెప్పినట్లు ధనములు ఇచ్చి, అనుదినమును పూజించుచు, దొంగిలించి సంపాదించిన ధనములతో రాత్రి రాత్రి నిండించి, ప్రొద్దున లోకులకు చూపుము. అంతటితో ధనలుబ్ధుఁడు కుబేరదత్తుఁడు అర్థపతిని పరకుగొనక కులపాలికను తానే తెచ్చి నీకిచ్చును. అంతట అర్థపతి కోపించి అర్థమదముచేత నీపై తగవాడుటకు వాజ్యము వేయును, వానిని వెండియు వింతపన్నాగములచేత గోఁచిపాతరాయనిం జేయుదము. మనదొంగపని ఆయుపాయముననే చక్కఁగా కమ్ముదల సొందును.—అని.

ధనమిత్త్రుఁడు సంతోషించి నేను నేర్పినట్లే కావించెను. అపగలే నాపంపున విమర్దకుఁడు అర్థపతికొలువులో కుదిరి అతనికి ఉదారకునిపై వైరముం బెంచెను. ధనలుబ్ధుఁడు కుబేరదత్తుఁడు అర్థపతిమీఁద విరక్తుఁడై, ధనమిత్త్రునికే కొమారిత నిచ్చెదనని బతిమాలుకొనెను. అర్థపతి ఆటంకపఱిచెను.

ఈదినములలోనే కామమంజరిచెల్లెలు రాగమంజరి యనునది ఊరిసభయందు సంగీతకము సేయు నని నగరజనులు అదట మీఱ నేఁగుదెంచిరి. నేనును నానెచ్చెలి

గాయిన ధనమిత్రునితోఁ గూడ నచటి కేఁగితిని. అల్లది నృత్త మారంభింపఁగానే నా మనస్సు దానికి రెండవరంగపీఠ మాయెను. దాని చూపుల్కల కలువతంపరయందు నెలకొని యైదుకోలల వీరుఁడు మెండుకొన్న భావరసములచేత బలమొంది నన్ను మేరమీఱి యేసెను! ఆనృత్తములో ఆయెలనాగ నేను ఊరు కొల్లగొన్నందులకు కోపగించిన యూరి దేవతగూ యన నల్లగలువరేకులువలె నీలంబు లయిన విలాసంపుఁగ్రేఁగంటి చూపుమాలి కల గోలుకులతో నన్నుఁ గట్టి వైచెను. నృత్య మాడి లేచినదై అక్రాల్గంటి సిద్ధి ప్రాప్తిని సాధించుటయో, ఎమ్మెయో, కోరికయో, ఇది కారణంబు అని నేనెఱుంగఁగాని చెలుల నుంగూడ కనుమొఱఁగి విలాసముతో బొమతీవ నిక్కించి క్రేఁగంటిచూపుతోఁ సారెకు నన్ను గాంచి అలంతిగా పలువెన్నెల వెలి కొలయు ఎల నవ్వి, లోకుల కన్ను డెంద ములం దోఁకొని యింటికి తరలెను. అట్లయినట్టి నేను నాయింటికిం జని తాళరాని విరాళిం బడి బువ్వపై యాసను దవ్వుసేసి తలయేరు సోఁక నని వట్టి మిషపెట్టి ఏకతపు సెజ్జపై యంగంబుల వైచి పరుంటిని. మదనతంత్రంబులందు నెప్పరులలో నెప్పరి ధనమిత్రుఁడు నాకడ కేతెంచి రహస్యముగా నిట్లు మందలించెను.

సఖుఁడా, ధన్యురాలు సుమా యాభోగముపిల్ల, ఈతీరున నీమనస్సు దానిపై తగుల్కొనుటం జేసి. దాని భావంపుఁ దీరును కూడ నేను సరిగా కనిపట్టితిని. దానిని కూడ సూనాస్త్రుఁడు త్వరలో నే తనయంపసెజ్జపై పరుండఁ బెట్టును. తగినచోట మనస్సును నాటిన మీయిరువురకును కూటమి ప్రయత్నమునకు అశక్యము కాదు. అయినను ఆవారకన్య గణికాధర్మమునకు ఎదురుతిరిగి మంగళ మయిన గొప్పమనస్సుతో పల్కినది: 'నాకు ఉండవల గుణము గాని ధనము గాదు; మఱి పెండ్లిచేఁ గాక యొండువగ నా జవ్వనము భోగ్యము గాదు.' అని. ఈపట్టుదల మాను మని దానియక్క కామమంజరియు తల్లి మాధవసేనయు ఎంతయు బోధించి తమమాట చెల్లనంత రాజుతో కన్నీళ్లతోడి గొంతులతో విన్నవించుకొనిరి. 'దేవా, మీదాసి రాగమంజరి రూపానురూప మయిన శీల శిల్ప కౌశలముచేఁ శోభిల్లుచున్నట్టిది మాకోరికలం దీరుచు నని మేము పేరాసతో నుంటిమి. ఇప్పు డయ్యాసవేరుతో తెగిపోయినది. ఏల యనఁగా నీబాల ఇప్పుడు స్వకులధర్మమును ఉల్లంఘించి ధనముమీఁద ఆస మాని గుణములకే తనయెల్లప్రాయమును అమ్మనున్నది. కులస్త్రీ నడవడిని ఆచరింపఁ గోరియున్నది. ఈస్థితిలో, ఇది ఏలిన వారిపాదముల యాజ్ఞచేత నయిన తెలివి దెచ్చుకొనునేని మే లగును.' అని. వారిమాటబడి రాజు బోధించినను అది మెత్తఁ బడక యుండఁగా, దాని యక్కయు తల్లియు ఏడ్చుచు రాజును గట్టిగా బతిమాలుకొనిరి: 'ఎవ్వఁడేని బొజుంగు మాయిచ్చ లేక ఈబాలను వలపించి నాశము

సేయు నేని వానికి దొంగకు చేయుదండన చేయవలయును.' అని. కావున, ఈస్థితిలో ధనమువలన గాక దాని స్వజనము ఒప్పుకొనదు, మఱి ధన మిచ్చువానిని అది అంగీకరింపదు. ఇందులకు ఉపాయ మరయవలయును.

అంతట నే నంటిని 'ఇందు ఆలోచన యేల? గుణముచే దానిని వశీకరించి, ధనములచే దానిస్వజనమును రహస్యముగా తనియించెదను.' అని. పిమ్మట కామమంజరియొక్క ముఖ్యమాతికి ధర్మరక్షిత యను బౌద్ధపరివ్రాజికను వస్త్రఖండాన్నాదిదానముచే వశీకరించి దానిగూడ ఆ బంధకితో ఒడంబడిక కావించితిని. 'ఆ తోలురత్నమును ఉదారకుని వలననుండి దొంగిలించి నీకు నే నిచ్చెదను, అందులకు బదులు నాకు రాగమంజరిని నీవు ఇచ్చెద వేని.' అని యందులకు ఒడంబడఁగా నేను ఆపనిని అట్లే సమకూర్చి నాగుణములచే వేఁదుఱుగొనియున్న రాగమంజరి కైతలిరుం గైకొంటిని. ఏరాత్రి చర్మరత్న చౌర్యమును గూర్చి వచించి యుంటినో ఆరాత్రి తొలిభాగమున నావేగు విమర్దకుఁడు అర్థపతిపక్షమువాఁడుగా వచ్చి ధనమిత్త్రుని మాటలు మిగిలి తద్దయు బెదరించెను. ధనమిత్త్రుఁడు అడిగెను:—'భద్రా, నీ కేమి ప్రయోజనము పరునికై నన్ను తిట్టుటవలన? అణుమాత్ర మయినను నీకు నేఁ జేసినయపకార మేమియు నాకు తోఁచకున్నది.' అని. వాఁడు వెండియు బెదరించుచుంబలె ననియె: "ఇదే ధనమద మనఁగా: మఱియొకని భార్యను, ఉంకువ యిచ్చి విలుముకొన్నదానిని, మగల తల్లిదండ్రులను ధనముచేత బెల్లించి నీదానను చేసికొనం గోరియున్నావు. 'నీ కేమి అపకారము చేసితిని?' అని యడిగెదవు. ఇ దేమి ప్రసిద్ధము కాదా సార్థవాహునికి అర్థపతికి విమర్దకుఁడు బయటిప్రాణ మని? నేను అతనికో సము ప్రాణములనైన ఇచ్చెదను. బ్రహ్మహత్యకైన వెను దివియను. నీ యీ చర్మరత్నాహంకారతాపజ్వరము నా యొక్క రాత్రి మేలుకువచే కుదురునట్టిది సుమా." అని. అట్లు పలుకుచు వాఁడు ఊరిపెద్దలు కోపపడి మాన్పించి పంపివేయఁగా పోయెను. ఈవృత్తాంతమును బొల్లిదుఃఖముతో ధనమిత్త్రుఁడు చర్మరత్నంపుఁబోకడ మొదలుగా రాజునకు నివేదించెను. రాజు అర్థపతిని రావించి రహస్యముగా 'ఓయి, నీకడ విమర్దకుఁ డని ఎవఁడేని కలఁడా?' అని యడిగెను. ఆ మూఢబుద్ధి 'దేవా, ఉన్నాఁడు. నాకు తద్దయు మిత్త్రుఁడు, వానితో పని యేమి?' అనెను. 'వానిని రప్పింప నేర్తువా?' అని రాజడిగెను. 'తప్పక రప్పింప నేర్తును.' అని వెడలి తనయింటను భోగపువీథిలోను జూదపుటింటను, బజారులోను, చక్కఁగా వెదకియు, కనిపట్ట నేరఁ డాయెను. ఆ వీరాపుఁడు ఎట్లు దొరకును? నేను ఆవిమర్దకుని నిన్నానవాలు పట్టుటకు గుర్తులునేర్పి నిన్ను వెదకుమని ఆపగలె ఉజ్జయినికి పయనముతరలించితిని. అర్థపతియు వానిం గానక వాఁడు చేసిన

నేరమి యేమో అది తనదే అని భావించి తెలివి చాలకయో భయపడియో విపరీతములు పల్కె. ఆపై రాజు కోపించి ధనమిత్రుని ప్రోత్సాహంబున అతనిని సంకెలల వైచెను.

ఆదినములలోనే కల్పోక్త విధానంబున చర్మరత్నమును పిడుకఁగోరి కామమంజరి, ముందు తాను పిడికిన విరూపకుని కృపణుఁ డయిన వానిని రహస్యముగా ఉపసర్పించి, మున్ను అతనివలన తా నపహరించిన ధన మెల్ల నతనికి మరల ఇచ్చి, మిక్కిలి వినయముతో ఊఱడించిపోయెను. అతఁడును ఎట్టకేలకు కృపణకమతమునుండి తప్పించుకొని నా బోధన విని ఎంతయు సంతసించి స్వధర్మమునే మరల నవలంబించెను. కామమంజరియు కొలఁది దినములలో ప్రాయ్యమిగతగా తన విభవము నెల్ల మేలితోలుసంచిం బిడుకు నాస చేత ఇచ్చివైచెను. అంతట నాప్రేరణచేత ధనమిత్రుఁడు రాజుతో రహస్యముగా చెప్పకొనెను: 'దేవా, ఇదిగో ఉన్నదే కామమంజరి యను బోగముది మేరమీఱిన పిసినితనము చేత లోభమంజరి యని లోకులచేత తిట్టుపడుచున్న యట్టిది, అది యిప్పుడు రోలును రోకలియుఁ గూడ సర్వము లక్ష్యము లేకుండ ఇచ్చుచున్నది; అందులకు నాచర్మరత్నము దొరకుట కారణ మని తలంచుచున్నాను; దానికల్పము అట్టిది గదా; వర్తకులకును వార ముఖ్యులకును పిడుకును, తదితరులకు పిడుకదు, అని గదా దానింగూర్చిన ప్రఖ్యాతి. కావున దానియందు నాకు సందేహ మున్నది.' అని. రాజు వెంటనే దానిని తల్లితోఁగూడ రమ్మని పిలుపు పంపెను. అంతట నేను వెతఁజెందినట్లును వెలవెలఁబోయినట్లును నటించుచు రహస్యమున చెప్పితిని: 'ఆర్యా నిశ్చయముగా అతిప్రకట మయిన సర్వధనత్యాగముచేత చర్మరత్నము నీకు దొరకిన దని శంకింపఁదగియున్నది. దానిని గూర్చి ప్రశ్నించుటకు అంగరాజు నిన్ను పిలిపించుచున్నాఁడు. నిన్ను మఱియు మఱియు ఇబ్బంది పెట్టఁగా తప్పకుండ నీవు నేనిచ్చినట్లు చెప్పుదువు. అంతట నాకు చిత్రవధ యగును. నేను చచ్చిన నీచెల్లెలు బ్రదుకదు. నీవు నిర్ధనురాల వైతివి. చర్మరత్నము మరల ధనమిత్రుని చెందును. ఇట్లు ఈ యిడుము అంతటను అనర్థపరంపరం దెచ్చుచున్నది. కావున ఇందులకు ఏమి ప్రతీకారము సేయ దగును?' అని. అదియు దానితల్లియు కన్నీళ్లు విడిచి పలికిరి: 'ఇది వాస్తవమే, మా తెలివితేమిచేత రహస్యము బయటఁబడి నష్టయినది. రాజు నిర్బంధింపఁ జొచ్చినప్పుడు రెండు మూఁడు మాఱులు దాఁచియు చివరకు విధిలేక నీవే దొంగిలించి తెచ్చితి వని చెప్ప వలసియే వచ్చును. నిన్ను చెప్పితిమేని మాకుటుంబమెల్ల వినాశ మొందును. మఱి ఆయపకీర్తి అర్థపతిమీఁదికి వచ్చియున్నది. ఆపిసినివానికి మాతోడి తగులము ఈయంగపురమున వెల్లడియై యున్నది. అతఁడు దానిని మా కిచ్చినాఁడని చెప్పి మనలను కాచుకొనుట మేలు.' ఇట్లు నన్ను సమాధానపఱచి వా రిరువురును దివాణమునకుం బోయిరి. రాజు

ప్రశ్న చేసెను: 'భోగముజాతికి ఇది న్యాయము గాదు, ఏ దనఁగా,ఇచ్చినవానిని దాఁచుట. న్యాయార్జిత విత్తములతో మాత్రమే పురుషులు వేశ్యలం గూడుదు రని నియమము లేదు గదా'. అని. ఇట్లు పలుమాఱు గ్రుచ్చిగ్రుచ్చి యడిగి ముక్కు చెవులు తఱిగించెద మని బెదరింపఁగా పాడుముండలు ఆదీయని అర్థపతినే దొంగనుగా బయటఁబెట్టిరి. రాజు కోపగించి అతనికి మరణశిక్ష విధింపనుండఁగా ధనమిత్రుఁడే కేలుమోడ్చి నివారించెను: 'అయ్యా, వర్తకులకు మౌర్యుఁ డిచ్చిన వరము ఉన్నది, ఇట్టియపరాధములయందు ప్రాణమును హరింపఁ గూడ దని, కోపగించితి వేని ఈపాపిని సర్వధనమును హరించి వెడలఁగొట్టఁ దగును.' అని. ఆకారణంబున ధనమిత్రుని కీర్తి వర్ధిల్లినది. రాజు సంతోషించెను. ధనమదము పట్టి యున్న యర్థపతిని ఇపుడు పాఁతగుడ్డతుండుతో ఎల్లపౌరుల యెదుట వెడలఁగొట్టిరి. మేలితోలుసంచి యెండమావులను నమ్ముకొని సర్వధనమును పాఱవైచిన యాదీనురాలికి కామమంజరికి అతని ధనములలో ఒక యించుక ధనమిత్రుని ప్రేరణచేత రాజు అనుగ్రహించెను. ధనమిత్రుఁడును శుభదినమందు కులపాలికను వివాహ మాడెను. ఇట్లు నేను నాపూనికను నెఱవేర్చుకొని రాగమంజరియింటిని బంగారముతోను రత్నాలతోను నిండించితిని:

ఈయూర లోభులగు ధనవంతులును నేను ఊఁచముట్టుగా దోఁచుకు, వారిపుడు తమ ధనములనే నేను ఇచ్చి ధనికులను గావించిన యాచకుల యిండ్లకడ పెంకు చేతఁ గొని బిచ్చమునకై తిరుగుచున్నారు. అయినను ఎంత నిపుణుఁ డయినను మనుష్యుఁడు దైవము వ్రాసినంతలో ఒక గీఱ నయినను దాఁటనేరఁడు గదా. అది ఎట్లనఁగా, ఒకనాఁడు నేను రాగమంజరిని పొలయలుక తీర్చుటకై బతిమాలి త్రాగించి, అది అతిప్రసన్నయై తన నోటితో నా నోట నిడినపుక్కిటి సారాయిని క్రోలి క్రోలి మత్తుగొంటిని. కైపెక్కిన వానికిని వెఱ్ఱివానికిని తప్పుదారిలో నయినను అలవాటుపడినపనులయందే ప్రవర్తించుట స్వభావము గదా. అట్లే నేను మత్తెక్కి 'ఈ పట్టణమును ఈ యొక్కరాత్రిలోనే నిర్ధనముం గావించి నీయిల్లు నిండించెదను.' అని ప్రియతమతో నుడివినవాఁడనై, అది మిక్కిలి దిగులొంది వల దని బతిమాలుకొనుచు చేతులు జోడించుకొని మ్రొక్కుచు నూఱు ఒట్లు పెట్టినను సరకుసేయక, చఱాలున గొలుసు త్రెంపుకొన్న మదపుటేనుంగు వోలె, అతివేగమున, ఎక్కువ సాధనములు కొనక కత్తి మాత్రమే తోడుగా తరలితిని. శృంగాలిక యను దాది యొకతె నావెంటఁ బడి వచ్చుచుండెను. నేను ఎదురుపడిన గస్తీల తుక్కిడీలలో జంకు లేక దూఱి, వారు దొంగ యని కొట్టుచున్నను ఎక్కువగా కోపింపక ఆడుట యుంబోలె కైపుచేత వాలిపోవుచున్న చేతిలోని కత్తితో ఇద్దఱుముగ్గురనే వ్రేసి సుడి

వడుచున్న యొజ్జనికనులతోఁ గ్రిందఁ బడితిని. అంతట కరుణముగా మొఱయిడుచు సృగాలిక నాకడకు వచ్చెను. నన్ను పగతురు కట్టివైచిరి. అయ్యాపద నాకైవును హరించి తత్క్షణమే తెలివిగొలుపఁగా తటాలున కలిగిన ప్రతిభచేత తలపోసితిని;—'ఓహో! తెలివి మాలి ఎంతగొప్ప యాపద తెచ్చుకొంటిని? ధనమిత్త్రుఁడు సఖుఁ డనియు, రాగమంజరిభార్య యనియు మిక్కిలి ప్రసిద్ధము; నాదోషంబునం జేసి దుఃఖితుల నాయిరువురను కూడ తప్పకుండ దండింతురు. కావున ఇందులకు ఇది యుపాయము. దీనిని ప్రయోగించుటచే నాపనుపున ఆయిరువురును రక్షితు లగుదురు, నన్నును ఒకవేళ ఈ యాపదనుండి రక్షింతురు.' అని ఏదో ఒక యుపాయము మనస్సులో నిశ్చయించుకొని సృగాలికను అంటిని: 'పోవే పో ముసలిముండా, నీవు ధనలుబ్ధను ఆపాడు లంజెను రాగమంజరిని మేలితోలుసంచిచే మఱంచి నాకు మిత్త్రునివలె నటించుచున్న నాశత్రు వయిన యాధనమిత్త్రునితోఁ గూర్చితివి; చెడితివి లే. ఆమహాత్ముని చర్మరత్నమును దొంగిలించియు నీకూఁతు మేలినగలను హరించియు పగతీర్చుకొంటిని. కనుక ఇప్పుడు ప్రాణమును హాయిగా వదలెదను.!' అని. కడుగడుసుది అదియు నా యెత్తుకడను కనిపట్టి కన్నీళ్లతోఁ దటిసి గద్గదస్వరముతో మోమువ్రేలెత్తి ఆపురుషులను మ్రొక్కి నాయెదుర బతిమాలుకొనెను: 'అయ్యలారా, ఇంచుకసేపు వేచి యుండుఁడు, ఇంతలో నేను వీఁడు దొంగిలించిన మాధన మెల్ల తెలిసికొనియెదను.' అని. సరియే యని వారు అంగీకరింపఁగా, పండియు నాకడకు వచ్చి, 'ఓయి మంచివాఁడా, ఈదాసీజనమునెడల ఒక్క తప్పును మన్నింపుము. నీ పెండ్లామును తాఁకిన యాధనమిత్త్రునిమీఁద నీ యిచ్ఛవచ్చినట్లు పగ సాధించుకొనుము; కాని చిరకాలము నీకు చేసిన సేవను జ్ఞప్తిచేసికొని నీ దాసిని రాగమంజరిని మన్నించి యనుగ్రహింపుము. రూపముచే జీవించు భోగముదాని సారము నగలలోనే గదా ఉన్నది. కావున చెప్పు, దాని భూషణములను ఎక్కడ పెట్టితివి?' అని నా పాదములలో వ్రాలెను. అంతట నేను జాలిగొనినయట్లులు నటించుచు 'కానీ' మృత్యువు చేతిలో నున్న నాకు దానితో పగసాధించుటవలన నేమి ప్రయోజనము?' అని పలికి, ఆదాఁచినచోటు చెప్పుటయుం బోలె చెవిలో దానికి ఇట్లు ఇట్లు చేయవలసినది అని కఱపితిని. అదియు పన్నుగడ గ్రహించి 'చాల కాలము బ్రదుకుము, నిన్ను దేవతలు అనుగ్రహింతురు గాక, ఏలినవాఁడు అంగరాజు కూడ పౌరుషమునకు మెచ్చుకొని నిన్ను విడుదలచేయును గాక. ఈ సౌమ్యవదనులు కూడ నీయందు దయ పూనుదురు గాక.' అని క్షణములో వెడలిపోయెను. నన్ను గస్తులు కొత్వాలు సాకతిచే చెఱసాలకుం గొనిపోయిరి.

అమలు వాఁడు కడుగర్వి తాను అందగాఁ డని తలఁచుకొన్నవాఁడు తండ్రి మృతి చెందఁగా నూతనముగా అధికారమునకు వచ్చినవాఁడు యౌవనమదముచేత అంతగా మెత్తపడనివాఁడు కాంతకుఁ డను నాగరికుఁడు కొంచెకొంచెముగా బెదరించి నన్ననియె: 'ధనమిత్రుని తోలురత్నమును ఇయ్యవేని, ఊరివారినుండి దొంగిలించిన ధనమును వారికి ఇచ్చివేయవేనియు, పదునెనిమిది నరకబాధలను కడపట మృత్యుముఖమునుం జూచెదవు.' అని. నేను చిఱునవ్వు నవ్వుచు పలికితిని: 'సౌమ్యుఁడా నాపుట్టువుం దొట్టి దొంగిలించిన ధనమునెల్ల ఇచ్చినను ఇత్తునుగాని, అర్థపతిభార్యను హరించి నాకు మిత్రుఁడుగా నటించుచున్న ధనమిత్రుని తోలురత్నపుటడియాసను మాత్రము తీర్పను. దానిని ఈయనందులకు పదివేల యాతనల నైనను అనుభవించెదను. ఇది నాదృఢప్రతిజ్ఞ.' అని. ఈ తీరున ప్రతిదినము బలిమాలుటయు బెదరించుటయుఁ గా విచారణ జరుగుచుండుటం బట్టి అనుకూల మయిన యన్నపానములు దొరకుటచేత కొలఁదిదినములలో గాయములు కుదిరి నేను స్వస్థపడితిని.

తర్వాత నొకప్పుడు కరివేల్పువలువవలె పసిమిమిసిమిం జెంది పగటివేళ మఱిఁగి పోవుచుండగా, మోమున సంతోషంపు వికాసము గలిగి శృగాలికప్రకాశమాన మయిన వేషముతోవచ్చి అనుచరులను దవ్వున నిలిపి నన్నుకదిసి వచించెను:— అయ్యా, నీయదృష్టము మంచిది. నీ నీతిప్రయోగము నెఱవేఱినది. నీవు బోధించినట్లే ధనమిత్రునికి తెలిపితిని. "అయ్యా, నీచెలికాఁడు ఇట్లు ఆపదలో నున్నాఁడు; నీకు ఇట్లు పనుపువెట్టుచున్నాఁడు.— నేను ఇపుడు వేశ్యాసాంగత్యప్రసిద్ధ మయిన పానదోషముచేత చెఱం బడితిని. మఱి నీవు నిస్సంశయముగా ఇప్పుడే రాజునకు మనవిచేసికోవలయును: 'దేవా ఏలినవారి కరుణచేతనే మునుపును ఆతోలురత్నము అర్థపతి దొంగిలించినది నాకు మరల దొరికినది. మఱి యిపుడు రాగమంజరిమగఁడు ఒకానొక జూదరి కళలయందును కవనము లందును లోకవృత్తాంతములందును అతినిపుణుఁడు నాకు సంగడీఁ డయినాఁడు. వాని సంగాతము మూలమున వలువలుం దొడవులుం బంపుట లోనగు విధముల వాని పెండ్లాము ప్రతిదినమును నేను అనువర్తించుచుంటిని. నీచబుద్ధి యయిన యీజూదగాఁడు అందు శంక వహించి యలిగి నాచర్మరత్నమును దాని నగలచందుగను దొంగిలించినాఁడు. ప్రభూ, వానిని ఊరు దొంగలింపం దిరుగుచుండఁగా, కావలివాండ్రు పట్టుకొన్నారు. ఇట్లు ఆపదం బడినవాఁడై వాఁడు రాగమంజరి పరిచారిక ఏడ్చుచుం గూడఁ బోయి యడుగఁగా మునుపటిప్రేమను బట్టి దానినగలపెట్టెను పాఁతిపెట్టినతావును చెప్పినాఁడు.

మెలపున వశీకరించినయెడల నా చర్మరత్నమును గూడ ఇచ్చెదిని. ఈవిషయమున ఏలిన వారు అనుగ్రహము కావింపవలయును.' అని, అట్లు విన్నపించినచో రాజు నాకు ప్రాణ హరణము మాని మంచిమాటలచేత నే 'నీసొత్తును నీ కిప్పించుటకు యత్నించును. అది మనకు అనుకూలము.' అని.'' దీనిని విన్న వెంటనే ఆ నీచెలికాఁడు నీప్రభావమందుఁ గల నమ్మకముచేత భయపడక ఆపని యట్లే చేసినాఁడు.

మఱి నేను నీవు చెప్పిన గుఱుతులచే రాగమంజరిని ఒప్పించి దానివలననుండి కావలసినవస్తువులను కొనిపోయి నీవు చెప్పినవిధమున రాజకొమారిత యంబాలిక యొక్క దాదిని మాంగలికను అనురంజించితిని. దాని వలననే రాగమంజరికిని అంబాలికకును మంచిచెలిమిని బలపఱిచితిని. ప్రతిదినము క్రొత్తక్రొత్తకానుకలు సమర్పించుచు మనోహరము లయిన చిత్రకథలు చెప్పుచు ఆమెకు ఎక్కువ యనుగ్రహమునకు పాత్రము నైతిని. ఒకప్పుడు మేడమీఁద ముంగిట నామె యుండగా చెవికలువను సరిగా చోట నున్నట్టి దానినే జాఱిన దని ఎప్పటియట్ల చక్కఁగా నిడుచు, పొరఁబాటునం బోలె జాఱించి మరల నేలనుండి ఎత్తి దానితో ఏదో కారణంబున కన్యాంతఃపురము చెంగటి యింటి ముంగిటికి వచ్చిన కాంతకుని వానిమీఁద రంధ్రిములో నున్న పావురమును బెదరఁ గొట్టెడు మిషంబున నవ్వుచుం గొట్టితిని. ధన్యుఁడ నైతి నని తలంచుకొని ఎదుర కొంచెము మొగ మెత్తి నవ్వుచున్నట్టి యాకాంతకుఁడు నాచేసినపనికి నవ్వువచ్చి నవ్వుచున్న రాజకన్యయొక్క విలాసము మెఱసిన చేష్టను తనమీఁది యభిలాషచేతఁ గలిగిన దానినిగా ఎట్లు తలంచునో, అట్లు నేనును చతురముగా సన్నచేత నే కొంచెము చేష్టించితిని. అంత నామహామూఢుని మనోభవుఁడు చెవిదాఁక వింటిని తెగ దివిచి విసముపూసిన ములికితోడి యలుఁగుతో నేయఁగా వాఁడు గాయపడి ఎట్లో అటనుండి యవలికి జరిగెను. సాయంకాలమున రాజకన్య రాగమంజరికోస మని వాసనవీడెమును పట్టువలువలజోడును నగలతోడి పేపసజ్జను తనముద్దుటుంగరముతో సికా వేసి యీయఁగా కొనిపోయి, ఒకపిల్లచేత పట్టించుకొని కాంతకుని యింటి కేఁగితిని. నేల యందని రాగసాగరములో మునిఁగియున్న యాకాంతకుఁడు ఓడనుంబోలె నన్నుం బడసి ఎంతయు సంతసించెను. తననిమిత్తమై రాజకన్యకుం గలిగిన బెడిదంపు మదనావస్థలను నేను ఏపరువు పెట్టి ఆదుర్దలికి వేత్తి ముదిరించితిని. వానిప్రార్థన చొప్పున ఆమఱునాఁడు నేను నావే నములినతమ్ములమును మిగిలిన మైపూఁతను ప్రాఁచిపూదండలను మఱులవలిపమును కొనిపోయి 'ఇవి నీకు నీప్రియ పంపినవి' అని వానికి కానుక యిచ్చితిని, అట్టివే వానివి రాజకన్యకొఱకని తెచ్చి చాటున పాఱవైచితిని.

ఈ తీరున వానికి మదనాగ్నిని రగులఁగొల్పి ఏకాంతంబున గుసగుసలుగా బోధించితిని : —"అబ్బాయీ, నీలక్షణములు తప్పనివి. అట్లే నాపొరుగింటివాఁడు ఒక సాముద్రికుఁడు 'రాజ్యము కాంతయును చేతిలోనికి వచ్చును. అతని లక్షణములు అట్టివి. అని చెప్పినాఁడు.' అందుల కనుగుణముగానే రాజకన్య నిన్ను కామించియున్నది. రాజునకు ఆమె యొక్కతెయే బిడ్డ గావున ఆమెతోడి నీకూటమిని ఎఱిఁగి కోపగించినను అతఁడు కొమారిత చచ్చిపోవు నను భయముచేత నిన్ను తల దివియఁడు, సరియే గదా పయిగా నీకు యౌవరాజ్యము నొసంగును. ఇట్లు ఈప్రయోజనము ప్రయోజనాంతరము గల్గుకొనుచున్నది. బాబూ, ఏల దీనిని సాధింపవు? కన్యాంతఃపురప్రవేశమునకు ఉపాయ మొకటింగ నేని, చెప్పెదను విను. చెఱసాలగోడకును తోఁటప్రాకారమునకును మూఁడు బారల యెడము. మంచిచేతివాటము గలిగిన కన్నగానిచేత ఆపాటిసొరంగము త్రవ్వించి తోఁటలో నీవు చొచ్చినయెడల తర్వాత నీరక్షణ మాచేతిలోనిదే. ఆమెయందు పరిజనము అంత్యంతానురక్తము, రహస్యమును వెలిఁ బుచ్చదు." అని.

వాఁ డనియె : 'మంచిదానా, బాగుగానే చెప్పితివి. ఉన్నాఁడు ఒకదొంగ, వాఁడు త్రవ్వుపనిలో సగరసుతులలో నొకఁడు గావలయు, వాఁడు గనుక దొరకెనా, క్షణములో ఈపనిని సాధించును.' అని. 'ఎవఁడు వాఁడు? ఏల దొరకఁడు?' అని నే నడుగఁగా, 'ధనమిత్త్రుని చర్మరత్నమును దొంగిలించినవాఁడే వాఁడు' అని నన్నే నిర్దేశించెను. "అట్లే అయినయెడల, నీవు వానితో 'ఓయి, నీవు ఈపనిని సాధించిన పిమ్మట, చిత్రములగు నుపాయములచేత నిన్ను నేను విడిపించెదను.' అని ఒట్టుపెట్టుకొని ఒడంబడిక చేసికొని, కార్యము నెఱవేఱిన పిమ్మట వెండియు సంకెలలు వైచి, రాజునకు 'ప్రభూ, ఆ దొంగ కనుగడుసువాఁడు, బల మయిన పగగలవాఁడు, ఎన్నివిధముల లోఁగొనయత్నించినను ఆతోలురత్నమును చూపఁడు.' అని విన్నపించి వానిని చిత్రవధ చేయింతువు గాక. అందువలన కార్యము సిద్ధించును, రహస్యమును బయటికి జాఱదు." అని నేను పలుకఁగా, వాఁడు మిక్కిలి సంతోషించి, నిన్ను బెల్లించుటకై నన్నే పనిచి, తాను బయట నున్నాఁడు. ఇప్పటికి తగినయాలోచన యిఁకను చేయుము.

నేను ప్రీతుఁడ నై పలికితిని, 'నేను చెప్పినది ఇంచుక, నీ నీతియే ఇందు గొప్పది. తెమ్ము వానిని.' అని. అంతట వాఁడు వచ్చి నన్ను విడిపించుటకును, నేను రహస్యమును బయట చెప్పకుండుటకును ఒట్టులు పెట్టుకొన్నారము. సంకెలలు తీసివేయఁగా నేను స్నానమాడి భుజించి మైపూఁత యలంది శాశ్వతముగా ఇరులు క్రమ్మియున్నట్టి చెఱసాలగోడ మూలనుండి గుద్దలితో సొరంగము త్రవ్వితిని. 'నన్ను చంప నిశ్చయించుకొనియే గదా వీఁడు

విడిపించెద నని ప్రతిజ్ఞ చేసినాఁడు. కావున వీనిని చంపిన నాకు అసత్యవాదదోషము తగులదు.' అని తలపోసితిని. నేను సొరంగమునుండి వెలువడుచుండఁగా నాకాళ్లకు సంకెల తగిలించుటకు వాఁడు చేయి చాఁపఁగా, కాలితో ఱొమ్మున దన్ని, క్రిందపడఁద్రోసి వానికత్తితోనే వాని తలను తుండించితిని. శృగాలికను అడిగితిని 'భద్రా, చెప్పుము, కన్యాంతఃపురసన్నివేశంపు వివరము చెప్పుము. ఇంత ప్రయాస వ్యర్థ మేల గావలయు? ఇటనేమేని ముచ్చిలి తలంగెదను.' అని. దానివలన సన్నివేశవిభాగమును తెలిసికొని కన్యాంతఃపురమును చొరఁబడి, రత్నదీపములు వెలుంగుచుండఁగా, బహుకేళీశ్రమచే గాఢనిద్రంబడియున్న పరిజనమునకును, వెలలేని రత్నములు పొదిగిన సింగపుఱూపుదంతపుఁగోళ్లును, హంసతూలికాగర్భములును మృదువులును అయినట్టివి సెజ్జయు దిండ్లును, గలదై, ఓరలందుఁ బూరేకలు రాల్చియున్న మంచముపై, కుడికాలిమడమ యడుగుభాగము వెంట నంటియున్న యెడమమీఁగాలి తుదయు, ఇంచుక యెడపడిన యందంపుఁ జీలమండలును, ఒండొంటిం బెనఁచికొన్న జంఘాకాండములును, ఇంచుక కొంచించిన మోఁకాళ్లును, కొంచెము ముణిఁచిన యూరుదండములును, పిఱుందుపైఁ బడవైచిన యొక్క భుజలతాగ్రమును, తలగడకడ కొంచెము కొంచించియుంచిన రెండవ బాహువల్లితుదను వెలకిలియున్న యఱచేయిచివురును, నిండు పంపయిన గుండ్రని పిఱుందును, మిక్కిలి యంటికొన్న చీనాంబరంపు జీబును, ఎక్కువ వంగని కడుసైకపుఁగడుపును, మిగుల సన్నమయిన యూర్పుల యారంభమునం గంపిల్లు బిగిసెంపు జనుమొగ్గలును, పరుండుట నించుక వంపుగా నున్న మెడకడ నగపడుచు పుటములు దీరిన కుందనపుటడ్డిగలో ఒడ్డిగిలియున్న కెంపులపదకమును, క్రింది కర్ణపాశమునుండి సగము గానిపించుచున్న కమ్మయు, పైవైపు వెలకిలిన ట్లున్న కర్ణపాశంపుఁ బంజాలకమ్మ కిరణముల గుత్తులచేత పసిమిమిసిమి నొంది విషమముగా ముడువఁబడిన సడలని క్రొమ్ముడియు, తన జిగిమొత్తముచే మూఁతఁబడి యగపడకున్న పాటలోత్తరోష్ఠపుటమును, చెక్కిట హత్తించినచేచివురు నెఱవేర్చుచున్న కర్ణావతంసకృత్యమును, మీఁది చెక్కుటద్దమందు ప్రతిఫలించిన చిత్తరుమేలు కట్టుయొక్క పత్త్రిజాతులచేత నివ్వటిల్లినతిలకాదిక్రియయు, మూఁతఁబడిన నల్లని కనుగలువలును, చలింపని బొమబెక్కములును, క్రొంజెమరును పులకలును పొటమరించుటం జేసి పెటిలి సల్లిన గందపుబొట్టును, మోముజాబిల్లికి ఎదురయినముంగురుఁ దీఁగలును, గలదై నిశ్శంకముగా నిద్రించుచు, పానుపుమీఁది తెల్లదుప్పటిలో మునింగినట్లుబలె ఒత్తగిల్లి పరున్నందున తడవు మెఱసిన యాలసటచే చలనమేది శరన్మేఘమునొడిలో శయనించిన క్రొమ్మించువోలె జ్వలించుచున్న రాజకన్యను కాంచితిని. కాంచినంతనే మదన

రాగంబు తెరలెత్త జడుపొంది నా మ్రుచ్చిలు నాసపోఁగా ఆకలికియే నాహృదయము మ్రుచ్చిలఁగా, ఏమి సేయనుం దోఁపక, నిముసము మిన్నకుండి తలపోసితిని: — 'ఈవామలోచనను పొందనయేని ఆమనినేస్తకాఁడు నన్ను బ్రదుకనీఁడు. ముందు హెచ్చరిక లేనందున తాఁకినయెడల అతిబాల ఈమనోహారిణి వెఱచి యఱచి నిక్కముగా నాకోరికను భంగపఱుచును, అందువలన నేనే హతుఁడ నగుదును.' అని. కావున ఇందుల కిది యోజన, అని చిలుకకొయ్యకు తగిలించిన పలకను బంకయిసుకపసరుఁముద్దతో గట్టించిన దానిని కైకొని రత్నపుపందుగునుండి రంగులవత్తిని ఎత్తి, ఆతరుణిని అట్లే శయనించి యున్నట్లును, ఆబాలపాదమూలంబున చేతులు మోడ్చుకొని యున్నట్లు నన్నును, చిత్రించి, ఈకందముం గూడ నందుం బొందు పఱిచితిని.

క. లలనా, నిను నాబద్ధాం
జలి నై యీవరము దాసజనుఁ డితఁ డడుగున్,
వలజేనికలన నాతో
నలయిక నిద్రింపు, మొంటి గా వల దిటులన్.

జాలువా యడపనుండి వాసనవీడెమును కపురంపుఁదునియను పారిజాతకమును సేవించి లత్తుకవంటియెఱుపుగల యాతమ్ములంపురసముతో పాలగచ్చుగోడమీఁద జక్కవకవను ఉమిసితిని. ఉంగరములు మార్చుకొనియు ఎట్టకేలకు అటనుండి వెడలితిని. సొరంగముగుండ మరల చెఱసాలం జొచ్చి అందు బందియై యున్న కావలిమొనగానిని సింహఘోష నాముని ఆదినములందు నాతో చెలిమిం జెందినవానిని 'ఈవిధముగా ఆవరాకుఁడు కాంతకుఁడు నాచేత చచ్చినాఁడు. నీవు రహస్యము వెలిఁబుచ్చి విడుదలం బడయుము.' అని హెచ్చరించి సృగాలికతోఁ గూడ నిష్క్రమించితిని.

రాజమార్గమున ఆరెసుల మూఁకచే పట్టు వడిని, తలపోసితిని.—'వీరల చేయి తగులక యే వడి మెయిం బఱతేర నేర్తును; కాని పాపము దీనిని పట్టుకొందురు. కావున నిది యిప్పటికి తగినది.' అని వారిపొఁదికే జోగుచుం బోయి నావీఁపుమీఁద మోఁచేతులు పెట్టుకొని వెడమొగముగా నిలిచి 'నేను దొంగనేని అయ్యలారా, మీరు నన్ను కట్టుఁడు; మీ యధికార మిది, ఈముసలిదాని దేమో కాదు.' అని వచించితిని. అంత మాత్రాననే నాయభిప్రాయమును కనిపట్టినదై ఆముసలి వారిం దఱిసి దండ మిడి "మంగళముఖులారా, వీఁడు నాకొడుకు వాయుగ్రస్తుఁడు చిరకాలము వైద్యము చేయించితిని. నిన్న పగలు కుదిరినట్లు చక్కఁగా అయినాఁడు; అంత నేను నమ్మి ఈదినము బంధనమునుండి వెలువరించి జలమా

ర్చి మైపూఁత యలఁది, దోవతులజోడు తాల్పించి, పరమాన్నము భుజింపించి, శయనాసనములయందు ఇచ్చవచ్చినట్లుండం జేసితిని. అంతట నర్ధరాత్రంబున వెండియు వాయువశుఁడై 'కాంతకుని చంపి రాజకూఁతుతో క్రీడించెదను' అని అతివేగఁబున రాజవీథికి పఱతెంచినాఁడు. కొడుకు ఇట్లు అగుటం జూచి ఈవేళలో నేను వెంటఁ బఱతెంచుచున్నాను. కావున, నాయందు కరుణింపుఁడు; వీనిని కట్టి నాకు అప్పగింపుఁడు." ఇట్లు మొఱవెట్టి అది యేడ్చుచుండఁగా, నేను 'ఓసి ముసలీ, ఇంతకుముం దెవ్వఁడేని వాయుదేవుని కట్టియున్నాఁడా? ఈకావలా పాపము! జాలెడేగను నన్ను పట్టువారు?' అని పాఱుతెంచితిని. అంతట వారు నీకే వెఱ్ఱియెత్తినది, ఏల యున నీవు వెఱ్ఱిని వెఱ్ఱి కాఁడని వదలితివి; ఇప్పు డెవఁడు వానిని కట్టును?' అని నిందించి చీవాట్లు పెట్టఁగా, అది యేడ్చుచు నా వెంటఁ బరుగెత్తెను. రాగమంజరియింటికి పోయి తడవుగా నెడఁబాసిన యెడరుతోడి యాప్రియతమను నానావిధముల నూదార్చి ఆరాత్రిశేషమును గడపితిని. తెల్లవాఱఁగా మగల నుదారకుం గలసితిని.

పిమ్మట మరీచిభగవానుని వెలయాలియలజడినుండి లేచి మగల నొనర్చినతపముయొక్క ప్రభావమున మరల యోగదృష్టిం బొంది యున్నవానిని సమీపించి, ఆయనవలన నీదర్శనము ఈవిధముగా నగు నని తెలిసికొంటిని. సింహఘోషుఁడును కాంతకుని నేరమిని బయల్పఱిచి రాజానుగ్రహమువలన వాని యధికారముం బడసి ఆ చెఱసారంగముగుండ నే మరల కన్యాంతఃపురమునకు నాకు ప్రవేశముం గలిగించెను. ముందుగా శృగాలికాముఖముగా నొచ్చరికకై వార్త పంపి అనురక్తయు రాజకన్యను కలసికొంటిని. ఆదినములలోనే చండవర్మ తా నడిగినను తనకు కొమారితె నియ్యలేదని సింహవర్మమీఁద కోపించి దాడి వచ్చి పురమును ముట్టడించెను. పగతుఁడు బయటినుండి యూరిని పడఁగొట్టుటకు తలపెట్టఁగా దాని నోర్వక కోపంబు దీపింప నంగరాజు తానే కోటను భేదించుకొన్నవాఁడై సమీపించిన సహాయులను గూడ ఎదురుచూడక వెలువడి మూర్తనితో అధికబలునితో గొప్పపోరాటంబున ఆయువుపట్టులందు బిట్టుగాయపడి వైరిచేత బలిమిమెయిం బట్టువడెను. అంబాలికను బలిమిం బట్టికొని పెండ్లి యాడుటకై చండవర్మ తన బసకుం గొనిపోయెను. తెల్లవాఱఁగానే వివాహ మని యాతఁడు రాత్రియే పెండ్లికంకణముం గట్టుకొనెను. నేను ధనమిత్త్రునియింట అంబాలిక నే పెండ్లియాడుటకై మంగళకంకణమును కట్టుకొని ఆతనితో నంటిని:—'చెలికాఁడా, అంగనాథునికి బాసటగా రాజులసమూహము వచ్చి యున్నది. కడురహస్యముగా ఊరిపెద్దలం గూడఁ దోడుకొనిపోయి వారి

నిటను తెమ్ము. నీపని గావించి నీవు వచ్చునప్పటికి శత్రుని తలతెగిన మొండెముగాఁ గనుఁ గొందువు.' అని. ఆతఁడంపులకు కడంగఁగా ఉత్సాహకులం బయి పెండ్లికి వలయు నుపకరణములను సమకూర్చుచు ఇటునటు జనులు వచ్చుచుంబోవుచున్నట్టి యాగతాయునియింట కత్తిం గనఁబడనీక మంగళపాఠకులతోఁగూడఁ బ్రవేశించితిని. అగ్నిసాక్షికముగా పౌరోహితుఁడు యథావిధిగా కేల నిడుచున్న యంబాలికాహస్తపల్లవమును కైకొన నుంకించుచున్న యానీచుని నిడుపుఁబాటి బాహుదండమును బట్టి లాగి సురియతో బొమ్మునం గ్రుమ్మితిని. ఎదిర్చిన యితరులం గొందఱను గూడ యమపురమునకుం బంపితిని. మృతులును పలాయితులు నయిన యాయింటిలోపల తిరిగితిని. వడవడ వడఁకుచున్న చెడంగుబొమ్మను విశాలలోచనను ప్రియతమను సమ్ముఖమునం గని దాని కవుంగిటి సుఖముం బొందఁగోరి దానిం గొని గర్భగృహముం జొచ్చితిని. ఆక్షణమందే క్రొత్త వారిధరంపుటులుముంబోని నీగంభీరస్వరముచే ననుగృహీతుండ నయితిని.

ఇట్లని విని మందహాసితంబు గావించి రాజవాహనరాజు కూడ 'ఏమి! కార్కశ్యమున కర్ణీసుతునిం గూడ నతిక్రమించితివి!' అని వచించి, ఉపహారవర్మం గాంచి 'చెము, ఇప్పుడు నీవంతు.' అని పలికెను.

---

## తృతీయోచ్ఛ్వాసము.

## ఉపహారవర్మచరితము.

ఆతఁడును ఎల నవ్వి ప్రమొక్కి వక్కాణింపఁ దొడంగెను. నేనును దేశములు ద్రిమ్మరుచు ఒకప్పుడు విదేహదేశమునకుం జని మిథిలానగరముం బ్రవేశింపకయే ఒకానొక మఠమునకు విశ్రమార్థము పోయి, ఒకముసలితాపసివలన పాద్యము పొంది క్షణము సేవు నడవ చావడిలో కూర్చుంటిని. అంతట నన్నుఁ గాంచిన మాత్రాన ఆయవ్వ ఏలొకో ధారాధారగా కన్నీళ్లు విడువసాగెను. 'ఏమమ్మా యిది? కారణము చెప్పుము.' అని నే నడుగ, అవ్వ సకరుణముగా నిట్లు వచించెను.—ఆయుష్మంతుఁడా, వినియుందువు గదా ఈమిథిలకు ప్రహారవర్మ యని యేలిక యుండెనని. అతనికి మగధరాజు రాజహంసుఁడు నెచ్చెలి. వారి వల్లభలు వసుమతీప్రియంవదలు జలశంబరులకల్లభలవలె సాటిలేని మేటిచెలిమిం బాటించియుండిరి. అంతట తొలుచూలుఁ దాలిచి తమ లొందియున్న ప్రియసఖిని వసుమతిని

జూడఁ గోరి ప్రియంవద భర్తతోఁగూడ పుష్పపురమునకుం బోయెను. ఆసమయమందే మాళవునితో మగధరాజునకు మహాసంగ్రామ మాయెను. మైథిలేంద్రుఁడు మాళవేంద్రుని ప్రయత్నముచే జీవితుఁడై తనదేశమునకు నివర్తిల్లి, తనయన్న సంహారవర్మకొమరులు వికటవర్మప్రభృతులు తనరాష్ట్రమును ఆక్రమించినా రని విని, తన మేనల్లుఁ డయిన సుహ్మదేశరాజువలన కొంత దండుం దెచ్చుకొనఁగోరి, అడవిదారిం బట్టి, బోయలచేత సర్వధనమును కోలుపోయెను. నాచేత నున్న యాతని చిన్నకుమారునితో నేను ఒంటి చిక్కి కిరాతుల యొక్క యంపవానకు భయపడి పాఱిపోయి అడవిం జొచ్చితిని. అచట నన్ను పులి యొకటి పైఁబడి లోఁతుగా గోళ్లతో పట్టి పీఁకి పడఁద్రోయఁగా నాచేతినుండి పాఱిపోయి యాబాలుఁడు ఒక పుల్లావుపీనుఁగు ఱొమ్ములో దాఁగెను. ఆపీనుఁగును పీఁకఁ జొచ్చిన పులి యొక్క ప్రాణములను వింటినుండి వచ్చి తగిలిన బాణము క్షణములో నాకి వైచెను. బోయబాలకులు ఆబాలునిం గొనిపోయిరి. మూర్ఛపోయి ఒడ లెఱుంగక పడియున్న నన్ను గొల్ల యొకఁడు తనగుడిసెకుం గొనిపోయి దయచేత నా గాయములు మాన్పఁగా, స్వస్థురాలనై నేను నాదొరకడకు పోఁగోరి తోడు లేదని వ్యాకులపడుచుండఁగా, నాకొమారితయే ఒకానొక పడుచువానితోఁ గూడ,ఆచోటికి వచ్చినది. నన్నుఁగని అది పెల్లుగా నేడ్చి ఏడ్పు తీఱినంతట, అది సాతు దోఁపుడు పోయినప్పుడు తనచేత నున్న రాజపుత్త్రుఁడు బోయలచేతఁ బడుట, తనను ఎవఁడో కిరాతుఁడు గాయములు కుదుర్చుట, స్వస్థపడిన తన్ను వాఁడు పెండ్లియాడఁ గోరుట, నీచజాతిసంసర్గమునకు రోసి తాను వానిని పరుసముగా తిరస్కరించుట, దాని నోర్వక వాఁడు ఏకాంతమున తన్ను తలఁ దఱుఁగ నుద్యమించుట, ఆ సమయమున కచటికి స్వైరముగా వచ్చినట్టి యీ పడుచువాఁడు ఆ దురాత్ముని చంపుట, తన్ను ఈతఁడు పెండ్లియాడుటయు - వక్కాణించెను. విచారింపఁగా వాఁడు మిథిలేంద్రునియొక్క యొకానొక సేవకుఁ డనియు ఏదో పనిమీఁద వెనుకఁ బడినాఁడనియు ఆతని దారనే పోవుచున్నాఁ డనియు తెలిసినది. వానితోఁ గూడ నా దొరకడకు పోయి పుత్త్రులవృత్తాంతముచేత ఆతనికిని ప్రియంవదాదేవికిని శ్రవణములను దహించితిమి. ఆ రాజు దైవప్రాతికూల్యంబునం జేసి అన్నకొమరులతో తడవు పోరాడి, కడపట ఓర్పులేక విపరీతముగా పోరి పట్టుపడెను; దేవియు చెఱఁబడినది. కాలిన ప్రాణిని నేను ఈముదిమిలో సయితము ప్రాణము వదలుటకు శక్తురాలను గాక జోగురాల నయితిని. మఱి నాకొమారితయు పాపుప్రాణముల కోసము వికటవర్మదేవిని కల్పసుందరిని ఆశ్రయించినది. ఆ రాజకుమారులు అపాయము లేక ఎదిగి యుందురేని ఈ దీర్ఘకాలమునకు ఈ నీ ప్రాయమునకు వచ్చి నీవలెనే యుందురు. వారు ఉన్నయెడల దాయా

దులు తనికి ఈ బలాత్కారమును గావింపఁజాలరు.—అని చెప్పి దుఃఖము ఉప్పొంగి బిగ్గరగా నేడ్చెను.

ఆ తాపసి పలుకును వినఁగా నాకును కన్నీళ్లు పోటు పొడువఁగా రహస్యముగా "అమ్మా, అటు లగు నెడల ఊఱడిల్లుము. ఒక మునిని నీవు శిశువును వెదకి తెచ్చి పెట్టుమని వేడుకొని యుంటివి గదా, ఆయనకు శిశువు దొరకినాఁడు పెరిఁగినాఁడు. ఆ కథ కరము పెద్దది. అది యిపు డేల? నేనే ఆశిశువను. ఎట్లో ఒక యుట్లు చొచ్చుకొని వికటవర్మను చంపుటకు నావలన నగును. కాని వానితమ్ములు మిక్కిలి పెక్కురు, పట్టణముల వారును పల్లెలవారును వారిపక్షమున నున్నారు, నన్నన్నను ఇక్కడివాఁడు ఎవఁడును ఇట్టివాఁడ నని యెఱుఁగఁడు. తల్లిదండ్రులే నన్ను ఎఱుఁగకుండఁగా ఇతరుల మాట యేమి? కావున ఈప్రయోజనమును ఉపాయముచే సాధించెదను." అని వచించితిని. ఆముసలిదియు ఏడ్చుచు నన్ను కవుంగిలించి మాటిమాటికి శిరము మూర్కొని చన్నులు చేపి డగ్గుత్తికతో ననియె:—'వత్సా, చిరకాలము బ్రదుకుము. భద్రుఁడా, నీకు ఇపుడు భగవంతుఁడు బ్రహ్మదేవుఁడు ప్రసన్నుఁ డయినాఁడు. ఇపుడే విదేహులు ప్రహారవర్మకుఁ లోఁబడినా రనుకొనుము, ఏల యన, నిడుదవలుద బాహుదండములవాఁడవు నీవు మేరలేని శోకపారావారమును ఈఁది దాఁటింప నున్నావు. ఓహో! ప్రియంవదాదేవి పుణ్యము ఎంత గొప్పది!' అని పట్టరాని సంతోషముతో నాకు స్నానభోజనాద్యుపచారములు గావించెను. ఆమఠములోనే ఒక్కడ రాత్రి చాఁపమై పరుండితిని. ఆలోచించితిని - 'కపటోపాయమునఁ గాక ఈకార్యము సాధ్యముగాదు; కపటముల కన్ననో స్త్రీలు పుట్టుపాలము; కావున ఈ మెవలన అంతఃపురవృత్తాంత మే మయిన తెలిసికొని ఆద్వారంబున ఏదేని పన్నాగమును నడిపించెదను.' అని. ఇట్లు నేను తలపోయుచుండఁగా నే మహాసముద్రమునుండి లేచుచున్న సూర్యుని తేజీల యూర్పుల వేగముచే త్రోపుడుపడినదియుం బోలె రాత్రి దొరలిపోయినది. కడలికడుపులోని కాఁపురముచేత జడను వడియెనో యన మందంపువేఁడితో ప్రొద్దు పొడతెంచెను.

మేల్కొని ప్రాతస్తన నియమములను నెఱవేర్చుకొని ఆ నా దాదిని అడిగితిని- 'అమ్మా, ఆకూళ వికటవర్మయొక్క యంతఃపురవృత్తాంతమును నీ వేమేని ఎఱుఁగుదువా?" అని. నామాట ముగియకముందే ఒకబోటి ఎదుర నగపడెను. దానిం గని ఆనాదాది ఆనంద బాష్పముల డగ్గుత్తికతో వచించెను. 'అమ్మాయీ పుష్కరికా, చూడవే భర్తృదారకుని, జాలి లేక నేను అడవిలో విడిచిపెట్టిన యీతఁడు మరల నిట్లు వచ్చినాఁడు.' అని. అదియు పట్టరాని హర్షంబున నిట్టట్టయి చాలసేపు ఏడ్చి పనవి పనవి శాంతపడెను. రాజాం

తఃపురవృత్తాంతమును చెప్పు మని దానిని తల్లి నియోగించెను. అది చెప్పెను.— 'కుమారుఁడా, కళిందవర్మ యను కామరూపేశ్వరుని కూఁతురు కల్పసుందరి యనునది కళలయం దును రూపమునందును అప్సరలఁ గూడ మెచ్చనట్టిది పతిని ధిక్కరించి యున్నది. కడమ రాణివాసములు పలువురు ఉన్నను వికటవర్మకు ఆమె మీఁదనే ప్రాణము.' అని. దానికి బోధించితిని.—'ఈతరుణిని నే నిచ్చెడు గంధమాల్యములతో ఆశ్రయింపుము. సరి యగున జోడుగా దని నిందించుట లోనగు నుపాయములచే ఆరాజుపై ద్వేషము కల్పింపుము. తగిన భర్తలను పొందిన వాసవదత్తాదుల వర్ణనచేత ఆచెలువ యొక్క యభిప్రాయమును కనిపట్టుము. కడమ రాణివాసములకడ నాతని విలసితములను అతిగూఢములను కూడ యత్నముతో వెదకి బయటఁ బెట్టుము ఈ కల్కికి ఈసు పెంపుము.' అని. మఱియు అమ్మతో నంటిని.—'నీవును ఇట్లే వేఱుపని మాని ఆరాజాంగనను ఉపసర్పింపవలయును. ప్రతిదినము అచట ఏయే వృత్తాంతము ఉప్పతిల్లునో దానిని దానిని నాకు చెప్పవలయును. నాయుపదేశంబున ఈపుష్కరిక పిమ్మట కలిగెడు తియ్యని ఫలమునకై పాయని నీడగా కల్పసుందరిని అనువర్తింపవలయును.' అని. ఆయిరువురును ఆకార్యమును అట్లే సాధించిరి

కొన్నాళ్లు గడవఁగా, మాయమ్మ నాతో ననియె—'వత్సా, వేమను చుట్టుకొన్న బిండిగురివెందనుగా తన్ను భావించుకొని దుఃఖపడునట్లుగా ఆమెను చేసియున్నారము. ఇంక నేమి సేయవలయును?' అని. అంత నేను నారూపును చిత్తరువున వ్రాసి "ఈనా ప్రతిమను కల్పసుందరికి కొనిపొమ్ము. దీనిం గని ఆసుందరి తప్పక 'ఈయాకారము గలపురుషుఁడు కలఁడా?' అని యడుగును, 'కలఁడేని దాన నేమి?' అని బదులు చెప్పుము. ఆకోమలి ఏమి బదులు చెప్పునో దానిని నాకు చెప్పుము." అని వచించితిని. అమె సరియే యని రాజమందిరమునకుం బోయి మరలి వచ్చి నాతో నేకాంతమున నివేదించెను.— "అబ్బాయీ, ఆచిత్తరువును ఆమత్తకాశినికి చూపితిని. ఆమె దానిం గని యాశ్చర్యపడి ఈలోకమునకు నాథుఁడు కలిగినాఁడు; ఏల యన, పూవింటివేల్పునకు సయితము ఇట్టి మేనిసొబగు లేదు. ఈచిత్తరువు కరము చిత్రముగా నున్నది! ఇక్కడి వాఁడు ఇట్టిదీనిని ఎవఁడు వ్రాయునో ఎఱుంగను. దీనిని ఎవఁడు వ్రాసినాఁడు?' అని యాదట నడిగినది. నేనును చిఱునవ్వుతో నంటిని.—'దేవీ, సరిగా నే ఆనతిచ్చితివి. మొసలిపడెను భగవానుఁడు సైతము ఇంత యందగాఁ డని తలంప శక్యము గాదు. మఱి ఈ సముద్రపర్యంత మైన భూమి అతివిశాలము. ఎక్కడ నేని ఇట్టిరూపముఁ గూడ దైవ మహిమచేత ఉండెడును. మఱి ఇట్టిరూపము గలవాఁడు రూపమునకుం దగిన శీలవిద్యాజ్ఞాన

కౌశలములు గలప్రాయపువాఁడు గొప్పకులమువాఁడు ఒకఁడు సమీపమున నుండెనేని వానికి ఏమి లభించును?' అని. ఆమె చెప్పినది—'అట్లడిగెద వేమి? దేహము మనస్సు ప్రాణము అను నిది సర్వము అల్పము అనర్ఘంబును, కావున ఏమియు లభింపదు. ఇది మోసము గాదేని ఆపురుషుని దర్శనము ననుభవించుటచేత ఈకన్నులు ఎట్లు కృతార్థములగునో అట్లు నాకు అనుగ్రహముం గావింపుము.' అని. వెండియు నేను మఱియు నిట్లు పలుకుటకై వాక్రుచ్చితిని. 'ఈపురిలో ఒకానొక రాజకుమారుఁడు ప్రచ్ఛన్నముగా తిరుగుచున్నాఁడు. ఆమనిజాతరలో నీవు చెలులతోఁ గూడ ఊరియారామములో తిరుగుచు రూపొందిన రతివోలె స్వైరముగ అతని కనులమ్రోల తోతెంచితివి. కాముని ములుకులకు ఒక్కటియే గుఱియై యాతఁడు నన్నాశ్రయించినాఁడు. నేనును ఒండొరులకు అనురూపములును ఇతరులకు అలవడనివియు నయిన మాయాకారాది గుణాతిశయముల చేత ప్రేరితురాల నయి అతఁడే రచించినవానిని పూవులసిగదండలు మైపూఁతలు లోనగువానిని సమర్పించుచు నిన్ను పెక్కుదినములు సేవించితిని. అతఁడు తనరూపును తానే లిఖించి నీచిత్తనిగ్రహదార్ఢ్యమును పరికించుటకై పంపినాఁడు. ఈయర్థము నిశ్చితమేని మనుష్యాతీత మయిన బలసత్త్వప్రజ్ఞాతిశయము కలిగినట్టి యాపురుషునికి అసాధ్యమగునది ఏదియును లేదు. అతని నేఁడే చూపించెదను, సంకేత మేర్పరింపుము.' అని. ఆమెయు ఇంచుక తలపోసినట్లుండి వెండియు నిట్లనియె.

అమ్మా, ఇది యిపుడు దాఁపవలసినది కాదు, కాన చెప్పెదను. మానాయనకు ప్రహారవర్మరాజుతో ఎక్కుడు స్నేహము ఉండెను, మాయమ్మ మానవతికిని ప్రియవయస్య యయిన ప్రియంవదాదేవికిని అట్లే. మఱి ఈయిరువురును తమకు పిల్లలు పుట్టకముందే ఇట్లు ఒడంబడిక చేసికొన్నారు.—'మనలో కొడుకును గనుదాని కొడుకునకు కూఁతును కనునట్టిది కూఁతును ఈవలసినది.' అని. మఱి మానాయన యయిననో పుట్టినకొమారితను నన్ను ప్రియంవదాదేవి కుమారుఁడు నష్టుఁడయినాఁడను కారణంబున దూతముఖముగా ప్రార్థించిన వికటవర్మకొఱకు, ప్రహారవర్మయెడ ఈతఁడు ద్రోహి యయినకతంబున ఇయ్య సమ్మతి లేకున్నను, ఈదుర్జనుని యభియానమునకు వెఱచి ఇచ్చివైచి వివాహమునకై యిటకే పంపినాఁడు.

అంతగా సొంపులేని యవయవములవాఁడు కళలయందు కావ్యనాటకాదులయందును అక్కఱలేనివాఁడు, శౌర్యముచేత నుడులు తెలియఁడు, ఆత్మస్తుతిపరాయణుఁడు కల్లరి అగమ్యాగామి, ఇతనిం బెండ్లియాడ నే నొల్లను. విశేషించి యీనడుమ ఉద్యానములో నాకు అంతఃలగభూత పుష్కరిక నాకై తెచ్చుచున్న సంపెఁగపూవులతో నాపై

మత్సర మూనినదై తన్ను తా నెఱుఁగకున్న తనయాటకత్తెను రమయంతిక యను దానిని తనచేతులతో నలంకరించినాఁడు. స్వయము ఆరోగ్యుఁడు ఈమానిసి అవమానించుటకుఁ గూడఁ గడంగినాఁడు. మౌహూర్తికులను నాకు మాతండ్రి యిచ్చిన రత్నములచేత తనియించి వశపఱచుకొని, వారిచే వివాహకాలమును దవ్వు సేయించి, రాజ్యభ్రంశప్రాణభంగాదిఫలోపన్యాసంబులచే యీతనికాలాతిపత్యమును నివారింపించి, ప్రాణములం జేతఁ బెట్టుకొని యున్నదానను, కమ్మవిలుకాని యమ్ములపాదియైన నెమ్మనమ్ము గలకొమ్మలకుఁ బ్రియతమునితోడి వియోగమును తా మిస్సహింపని మనుజానివలని యభియోగంబును భరింపరాని దుఃఖములు గదా. కావున నీవు ప్రస్తావించిన పురుషోత్తమునితోడ నన్ను ఈదినము ఉద్యానములో బండిగురివెందతీవయింట కూర్పుము. అతని వృత్తాంతమును విన్నమాత్రాననే నాడెందము అమందముగా అతనియందు అనురక్తమయినది. అతనిం బెండ్లియై, ఇదిగో ఉన్నదే పలసినంత ధనరాశి, దీనిచే అనునోహరుని యీతని రాజ్యపదమందు నెలకొల్పి అతనికి పట్టపుదేవినై ఉపచరించుచు జీవితమును సఫలము కావించికొనెద." అని. నేను అందుల కంగీకరించి మరలి వచ్చితిని. అటు పయిని భర్తృదారకుని చిత్తము.

ఆదాదివలననే అంతఃపురసన్నివేశమును అంగజాలలతావులను క్రీడానఃప్రదేశములను యథావిభాగంబుగం దెలిసికొని క్రుంకుమెట్టకొమ్మునం బడిన నలుఁగుడుచేతనంబోలె సూర్యబింబము కెంపువాఱుచుండఁగా, పడమటి సంద్రంపునీటం బడి యాఱినప్రొద్దు నిప్పుకపొగమొత్తమో యన మింట నెల్ల గెంటుకొని యిరులు తెరలుచుండ, నన్నుఁ గన నత్యంతరాగముతో ఎలనవ్వుచున్న కల్పసుందరీవదనపుండరీకమో యన పొడతెంచిన చంద్రమండలముచేత రాజుచున్న తేజుతో పూనేజాజేజే భువనమును జయింప నుద్యమింపఁగా, యథోచితముగా పవ్వళించి నిద్రించితిని.

మఱునాఁడు మన్మథుఁడు ఒయలపైకి పోక నన్నే అంపవానలో ముంచెను. సూర్యుని యెండ యనెడు సరస్సు ఇంకిపోయెను. చీకటి యనెడి బురద అంతటనుం బ్రకటమాయెను. అంతట నేను అడుసుఁజాయవలువగట్టి బిట్టుగట్టిగా నడికట్టుచుట్టి, కేలవాలు దాలిచి, ప్రస్తుతావశ్యకసాధనములం గైకొని, దాది చెప్పినగుర్తులను, స్మరించుచు నీళ్లతో నిండియున్న రాజగృహంపుఁగందకమును సమీపించితిని. ఆటకందకముచెంత అమ్మయింటి వాకిట పుష్కరిక ముందే పెట్టియున్న వెదురుగడను కైకొని, దానిని పరుండఁ బెట్టి యగడ్తను, నిలువఁబెట్టి ప్రాకారమును, దాఁటితిని. ఎక్కు, గదను ఎక్కుటకై కాలిన యిటికలతోఁ జేసిన మెట్లదారిని నేలకు దిగితిని. దిగి, పొగడవాటికను దాఁటి, సంపెఁగచాలుదార్లని ఇంచుకంత పోయి, ఉత్తరపుదిక్కున దూరముగా జక్కవకవయొక్క యాస్థగావ

మును వింటిని. వెండియు ఉత్తరమునకు చేతితాఁకుడుచేత తెలియుచున్న విరివిగల మాడువు యొక్క గోడను చుట్టుకొనియున్న కళిగొట్లదారిని అమ్ము పడుపాటి దూరము పోయి, మరల తూర్పుగా ఒకప్రక్క కంకేళులును రెండవప్రక్క మల్లికలును సొంపారుచున్న యిసుకదారిని కొంచెము దూరము దాఁటి,మరల దక్షిణముగా మామిడి వీథిలో ప్రవేశించితిని. పిమ్మట చుట్టును మిక్కిలి దట్టమును లోపల రత్నాలతోఁ గట్టిన తిన్నె గలదియు నగు బండిగురివెంపతీవమండపమును ఇంచుక తెఱచిన చేతిదివ్వెకుప్పెనుండి ప్రసరించిన దీపవత్తి వెలుతురుచేత నిరూపించితిని. లోపలికి పోయి అందొకప్రక్కను విరిసిన పువులచే దట్టమయియున్న గోరంటగున్నతే చుట్టుగోడగా నుండ నేల రాలిన యెఱ్ఱకంకేళి రెమ్మల క్రొత్తపూమొగ్గలచేత పులకపటలిచేతనుం బోలె నొప్పారుచున్న గర్భగృహమును క్రొంజివురుజొంపములచే పాటలం బయిన తలుపుం దెఱచి ప్రవేశించితిని.

అందు కొంచెము సేపు కూర్చుండి అలపుతీర్చుకొని యుండఁగా అగ్గలంపుఁబరిమళం బొందు నాదెసకు గమాయించెను. మెల్ల మెల్లని యడుగుల చప్పుడును వినవచ్చెను. దానిని విన్నంత సంకేతగృహమునుండి వెలువడి ఎఱ్ఱకంకేళిబోదెప్రక్క చాటుగా డాఁగి నిలుచుంటిని. ఆ మేలి కనుబొమ్మలాఁడి మేరమీఱినకోరికతో అల్లన వచ్చి నన్నుఁ గానక మెండుగా కొందలం బంది, మత్తరాజహంసియుంబోలె రక్తకంఠ గద్గదమనోహరం బయిన పలుకుం బలికెను.—'నిక్కముగా మోసపోయితిని, ఇఁకను బ్రదుకుట కుపాయము లేదు. ఓహృదయమా, అందని పండుల కఱ్ఱుసాఁచి దొరకమికి కుందురెద వేల? భగవానుఁడా, విషమబాణుఁడా, నీయెడ నే నేమి ఎగ్గొనర్చితిని? ఇట్లు దహించెదవు, భస్మీకరింపవు?' అని.

అంత నేను ఎదుటఁ బడి దివ్వెకుప్పెం దెఱచి "భామినీ, నీవు చిత్తజన్మునికి ఎంతయుం దప్పు సేసి యున్నావు. ఏల యన ఇతనికి ప్రాణమయిన రతీదేవిని నీలావణ్యముచేతను, వింటిగడను బొమతీవలచేతను, దేఁటిబారు నారిని నల్లనిముంగురుల కాంతులచేతను, కోలలను క్రేగంటిచూపులచేతను, కుసుమం బద్దిన జెండావలువను కెమ్మోవికిరణజాలములచేతను, మొదలి నెచ్చెలిని మలయసమీరుని పరిమళములు వెదచల్లు నూర్పుగాలిచేతను, కోకిలకూజితములను మధురతరాలాపములచేతను, పువుల టెక్కెపుఁగామను బాహుయష్టులచేతను, దిగ్విజయారంభార్థ మయిన నిండుకుంభముల జతను చనుఁగవచేతను, ఆటకొలనిని పొక్కిటిసుడిచేతను, సజ్జీకృత మయిన రథమును పిఱుఁదుమండలముచేతను, ఇంటిమణిద్వారస్తంభయుగళమును తొడలచేతను, విలాసకర్ణావతంసకిసలయమును అఱకాలిజిగచేతను, కీడ్పఱిచితివి. కావున నిన్ను మీనకేతనుఁడు కారించుట న్యాయమే. తప్పు

సేయని నన్ను ఇతఁడు అతిమాత్రముగా వెతఁబెట్టుట ఈతనియందు దోసము. కావున, సుందరీ, నాయం దనుగ్రహింపుము, మదనసర్పము కఱచిన నన్ను సంజీవనౌషధులం బోని క్రేఁగంటిచూపులచే బ్రదికింపుము." అని వేఁడితిని. అంతట చిరపరిచితులమువోలె బలునమ్మకముతో నిముసము కూర్చుంటిమి. పిమ్మట నేను ఎడఁబాయవలసి వేఁడి నిట్టూర్పులు పుచ్చి, దీనదృష్టులతో ప్రియను గాఢముగా కవుంగిలించి, అయిన లేచితిని. అంత నా ముద్దియ 'ప్రాణేశ్వరా పోవుదువేని, నాప్రాణము పోయినదే యని యెన్నుము. నన్నును దోడ్కొని పొమ్ము, అట్లు చేయ వేని ఈదాసురాలు నిష్ప్రయోజన.' అని మోడ్పుఁ గేలిని అవతంసీకరించుకొనెను.

నేను ప్రియకు బదులు పల్కితిని.—ఓసి, ముగుదా, సచేతనుఁ డెవఁడు వలచివచ్చిన యింతిని సంతసంబున నంగీకరింపఁడు? నామీఁది యీయనుగ్రహంబునందు నీపట్టు గట్టిద యేని నిశ్శంకముగా నాచెప్పినట్లు చేయుము, రాజునకు నాప్రతిమ గల యీపటమును చూపి, 'ఈరూపము మగసొబగుయొక్క పరమావధిని పొందియున్నదా లేదా?' అని యడుగుము. 'నిశ్చయముగా పొందియున్నది.' అని యాతఁడు తప్పక చెప్పును. మరల వచింపుము. "అట్లేని, ఒకానొక తాపసి దేశాంతరములు సంచరించి ప్రాగల్భ్యము పొందినట్టిది నాకు తల్లివంటిది కలదు; ఆమె ఈచిత్తరువును పురస్కరించి నాతోఁ జెప్పినది.—'ఒక మంత్ర మున్నది. నీవు పర్వమందు ఉపవసించి విజనప్రదేశమందు పురోహితులు అగ్నిదేవుని వేల్చి విడిచినంతట రాత్రివేళ ఒంటిదానవుగా ఆమంత్రముతో నూఱుగంధపుఁజిదుగులు నూఱు అగురుసమిధలు, కపురంపుఁబడికిళ్లు పట్టువలువలును వెక్కుగా, వేల్చితి వేని ఈరూపము నొందెదవు. అంతట గంటను వాయింపుము. ఘంటానాదంపుఁ బిలుపు చేత భర్త వచ్చి నీకు సకల మయిన రహస్యజాతమును చెప్పి కన్నులు మూసికొని నిన్ను కవుంగిలించుకొను నేని ఈరూపము ఆతనికి వచ్చును, నీవు మరల ఎప్పటి రూపమునే పొందుదువు. నీకును నీ ప్రియునికిని ఇష్ట మగు నేని, ఈకార్యమందు ఎంతమాత్రము సంశయింప నక్కఱలేదు.' అని.— ఈరూపము నీ కిష్టమేని నీమిత్త్రులతోను మంత్రులతోను ఇంక తమ్ములతోను పట్టణవాసులతోను పల్లెజనులతోను కలయఁబలికికొని, వారి సమ్మతిని గూడఁ బడసి యీపనిలో ప్రవేశింపవలసినది." అని. అతఁడు తప్పక అంగీకరించును. అంతట ఈ క్రీడావనవాటియందలి చిన్నచదుకములో పురోహితుఁడు విధి ప్రకారము పశువును పాలియించి వేల్చి విడిచిన యగ్నియందు ఆపొగ యాఱు నప్పటికి నేను ప్రవేశించి ఈలతామండపముందే ఉండెదను. మఱి నీవు రాత్రి చాల గాఢ మయిన యంతట మేలంపుఁ జిఱునగవుతో వికటవర్మ చెవిలో పల్కుము.—'నీవు మోసగాఁడవు,

చేసినమేలు మఱచువాఁడవుదు. లోకులకు కన్నులపండు వగు రూపము నాయనుగ్రహముచలననే లభించినది దానితోనే నీవు నాసవతులను క్రీడలం దేల్తువు. కావున నేను స్వనాశమునకై బేతాళుని లేపను.' అని. ఈ నీమాట విని ఆరాఁడేమి చెప్పనో దానిని నాకు ఒంటరిగా వచ్చి తెలుపుము. అటుపై యెత్తుకడ నేనే ఎఱుఁగుదును. నా యడుగులజాడను తోఁటలో పుష్కరిక చేత తుడిపించివైవుము. అని.—ఆచాను శాస్త్రోపదేశముంబోలె నాచెప్పిన దెల్ల ఆదరముతో గ్రహించి ఎట్టకేలకు నన్ను వదలి అంతిపురి కేగెను. నేనును వచ్చినదారినే వెలువడి నాబసకే పోయితిని.

అనంతరము ఆమత్తకాశిని ఆపన్నుగడ నెల్ల అట్లే జరిపెను. ఆదుర్మతి దాని మాటలో నిలిచెను. పట్టణములయందును పల్లెలయందును ఈవింతవార్త వ్యాపించుచుండెను. ఏమనఁగా— 'వికటవర్మ రాజు ప్రాణప్రియామంత్రబలముచేత వేల్పులకుఁ దగిన దేహమును పొందును. నిశ్చయముగా ఇది మోసము గాదు అతిశోభనము. ప్రమాదమను మాట కైనను అవకాశ మెక్కడిది? తన యంతఃపురోపవనములోనే గదా యీ ప్రయోజనము నెఱవేఱును; తన ప్రాణప్రియయే గదా నెఱవేర్చును. అట్లే బుద్ధిలో బృహస్పతితో సమాను లయిన మంత్రులు కూడ ఇందులకు సమ్మతించినారు. ఇట్లే యగునేని ఇంతకన్న నద్భుతము వేఱొండు లేదు. మణి మంత్రౌషధములయొక్క ప్రభావము ఊహింప నలవిగానిది గదా.' అని, కింవదంతులు మెండుగా పర్వుచుండ, పర్వదినము వచ్చునపు, రాత్రి గాఢమై చీఁకటి ప్రౌఢమై యున్నవేళయందు, అంతఃపురోద్యానము నుండి మినుసిగదేవుని కుత్తుక వోలె కారుకొనుచు పొగ యొంబులు గగనమునకు నిగిడెను. పాలు నేయి పెరుఁగు నువ్వులు తెల్లావాలు వప పాల నెత్తురు అనెడు వస్తువుల యాహుతుల పరిమళము దెసదెసకు వీతెంచెను. తటాలున ఆపొగ మొత్తము శమింపఁగానే నేను గృహోద్యానమునఁ బ్రవేశించితిని; గజయానయు నేతెంచెను. నన్నుఁ గగిసి నవ్వుచు ని ట్లనియె. "ఓయి టక్కరి, నీకోరిక నెఱవేఱినది, ఈపశువునకు అవసానకాలము అయినది. వీనిని చెల్లించుటకై నీవు నేర్పిన విధమున నేను వచించితిని. 'వంచకుఁడా, నీకు నేను సౌందర్యమును సాధింపను. ఇంత సుందరుఁడ వగుదేని నీవు అచ్చరలకుం గూడ అభిలషణీయుఁడ వగుదువు, మఱి మానుషాంగనలకు చెప్పవలయునా? నీ బోఁటి ఘాతుకుఁడు స్వాభావిక చాపలము చేత ఎచట నన్నచట తగులుకొనును.' అని. అతఁడు నా పాదములలోఁ బడి వేఁడెను.—'ఓసి రంభోరుకా, నా దుశ్చరితములను మన్నింపుము, ఇటు పైని వేఱొక పొలఁతిని మనస్సులో నయినను తలంపను. ప్రస్తుత కర్మను త్వరగా ముగింపుము.' అని. కావున నేను ఇదియే నాకు వివాహవేషముగా నినుఁ గూర్చి

వచ్చితిని. ఇంతకు ముందే రాగాగ్ని సాక్షిగా అనంగగురుఁడు నన్ను భార్యనుగా నీకు ఇయ్యనే ఇచ్చినాఁడు. వెండియు నిపుడు ఈయగ్నిని సాక్షీకరించి నా హృదయమే నన్ను నీకు ఇచ్చినది.'' అని మునిపాదమును అడుగుమీఁద ఒత్తి నిలిచి చీలమండల నెత్తి, వ్రేళ్ల పెనఁకువచే ఏకపాశ మయిన బాహులతాద్వయముతో కంఠముం జుట్టి పట్టి ఒయ్యారంబుగా నామోము వంచి తనమోముఁదమ్మి నెత్తి విరివిగన్నులు తిరుగుడు వడుచుండ నన్ను పలుమాఱు ముద్దుగొనియెను.

అంత నక్కాంతను 'ఇటనే గోరంటపొదరింట నుండు, నేను పోయి తీర్పవలసిన పనిని చక్కఁగా తీర్చి వచ్చెదను.' అని విడిచి, వేల్మినిప్పుతావునకుంబోయి కంఠేళి కొమ్మకు వ్రేలఁగట్టియున్న గంటను ఆడించితిని. అదియు యమదూతిపోలె ఆమానిసిం బిలుచుచు కూఁతపెట్టెను నేను అగురుగంధము లోనగువానిని వేల్వఁదొడంగితిని. చెప్పిన చోటికి రాజు వచ్చెను. జంకుపడినవాఁడుంబోలె కొంచెము అబ్బురపోయి ఆలోచించుచు నిలుచున్న యాతనితో 'చెప్పు నిజముగా, మరల నిపుడు ఈ యగ్ని దేవుఁడు సాక్షిగా, ఈరూపముతో నా సరతులం గ్రీడలం దేల్చ నని. తర్వాత నిన్ను ఈ రూపము పొందించెదను.' అని వచించితిని. అంత నాతఁడు ఈమె దేవియే మాయ యేమియు లేదని నక్కఁగా నమ్మకము కుదిరి ఒట్టుపెట్టుకొన నమకట్టెను. నేను నవ్వి మరల నంటిని 'ఒట్టేల? మానుషి యవ్వతె నన్ను అవమానింపఁగలదు? అచ్చరలతోఁ గూడుదువేని, నీ యిచ్చ వచ్చినట్లు కూడుము, మఱి చెప్పుము నీ రహస్యము లేవో. వానిని చెప్పి ముగింపఁగానే నీకు ఈరూపము పోవును.' అని. ''నా పినతండ్రి ప్రహారవర్మ బంధనములో నున్నాఁడు. అతనిని విషాన్నముచేత చంపించి అజీర్ణదోషముచేత చచ్చినట్లు ప్రకటము సేయుద మని మంత్రులతో కలసి యాలోచించి నిశ్చయించుకొని యున్నాను. నా తమ్మునికి విశాలవర్మకు పుండ్రదేశమువిూఁదికి దాడిపోవుటకు సేనాసమూహమును ఇచ్చుటకు నిశ్చయించితిని. పాంచాలికుఁడను నూరి పెద్దయు, పరిత్రాతుఁడను సాహుకారును భూమి యంతయు వెలపెట్టఁదగిన వజ్ర మొకటి ఖనతి యనెడు వరబ్బీ సాహేబునొద్ద కడుఁగొంచెము వెలకే దొరకు నని నాతో రహస్యముగా చెప్పినారు. నాకు అంతరంగ భూతుఁడు దేశశ్రేష్ఠుఁడు శతహలి యను గ్రామాధ్యక్షుఁడు నాపై లేనినిందలను వ్రేలుచుండువానిని గర్విని దుర్మార్గుని అనంతసీరుఁడను గ్రామాధ్యక్షుని జనులను రేఁపుచున్నాఁడని మిషపెట్టి చంపించెద నని చెప్పి వానిని వెలార్చుటకు నా యాజ్ఞమెయి మునగాండ్రను పంపువెట్టువాఁడయి వచ్చియున్నాఁడు.—ఇట్లిది కొలఁదిదినములనుండి జరుగుచున్న రహస్యము.'' అని వాఁడు చెప్పెను. దానిని విని, వానిని 'ఇంతే నీ యా

యున్న, నీచేతను తగిన గతిని బొందుము.' అని పలికి సూరియతో రెండు తుండెములు గావించి, వీతిహోత్రుని మెండుగా నేయి పోసి మండించి అందు హోమము చేసి బసుమంబు గావించితిని.

అంతట స్త్రీస్వభావముచేత ఇంచుక బెగ్గడిల్లిన ప్రాణప్రియను ఓదార్చి, కేలుఁ జివురుం గేలఁగొని, తదీయమందిరంబునకుం జని తదనుజ్ఞచే రాణివాసముల నెల్ల రావించి తత్క్షణమే కొలువొసంగితిని. వెఱఁగొందియున్న విలాసవతుల గుంపునడుమ కొంతసేపు విహరించి, రాణివాసముల నంపఱను విడిచి ప్రియముతో తదంతఃపురమందే రాత్రిశేషమును గడపితిని. దయితవలననే దివాణమందలి యాచారముం దెలిసితిని.

వేకువను జలకమాడి మంగళమయిన పిమ్మట మంత్రులం గలసికొని వారితో వచించితిని.—'అయ్యలారా, రూపముతోనే నాస్వభావము కూడ మాఱిపోయినది; విషాన్నముచేత చంపించుటకు ఉద్దేశించియుంటినే ఆమానాయనను విడిచి ఆయనయీ రాజ్యమును ఆయనకే ఇయ్యవలసినది. తండ్రినిం బోలె ఆయనను మేము సేవించుచుండెదము. తండ్రిని చంపుటకంటె గొప్పపాతకము మఱి లేదు.' అని. తమ్ముని విశాలవర్మను పిలిచి చెప్పితిని.—'వత్సా, ఇప్పుడు పుండ్రదేశము సుభిక్షముగా నుండలేదు, ఆదేశమువారు దుఃఖముచేత ఏమియుం దెలియక చావునకు తెగఁబడి సుభిక్షమయిన మనదేశము మీఁద వచ్చి పడుదురు. వారికి విత్తనము లేమి గాని వరి లేమి గాని కలుగనప్పుడు దండెత్తి పోదువు గాక, ఇప్పుడు పోవుట సరిగాదు.' అని. ఊరిపెద్దలతో చెప్పితిని.—'మిక్కిలి తక్కువవెలకు ఎక్కుడువెల చేయువస్తువును కైకొనుట నాకు సరిగాదు, నేను ధర్మమును కావవలసినవాఁడను గదా; కావున దానిని తగినవెలయే యిచ్చి కొనవలసినది.' అని. రాష్ట్రముఖ్యుని శతహలిని పిలిచి చెప్పితిని.—'అనంతసీరుని ప్రహారవర్మపక్షమువాఁడని గదా నాశము చేయం దలకొనుట, మాతండ్రియే నిజస్థితికి వచ్చియుండఁగా వాని నేల నాశము చేయుట? కావున నీవును ఈవిషయమున తొందరపడవలవదు.' అని.

వీరు గుర్తు సర్వము సరిపడఁగా, ఆతఁడే యీతఁడని నిశ్చయించుకొని ఆశ్చర్యపడి, నన్నును కల్పసుందరీదేవినిం బొగడుచు, మంత్రప్రభావములను ఉద్ఘోషించుచు, చెఱనుండి నాతల్లిదండ్రులను విడిపించి, రాజ్యమును వారికి అప్పగించిరి. నేను జరిగిన వృత్తాంతము లెల్ల ఆ నా దాదిముఖమున రహస్యముగా తల్లిదండ్రుల కెఱుకపఱిచి ఆనందముయొక్క పైకొనను అంటినట్టి వారల పాదమూలమును సేవించితిని. వారు కల్పసుందరీ మాతాపితలను దూతముఖముగా రప్పించి తత్కృతదానపూర్వకంబుగా ఆ సుందరిని నాకుం బెండ్లిసేసి యొసంగిన యౌవరాజ్యమును బొంది సుదుటం బడినవాఁడనై

దారవైన నీ పాదములను బాసిన దుఃఖము చేత సరిచెడినవైన భోగములను అనుభవించుచు, మఱి చంపానగరము మీఁదికి చండవర్మ వచ్చినాఁ డని మానాయనను చెలికాఁ డయిన సింహవర్మకమ్మువలన తెలిసికొని శత్రునాశనము మిత్రరక్షణము రెండును అవశ్య కరణీయము లే యని శీఘ్రగామి యగు గొప్పదండుతో తోడు వచ్చితిని. నీయడుగుఁ దమ్ముల లచ్చిని ప్రత్యక్షీకరించెడు మహోత్సవానంద రాశికి పాత్రమ నైతిని.

అన విని రాజవాహనరాజు నవ్వుచు ననియె. 'చూడుఁడు, మహాకపటము కూడ తల్లిదండ్రుల చెఱను విడిపించినందునను, దుష్టశత్రువును పరిమార్చుటకు ఉపాయ మయి నందునను, రాజ్యప్రాప్తికి సాధన మయినందునను, పూర్ణముగా అర్థధర్మములను సాధించి నది. బుద్ధిమంతుల ప్రయోగము ఏది శోభిల్లదు!' ఇట్లు పలికి అర్థపాలునిముఖముపై నెయ్యంపు నిడుద చూడ్కి నిగిడ్చి 'చెప్ప వోయి నీవు నీచరితమును.' అని యానతి చ్చెను. అతఁడును చేతులు జోడించుకొని వక్కాణింపం దొడంగెను.

---

# చతుర్థోచ్ఛ్వాసము.

## అర్థపాల చరితము.

ప్రభూ, నేనును ఈ చెలికాండ్రు పోయినపనిమీఁద నే ఆసముద్ర మయిన భూమం డల మెల్లఁ గ్రుమ్మరుచు ఒకప్పుడు కాశీపురికి పోయితిని. స్ఫటికపుఁదునియలవలె స్వచ్ఛ మయిన మణికర్ణికాజలంబులందు స్నానము చేసి, అవిముక్తేశ్వరుని భగవంతుని విశ్వనాథుని నమస్కరించి, ప్రదక్షిణము సలుపుచు, ఎక్కువయొడ్డుపొడుగులు గల యొక పురుషుని ఇనుపగుదియలవంటి వలుదబాహువులతో కాసెగట్టుకొనుచున్న వానిని ఎడతెంపులేని యేడ్పుచే ఉబ్బినవై ఎఱ్ఱపడినట్టి కన్నులు గలవానిని చూచితిని. తలపోసితిని.—'ఇతఁడు దిట్టఁడు, వాడినపల్లగ్రుడ్డుతోడి కన్ను దైన్యమును కురియుచున్నది. చేయుచున్న ప్రయ త్నము సాహసముం దెలుపుచున్నది. నిక్కముగా ఈతఁడు ప్రాణముపై యాస మాని తన ప్రియజనమునకు కలిగిన దుఃఖముకై తానేమో కఠోరకృత్యమును చేయనున్నాఁడు. కావున ఇతని నడిగి తెలిసికొని నేను తోడ్పడుటకు ఏమేని అవకాశ మున్నయెడల ఈతని నను గ్రహించెదను.' అని తలంచి పూని అడిగితిని..—'భద్రుఁడా, కాసె సాహసముం దెలుపు చున్నది. దాఁపవలసినది కా దేని నీశోకమునకు కారణమును వినవలతును.' అని. అతఁడు

నన్ను గౌరవంబుతో చూచి 'తప్పేమి? వినుము' అని అటనుండి పోయి ఒక్కగన్నేరు చెట్టుక్రింద నాతోఁగూడ కూర్చుండి యీకథ చెప్పెను.

మహాభాగుఁడా, నేను పూర్వేషుకామదేశములో నొక గ్రామాధ్యక్షుని కుమారుఁడను, నాపేరు పూర్ణభద్రుఁడు. తండ్రి ఎంత చక్కఁగా పెంచినను దైవవశమున దొంగతనము నవలంబించితిని. పిమ్మట ఈకాశీపురమందు ఒక గొప్పకోమటియింట దొంగిలించి నాణెములతో పట్టుఁబడి కట్టుఁబడితిని. కట్టినిలిపియున్న నామీఁదికి మృత్యువిజయ మను పేరి మదపుటేనుఁగు క్రీడార్థమై చంపు స్వభావము గలది రాజద్వారముపై నెక్కికూర్చున్నవాఁడై చూచుచున్న కామపాలుఁ డను ప్రధానమంత్రియొక్క యాజ్ఞచేత జనకంఠధ్వనిచే రెట్టియయిన ఘంటాధ్వనితో కంబమువంటి తొండమును వలయముగా చుట్టుకొని పఱతెంచి వచ్చినది. నేను ఎదుర్కొని నిర్భయముగా నదరింపఁగా ప్రక్కమొగముగా వమ్ముచు, బొండకొయ్య బొక్కలలో తగుల్కొనియున్న నారెండుభుజదండములచేతను ఉద్దండముగా రెండుకోలలనడిమిప్రదేశమందు ఘట్టనముం బొందినదై వెఱచినదియుం బోలె నివర్తిల్లెను. మోసెత్తిన రోసంబున మావటీఁడు క్రూరతరంబుగా తిట్టి అంకుసముతో కొట్టి పాదములతో ముట్టి ఎట్టో వెండియు నాకేసి మరలించెను. నేనును ఇనుమడించిన కోపంబున అదరించి కొట్టఁగా నివర్తిల్లి పాఱిపోయినది. నేను వెంటఁబడి వేగంబున పట్టి యీడ్చితిని. అంతట దీపించిన కోపంబున 'ఆ! వచ్చితివి! పాదలియేనుఁగా, ఎటకేఁగదవు?' అని వాఁడి యంకుసముతో మావటీఁడు మాటిమాటికి కొట్టఁగా ఏనుఁగు కడకంటి భాగమును నాకేసి త్రిప్పెను. అంతట 'ఈ పందయేనుఁగును పోనిమ్ము, మఱియొక దానిని వారణరాజమును తెమ్ము; దానితో నేను ఇచ్చట కొంచెము సేపు ఆడుకొని పోవలసిన గతికి పోయెదను.' అని పలికితిని. కోపముతో గర్జించుచు దుముకుచున్న నన్నుం గాంచి యావారణము మావంతుని కఠినాజ్ఞను మీఱి పలాయిత మాయెను. అంతట మంత్రి నన్ను పిలిచి యిట్లడిగెను. 'భద్రుఁడా, మృత్యువిజయ మను పేరి యీయేనుఁగు మృత్యువే. చంపుటయే దీనికి ఆట. అట్టియిది నీచేత ఇట్టిపాట్లు పడినది! కావున, ఈ పాడువృత్తిని మాని మమ్ము కొలుచుచు మంచినడవడి నవలంబించి వ్యవహరింప నేర్తువా?' అని. 'మీ యాజ్ఞ ఎట్లున్న నట్లు చేసెదను.' అని నేను విన్నవించుకొంటిని. అప్పటినుండి ఆయన నాతో మిత్త్రుఁడు వోలె వర్తించుచుండెను.

చనవు గలిగిన పిమ్మట నొకనాఁడు ఏకాంతమున నే నడుగఁగా ఆయన తన చరితమును వాక్రుచ్చెను.— కుసుమపురంబున రిపుంజయమహారాజునకు ధర్మపాలుఁడని బుద్ధికి ఖ్యాతిఁ జెందినవాఁడు వేదాధీశి యుండెను. ఆయనకుమారుఁడు సుమిత్త్రుఁడను నాయన

ప్రజ్ఞాగుణములందు తండ్రితో సరిగా తులఁదూఁగువాఁడు. ఆయనకు నేను తమ్ముఁడను సవతితల్లికుమారుఁడను. వెలయాండ్రసంగడిం జెంగలించుచున్న నన్ను మంచినడువడి నభిమానించినమాయన్న బాగుసేయం గడంగి హితము సెప్పెను. ఎంత బోధించినను నేను నా దుర్వృత్తి మానక దేశత్యాగినై విదేశములం గ్రుమ్మరుచు అనయసలో ఈవారాణసికి వచ్చితిని. ఇట ప్రమదవనమందు మిక్కిలికంటిదేవరను ఆరాధించుచున్నదై చెలికత్తెలతోఁ గూడ వచ్చి బంతియాటచే సేవించుకొనుచున్నదానిని కాశీరాజు చండసింహుని కొమారితను కాంతిమతి యనుదానిని కాంచి కామించి గాంధర్వవిధానంబున కళత్రీకరించితిని. కన్యాంతఃపురంబునందు గూఢముగా విహరించుచున్న నావలన ప్రియతమ వేఁకటిం జెంది ఒక కుమారునిం గనియెను. గుట్టు బయలగునను భయంబున ఆచెలువ మృతజాతుఁడని చెప్పి విడనాడఁగా, ఆబుడుతని పరిజనము ఆటకొండలోను, అందలి చెంచుది మసానములోను వదలిరి. చెంచుది మరలి వచ్చుచు నడురేయి రాజవీథియందు తలవరులు పట్టి బెదరింపఁగా దండనగానికి భయపడి రమారమిగా రహస్యముం బయటఁ బుచ్చెను. ఆటకొండగుహయింట నిశ్శంకముగా నిద్రించుచున్న నన్ను ఆచెంచుది చూపఁగా ఱేనిపంపున తలారులు అట దొరకిన త్రాళ్లతోఁ గట్టి వల్లకాటికిం గొనిపోయి మాతంగుని చాతలం గత్తితోఁ గొట్టుమనిరి. అంతట దైవవశంబున నాకట్టులం ద్రెంపుకొని వానిచేతికత్తి నొడిసికొని ఆ మాతంగుని మతియొకకొందఱను గొట్టి తొలఁగి నిలువరము లేక అడవులలోఁ ద్రిమ్మరుచుండఁగా ఒకప్పుడు దివ్యాకార సపరివార కన్నెటి బొల్లు బొటబొట రాలుచున్న నెమ్మొముతోడిది యొకకన్య నన్నుం దటిసి మోముఁ గేలుఁజివురు బొదల నలంకరింప కాటిసురులు మొగంబుపయి నెరయుచుండ నాదు శిరము వంచి ప్రణమిల్లి నాతోఁగూడ దల్లనియొక పెను మఱ్ఱిపీడం గూర్చుండి 'పిల్లా, నీ వెవ్వతెవు, ఎక్కడిదానవు, ఏమికతంబున నాకుం బ్రసన్నవు?' అని ఆదరంబుమెయి నే నడుగఁగా వాగ్రూపమున ఈతేనియవానం గురిసెను.

ఆర్యా, నేను జక్కులఱేఁడగు మణిభద్రుని కొమారితను తారావళి యనుదాన; నే నొకప్పుడు అగస్త్యపత్నిని లోపాముద్రాదేవిని నమస్కరించి చందనాద్రినుండి మరలి యరుదెంచుచు వారణాసికల్లకాటిలో ఏడ్చుచున్నయొకబుడుతనిం గాంచితిని. అతిస్నేహంబున వానిని నాతలిదండ్రులమ్రోలికి ఎత్తుకొని పోయితిని. మానాయన కుబేరునిసన్నిధికిం గొనిపోయెను. అంత నలకాపతి నన్ను గప్పించి 'ఓసి బాలా, ఈబుడుతనియందు నీకెట్టి భావము కలదు చెప్పుము?' అని యానతిచ్చెను. 'నాకడుపునం బుట్టిన కుమారునియందుఁబోలె ప్రేమ' యని నే నుత్తరము పల్కితిని. అంతట శంకరసఖుఁడు 'ఈవనిత నిజమే చెప్పినది.' అని అందునుగుఱించి మహాకథ నొకటిం జెప్పెను. దాని నాకుం దెలిసిన సారాంశ మిది

యొకటి.—నీవే శౌనకుఁడవు శూద్రకుఁడవు కామపాలుండవును, బంధుమతి వినయవతి కాంతిమతియు నొక్కతెయే, వేదమతియు యక్షదాసియు సోమదేవియు నొక్కతెయే, హంసావలి సురసేన సులోచనయు ఒక్కతెయే, నందినియు రంగపతాకయు ఇంద్రసేనయు వేఱుగారు. శౌనకజన్మమందు నీవు అగ్నిసాక్షికముగా చెట్టపట్టిన గోపకన్యయే నేను, పిమ్మట ఆర్యదాసినై ఇపుడు తారావళినై యున్నాను. ఆబాలుఁడు నీవు శూద్రకుఁడవుగా నుండినప్పుడు ఆర్యదాసినిగా ఉండినట్టి నాకడుపున జనించినాఁడు. వానినపుడు స్నేహపాశము చేత వినయవతి పెంచినది. ఆసంబంధంబున ఆమెయొక్క యిప్పటిమూర్తి యగు కాంతిమతియందు ఇప్పుడు పుట్టినాఁడు. ఈవడువున పెక్కుమృత్యుముఖములనుండి తప్పి నాకు దొరకినట్టి వీనిని, ధనదుని పంపున, అటవిం దపసించుచున్న రాజహంసుని దేవి వసుమతికి చక్రవర్తి కాఁగలతత్సుతునికి రాజవాహనునికి పరిచర్యసేయుటకై అప్పన సేసి, తల్లిదండ్రులయనుమతి వడసి, దైవయోగంబున మృత్యువదనమునుండి తప్పించుకొన్నట్టి నీ యడుగుఁదమ్ములను గొలువ వచ్చినదానను.

ఇట్లని యాలించి ఆపలుపుట్టువుల రమణిని పలుమాఱు కౌఁగిలించి ఆనందబాష్పములు మొగంబున వెల్లిగొన మాటిమాటికి ఓదార్చి ఆసుందరి నిజప్రభావముచే నిర్మించిన మహామందిరంబున రేయుం బవలు భూలోకదుర్లభంబు లయిన భోగంబుల ననుభవించుచుంటిని. రెండుమూఁడు దినములు గడచిన యనంతరము ఆమత్తకాశినితో, 'ప్రియా, నాకు ప్రాణద్రోహి యగు నా చండసింహునికి ప్రత్యపకారముం గావించి పగతీర్చుకొన్న సుఖము ననుభవింపఁ గోరుచున్నాను.' అని హెచ్చరించితిని. అంత నాకాంత ఎలనవ్వొలయ, 'రమ్ము ప్రాణేశ్వరా, కాంతిమతిని చూచుటకు నిన్నుం గొనిపోయెదను.' అని వచించి అర్ధరాత్ర సమయంబున ఆ కేళిపడుకటింటికి నన్నుం గొనిపోయెను. అంతట వాని తలకడ నున్న కత్తిం గేలఁ గొని మేల్కొలిపి దడగొన్న యాతనిని ఇట్లు మందలించితిని.—'నేను నీయల్లుఁడను నీయంగీకారము లేక నీకన్యం గైకొన్నవాఁడను, ఆనాయపరాధమును అనువర్తనచేత మాపుకొనుటకు వచ్చినాఁడను.' అని. ఆతఁడు కడు బెగడి నాకు ఎదురు మ్రొక్కి 'నేనే మూఢుఁడను దోషిని, ఏల యన, నాకొమారితకు సంసర్గము ననుగ్రహించినవానికి నీకు పిశాచహతుండనుం బోలె మేర మీఱి స్వయముగా వధ మాజ్ఞాపించితిని. కావున కాంతిమతి యంతేఁ గాక, ఈరాజ్యమును నాప్రాణమును ఇప్పటినుండి నీ వసములు.' అని వచించెను. ఆమఱునాఁడు ప్రకృతులను రావించి యథావిధిగా కొమారితను నాకుం బెండిలిసేసెను. తారావళి కాంతిమతికి కుమారుని వార్తను, సోమదేవీ సులోచనేంద్రసేనలకు పూర్వవృత్తాంతమును వచించినది. ఈ

తీరున నేను మంత్రి యను పేర యౌవరాజ్య మనుభవించుచు నావిలాసినులతో విహరించుచున్నాను. —

ఇట్లు నాబోంటి జంతువులనుం గూడ సేవ నంగీకరించిన యా సర్వభూత బంధువు, క్షయచేత మామ స్వర్గస్థుండు అగుడు, పెద్ద బావమఱంది చండఘోషుండు స్త్రీలయందత్యాసంగముచేత క్షయచేత మున్నె మడియంగా, అయిదేండ్ల దరిదాపువయసుబాలునికి సింహఘోషుం డను చిన్నబావమఱందికి పట్టాభిషేకము చేయించినాండు. ఆసాధువు వీనిని యథావిధిగా పెంచినాండు. ఇప్పుడు జవ్వనంపుం బాగ రెక్కియున్న వీనికి కొండీండ్రు దుర్మంత్రులు కొందఱు దగ్గఱం జేరి మనస్సులోం దూఱి యిట్లు కఱపినారు.— 'బలాత్కారముననే నీయక్కను ఈభుజంగుండు హరించినాండు, పైగా నిద్రించుచున్న రాజును నఱుకుటకు కత్తియెత్తినాండు, అంత నాతండు భయంబున బతిమాలుకొని ఇతనికి కన్య నిచ్చినాండు. దేవర వారి యన్నను చండఘోషుని విషము పెట్టి చంపినాండు, దేవరను మాత్రము బాలుండితం డేమియుం జేయంజాలం డని యెంచి ఇప్పటికి ప్రకృతుల నమ్మకముకై ఒప్పరికించియున్నాండు. దేవరను గూడ ఈకృతఘ్నుండు చంపును. కావున దేవరయే వానిని యమపురమునకుం బనుప యత్నింపవలయును.' అని. ఈతీరున వారు మఱి చెఱిపినను వాండు యక్షిణీ ప్రభావమునకు వెఱచి ఆతనియెడ పాప మాచరింపం జాలకుండెను.

ఈదినములలో కాంతిమతీదేవి ఆకృతిలో తొంటి తీ రెడలి యుండం దిలకించి తేనిపట్టపుదేవి సులక్షణ యనునది ప్రేమతో నడిగెను. 'దేవీ, నన్ను ఒకటి యున్న మఱియొకటి చెప్పి వంచింప వలనుపడదు. చెప్పుము, ఏల యీ దినములయందు నీ వదనారవిందము ఎప్పటితీరు తప్పియున్నది.' అని. ఆమె యనియె. —'కల్యాణీ, ఇంతవఱ మున్నెప్పుడేనియు నిజము డాంగురించి నీతో నేను పలికినది అణుమాత్రమైన చెప్పంగలవా? విను. నాసఖియు సవతియు నైన తారావళి,ఏకాంతమున భర్త నాపేరం బిలువంగా అలిగి, ప్రేమబంధమును ఒప్పరికించి, మేము వల దని మ్రొక్కులిడుచున్నను, మత్సరము దాల్చి వెడలిపోయినది. మాపతి కృశించుచున్నాండు. ఆకారణంబున నామనస్సు సని లేకున్నది.' అని ఈవృత్తాంతము ఏకాంతమున సులక్షణ తనకాంతునికిం జెప్పినది. అంతట నితండు నిర్భయుండై యిప్పుడు, పాలియున్న యవయవంబులను, ధైర్యముచే నణంచుకొన్న కన్నీళ్లచే క్రుంగినకన్నులను, వేండినిట్టూర్పులచేత ఇగిరినవై అనతిమృదువులయిన వాక్కులను, లోని ప్రియతమావియోగ ఖేదమును తెలుపుచుండ, ఎట్లో దివాణమునందు రాచ

కార్యములను చేయించుచున్నట్టి యాసజ్జనుని మున్ను సంకేతము గొన్న పురుషులచేత పట్టించి కట్టించెను. ఆయనకు ఆయాయిఠాణాలయందు దోషమును చాటించి, మరణము కలుగులాగున కన్నులు పెకలింప వలసినదిగా ఆజ్ఞ చేసి యున్నాఁడఁట. ఈకారణంబున ఇట నేకాంతంబున ఇచ్చ తీఱ కన్నీరువిడిచి, ఆయనకన్నముందుగా ప్రాణంబులను వదలుటను గాకయని నడికట్టు కట్టుచున్నాను. —

నేను నాతండ్రికి సంభవించిన యాకష్టమును విని కన్నీళ్లు వెల్లివొడువ నిట్లంటిని. 'సౌమ్యుఁడా, నీవు చాఁప నేల? ఆయనకుమారుఁడైన యేబుడుతని యక్షకన్య రాజవాహనదేవుని పాదశుశ్రూషార్థము వసుమతీదేవిచేతిలో నుంచినదో వాఁడనే నేను. విచ్చుకత్తులతోడి వేగుల మాస్టీలనయిన పరిమార్చి నాయనను విడిపింపనేర్తును. కాని దొమ్మిలో నెవఁడేని ఆయనశరీరమందు కైదువు వయిచెనేని నాప్రయత్నమెల్ల బూడిదలోని హోమమువలె వ్యర్థమగును.' ఇట్లు నేను అనుచుండఁగానే ఒక గొప్పపాము ప్రాకారబిలమునుండి తల వెలుపలి కెత్తెను. దానిని నేను మంత్రౌషధ బలముచేత కట్టిపట్టి పూర్ణభద్రునితో వచించితిని—. భద్రా, మన కోరిక సిద్ధించినది. దొమ్మిలో తనంతటఁ గాక తాళీయముగా వచ్చి కఱచిన దనునట్లుగా దొమ్మిలో ఈపాముచేత నాయనను కఱపించి మృతుఁడని ఒప్పరికింపఁబడునట్లుగా విషమును కట్టివైచెదను. మఱి నీవు భయము మాని మాయన్నను హెచ్చరింపవలయును. "యక్షి కొనిపోయి వసుమతీదేవిచేత నప్పగించిన నీ కొమారుఁడు వచ్చియున్నాఁడు. తండ్రి దశను నావలన విని బుద్ధిబలంబున నిట్లు చేయుచున్నాఁడు. నీవు భయము మాని రాజునకు ఈవార్త పంపుము. 'బంధువు అన్యుఁడు అను భేద మెంచక దుష్టుని దండించుట క్షత్త్రియధర్మము గదా. అట్లే దుష్టుఁడు గాని అదుష్టుఁడు గాని భర్త పోయినదారింబోవుట స్త్రీధర్మము, కావున నేను ఈతనితోఁగూడ సాదచిచ్చుం జొచ్చెద. నాపుట్టిన వంశమునకుం దగిన యీకడపటి విధికై నాకు అనుజ్ఞ యీవలయును.' అని. ఇట్లు నివేదించిన అతఁడు తప్పక అంగీకరించును. అంతట ఆయనను నీయింటికే కొనిపోయి చుట్టుం దెరలు గట్టిన నిజనప్రదేశమందు దర్భపఱుకపయిం బరుండఁబెట్టించి, సహమరణాలంకృతవై నీవు స్వయముగా నచటికి వచ్చియుండవలయును." అని. నేను బయటి తోఁటికట్టులో నుండెద. నన్ను నీవు లోపలికిం బ్రవేశపెట్టుము. తర్వాత నాయనను బ్రదికించి ఆయనకిష్టమయిన యుపాయముచేత వ్యవహరింతము.—అని.—అతఁడు వల్లెయని పరమసంతోషముతో వెడలి పోయెను.

నేను ఒక చాటింపుచోట కడుదట్టంపు పెద్దకొమ్మల చింతచెట్టెక్కి ఎవరికిని అగపడక యుంటిని. లోకులు వారివారి కలవడిన యున్నతస్థానముల నెక్కి పలుదెఱంగుల

భాషించుచు నుండిరి. అంతట దొంగనుంబోలె పెడరెక్కలు గట్టి, మానాయనను పెల్లుగా గోల్లుసేయుచున్న పెద్దజనసంఘము కూడ వచ్చుచుండఁగా తెచ్చి, నాచెంతనే యుంచి, మాతంగుఁడు ముమ్మాఱు చాటెను. "ఈకామపాలమంత్రి రాజ్యలోభము చేత పెద్దదొరను చండసింహుని యువరాజును చండఘోషుని విషాన్నముచేత రహస్యముగా చంపించి, ఇపుడు దొర సింహఘోషుఁడు నిండుయౌవనముం బొందినాఁడని యాతనియెడ ద్రోహ మాచరింప నుద్యుక్తుఁడై, నమ్మకముచేత రహస్యములో శివనాగమంత్రిం జేర్చుకొని, స్థూణుని అంగారవర్షుని రాజమార్గణార్థము నియోగించి, వారు ముగ్గురును స్వామిభక్తిచేత ఇతని రహస్యమును బయటఁ బెట్టఁగా, 'రాజ్యకాముఁడయిన యీబ్రాహ్మణునికి అంధతమసప్రవేశము న్యాయ్య'మని వ్యవహారనిర్ణాయకులు చెప్పఁగా, కన్నులు పెఱుకుటకై వధ్యభూమికి నడిపింపఁబడుచున్నాఁడు. ఇతరు లెవరేని ఇట్లు అన్యాయ్యవృత్తి నవలంబింతురేని వారిని గూడ రాజు ఈవిధముగానే దండించెడిని." అని. ఈచాటింపు విని మహాజనము కోలాహలము సేయుచుండఁగా, నేను, పడగం గరలించి యాపామును నాయన దేహమున వైచితిని. భయపడినవాఁడనుగా దుమికి అచటనే జనులలో మఱిఁగినవాఁడనై ఆపెనుఁబాము కోపంబునం గఱచిన నాయనప్రాణమును కాపాడి విషమును క్షణములో కట్టివైచితిని. అంత నాయన చచ్చినవానివలె నేలం గూలెను. 'రాజావమానిని దేవుఁడె దండించు నన్నమాట తప్పదు; అతనికి కన్నులు తివియింపవలయు నని రాజు తలంపఁగా, విధి ప్రాణములనే ఎడలించినాఁడు.' అని నేను ప్రలపించితిని. నామాటను కొందఱు ఒప్పుకొనిరి, కొందఱు నిందించిరి. పాము తలారిని కూడ కఱచినది; జనులు భయపడి ఇటునటుం బఱచి దారి యీయఁగా పారి పోయినది.

అంతట మాయమ్మ పూర్ణభద్రునివలన కార్య మెఱింగియున్నట్టిది, అట్టి యామహావ్యసనమందు ఎక్కువ బెగ్గడిల్లనిదై, కులపరిజనులుతోడ నరుదేఁ, కాలినడకను తెంపుగా వచ్చి మానాయనశిరమును ఒడిలో పెట్టుకొనియుండి, రాజునకు తెలియఁబఱిచెను.— 'ఈయన నాభర్త, నీకు అపకారము యగునో కాదో ఆమాట దైవమునకే తెలియును. అవిచారముచేత నాకు ఫలము లేదు. నాభర్త యగునీతనిగతిం బోనేని నేను నీకులమునకు మచ్చం దెత్తును. కాన భర్తతోఁగూడ చిత యెక్కుటకు నాకు అనుజ్ఞ యీఁదగుదువు.' అని. ఆప్రార్థన విని ప్రీతుండై రాజు 'కులమునకు తగిన సంస్కారము చేయవచ్చును. నా యక్కపెనిమిటి విభవాతిశయముతోడి యంత్యసంస్కారమును పొందునుగాక.' అని బదులువార్త పంపెను. మంత్రవాదు లెల్ల చండాలుని బ్రదికించుటకై చేసిన

ప్రయత్నములను నేను విఱుపు సేయఁగా వాఁడు మృతిఁ జెందెను. అందువలన కామపాలుఁడును చచ్చినవాఁడే యని నిశ్చయించుకొని రాజు తన గొప్పతనమును చూపుకొనుటకై అతనిని అతనియింటికి కొనిపోవచ్చు నని సెల విచ్చెను. అంతట మానాయనను తెచ్చి విజనంబున దర్భశయ్యపై పరుండఁ బెట్టిరి.

అంతట మాయమ్మ చావుకై కైసేసికొని కరుణముగా చెలులవలన వీడుకోలు గడిసి వెండియు ఇలువేల్పులకు మ్రొక్కుకొని, పరిజనుల పరిదేవనములను పూనికతో నాఁపి, ఏకాకినియై నాతండ్రి పరున్నతావునకు వచ్చెను అట ముందే నేను పూర్ణభద్రునివలనం బ్రవేశించి వైనతేయుండనోయన నాతండ్రివిషమును నిర్విషముం జేసి యుంటిని. ఆమె వచ్చి యట్లు స్వస్థుఁడై యున్న నిజభర్తం గాంచి పట్టరానిహర్షంబున కన్నీటి సోలు ఉబ్బుచున్న మొగంబుతో సొలిఁద్రు చేఁప మాటిమాటికి నన్ను అక్కునం జేర్చి ఆనంద బాష్పములవలని డగ్గుత్తికతో వచించెను.— "పట్టీ, పాపాత్మురాలను నేను నిన్ను పుట్టిన వెంటనే విడనాడితిని. అట్టి యాచట్టుగుండెదానిని నన్ను ఏల యనుగ్రహించెదవు? కాదు, నే నట్టిదాన నయినను నీతండ్రి యీయన నీయెడ నిరపరాధుఁడే. కావున ఈయనను యముని నోటినుండి వెలికి దెచ్చుట యుక్తమే. కూళ గదా తారావళి, నిన్ను యథాతత్త్వము కుబేరునివలన విన్నదయ్యును నా కియ్యక దేవికి వసుమతికి ఇచ్చినది. అది చేసిన పనియు పొసఁగఁబాలు గాదు. అట్టిభాగ్యరాశికిఁ గాక నాబోంటి పుణ్యహీన జంతువునకు నీ తియ్యని ముద్దుమాటల యమృతమును వీనులారఁ ద్రావఁ గలుగునా? రా, నన్ను కవుఁగిలించుకొమ్ము." అని పల్కుచు ఔదల మూర్కొనుచు ఒడిలో గూర్చుండఁ బెట్టుకొనుచు తారావళిం దెగడుచు కన్నీళ్లతో నభిషేకించుచు ప్రక్కదలినమైదీవియతో ఇంచుక సేపు వేఱుతీరుగా నుండెను.

నాతండ్రియు నరకమునుండి స్వర్గమునకుంబోలె అట్టి యామహాపదనుండి ఇట్టి మహాభ్యుదయమును పొందినవాఁడై, జరిగిన వృత్తాంత మెల్ల పూర్ణభద్రుని ముఖమున వివరముగా విని, మహేంద్రునికన్న తా నదృష్టవంతుఁ డని తలంచుకొనెను. నాసంబంధమును ఇంచుకయే చెప్పినవాఁడనై, సంతసముచే రిచ్చవడి యున్న యాతల్లిదండ్రులను 'ఇప్పుడు మనము ఏమిసేయవలయునో ఆనతిండు' అని యడిగితిని. నాయన చెప్పెను.— "పుత్త్రా, మన యీయిల్లే చుట్టును అతివిశాలమయిన ప్రాకారమును తెలుఁగని కైదువుల సముదాయంబులును కలిగియున్నది. ప్రహరి దాఁటిరా వలవి గాదు. నావలన నుపకారములం బొందిన సామంతరాజులు పలువురు కలరు. ప్రకృతులు పెక్కురు నాకష్టము వొల్లరు. జోదులు వేనవేలున్నారు. మిత్త్ర పుత్త్ర దారసమేతముగా నిచ్చటనే కొన్ని

దినములుండి బాహ్యాభ్యంతరకోపములను లేకపుదము. లేఁగికవారిని చేరఁదీసికొని ప్రోత్సాహ మెట్టి వీని ప్రకృత్యమిత్రులను సహజశత్రువులను లేపి ఈకావలుని వెలార్చుదము.'' అని. 'ఇందు చెఱు పేమియు లేదు, అట్లే చేయుదము' అని నేను నాయనయాలోచన నంగీకరించితిని.

అతీరున మేము మాయాపదం దొలఁగించుకొని యుండఁగా, రాజు వృత్తాంత మెఱిఁగి, చింత నహించి, విశేషించి మావిూఁద ముట్టడి లోనగు ప్రయోగముల నడపించి నాఁడు. దినదినము మేము వానిని అణఁగఁగొట్టుచుంటిమి. ఈసమయములో నే పూర్ణభద్రుని వలన తెలిపదూకతావు నెఱిఁగి వెంట నే నాయున్నయింటి గోడయూలనుండి సొరంగము త్రవ్వితిని. అది నన్ను బహుకన్యకాజనసంకీర్ణమును భూలోకస్వర్గమువంటిదియు నగునొక తావునకుం గొని పోయినది. నన్నుఁ జూచఁగా నే ఆస్త్రీలు వెఱఁజెందిరి. అట చంద్రలేఖ వోలె తన మేనిజగ్గుజిగిచేత పాతాళాంధకారమును పటాపంచలు సేయుచు, మూర్తిం దాల్చిన భూదేవియో, అసురుల నోర్వఁ గెగి వచ్చిన దిగ్గనో, పాతాళమునను వచ్చిన ప్రాపులు కాని ప్రాయములో, మెఱుఁగు చదురాజాలం జూడనొల్లక నేలబిలమునం జొచ్చిన రాజ్యలక్ష్మియో, యన, పుటములు దీరన జాళువాబొమ్మ వోలె, పసిమిమిసిమి పిసాళింప, నొకకన్నియ దక్కఁ నంపుఁగనువలిచేత గంటపుఁదీఁగవోలె నాదర్శనము చేత కంపిల్లెను. అట్లుయున యూ వెలందుకలు బ్రాంతిచెంబునందు, పూవిన తెల్లుపోల తెల్లని తలవెండ్రుకలది ముదుసలి యొక్కతె నాయెదుగులం ద్రెళ్లి భయముచే డిందుపడుచు వచించెను :—'ఒందు రక్షకులు లేని స్త్రీలకు మాకు అభయ మిమ్ము. దానవులతో పోరాడ వేఁడి పాతాళముం జొర వచ్చిన దేవకుమారుఁడవా ? అనలిమ్ము, నీవెవరవు ? ఏమికతమున నిటకు నరుదెంచితివి?' అని. నేను ఆమెను బదులుపల్కితిని. 'మీరు భయపడవలదు. నేను ప్రసిద్ధుఁడయిన కామపాలునికి కాంతిమతీదేవియందు జనించిన సుతుఁడను, నా పేరు అర్థపాలుఁడు. ఒక పనిమీఁద నాయింటినుండి తేనియింటికి సొరంగముగుండ పోవుచు నడుము మిమ్ములం గంటిని. మీ రెవరో చెప్పుము ఇట నివసింతు రేల?' అని. ఆమె మోద్పుఁగ లెత్తి యిట్లు వాక్రుచ్చెను.

"యువరాజా, మేము భాగ్యవంతురాండ్రము, ఏల యన, నేమమున, నిన్ను మేము ఈకన్నులతో నే కంటిమి. విను.—నీ తల్లిదండ్రి చండసింహునికి ఈలీలావతీదేవియందు చండఘోషుఁడును కాంతిమతియు నని యిరువురు బిడ్డలు కలిగినారు. యువరాజా చండఘోషుఁడు మగువలతోడి బలితంపుఁ దగులంబునం జేసి క్షయరోగమునం బడి కాలధర్మము నొందెను; అప్పుడు అతనిదేవి యాచారవతి చూలాలుగా నుండెను. పిమ్మట

నామె మణికర్ణిక యను నీకన్నియం గని కాన్పునొప్పిచే కాంతుని చెంత కేఁగినది. అంతట రాజు చండసింహుఁడు నన్ను పిలిపించి ఏకాంతమున ని ట్లాజ్ఞాపించెను. —'బుద్ధిమతీ, ఈకన్నియ శుభలక్షణములు గలది. దీని పెంచి మాళవరాజతనూజునికి దర్పసారునికి ఈఁదలంచియున్నాను. కాంతిమతి యట్లుగనది మొదలు కన్యలను ప్రకటముగా నుంప వలయుచున్నాను. కావున శత్రువులను కనుఁబారిమి వసించుటకై కట్టడపుఁ గ్రీడా పర్వతములతోను పర్వతమునందుఁ దొలిచిన పలుమండపములతోను నాటకశాలతోను కట్టించిన విశాలపు నేలమాళిగయందు నిండుపరివారముతో నీవు ఈకుమారిని పెంపవలయును. ఇందు భోగార్హ మయిన వస్తుజాతము నూరేండ్లభోగముచేత నయినను తఱుఁగనంత కలదు.' అని. ఇట్లు చెప్పి తనపడుకటింట గోడపంపులో మూరెఁడు విరివిగల ఱాతిమూఁతను ఎత్తి ఆద్వారముగుండ మమ్ములను ఈతావునం బ్రవేశపెట్టినాఁడు. ఇచట వసించు మాకు ఇప్పటికి పదునేఁడు సంవత్సరములు కడచినవి. ఈ చిన్నదానికి యౌవనము వచ్చినది. ఇప్పటికిని రాజు స్మరింపకున్నాఁడు. ఈకుమారిని తాత దర్పసారునికి ఇయ్య సంకల్పించినను, మీతల్లి కాంతిమతి, ఈమెను కడుపులో నుండఁగానే జూదములో గెలుచుకొన్నది. ఈమెతల్లి ఈమెను నీకె భార్యగా సంకల్పించినది. కావున ఈ విషయములో కుమారా, నీవే తగినయాలోచన చేయవలయును.'' అని.

నేను వెండియు ఆమెతో 'ఇప్పుడె యీరి యింట ఒకపని సాధించుకొని, మఱలి వచ్చి, మీవిషయములో తగిన యాలోచన చేసెదను.' అని చెప్పితిని. దీపపువెలుతురున ఆరంధ్రపుదారినే పోయి అర్ధరాత్రసమయమున ఆఱాతిబల్లను పైకెత్తి, పడుకటింట్లు సొచ్చి నిశ్శంకముగా నిద్రించుచున్న సింహఘోషుని ప్రాణములతో పట్టుకొంటిని. పట్టి యీడ్చి పామును గరుత్మంతుఁడువోలె మిడియుచున్న యాతనిని ఆగోడబొక్క దారనే స్త్రీలుండు కడకుం దెచ్చితిని. మాయింటికిం గొనిపోయి ఇనుపసంకెలతోఁ గట్టిన యడుగుదోయితోను వంచుకొన్న మలినముఖముతోను కన్నీరు వఱ్ఱువడిన యెఱ్ఱనికన్నులతోను డిరిపిల్లుచున్న యారాజును ఏకాంతంబున నాతలిదండ్రులకు చూపించితిని. బొక్కకథను చెప్పితిని. అంత నాతల్లిదండ్రులు అత్యంతసంతుష్టులై ఆసాహసోద్యముని చూచి చెఱలో కట్టి యుంచి, ఆకుమారిని యథావిధిగా నాకుం బెండిలిసేసిరి. నాథుఁడు లేని యారాజ్యము మాస్వాధీనమే అయినది. ప్రకృతులు కోపంతు రనుభయంబున నాతల్లి విడిపింపఁ గోరినను సింహఘోషుని విడువమైతిమి. అట్లుండి మేము అంగరాజు సింహవర్మ దేవరవారికి భక్తుఁడును పనిచేసినవాఁడును అగుటంజేసి, శత్రుఁడు పైనెత్తిన యితనికి సాహాయ్యము సేయుటకై వచ్చినాము. అట్లు నేను నీపాదపద్మముల పుష్పాదిప్రసాదమునకుం బాత్రు

ము నైతిని. ఆ యనార్యుఁడు సింహఘోషుఁ డిపుడు సకలపాపప్రాయశ్చిత్తముగా నీపాదములకు ప్రణామము నాచరించుఁ గావుత. ఇట్లు వక్కాణించి యర్థపాలుఁడు రాజవాహనునికి కేలు మోడ్చి నమస్కరించెను.

రాజవాహనరాజు 'మిక్కిలి పరాక్రమించితివి, బుద్ధిని మిక్కిలి యుపయోగించితివి. నీమామను కట్లు విడిపించి మాదర్శనమునకుం దెమ్ము.' అని వచించి, తర్వాత ప్రమతినే కాంచుచు ప్రీతితో నవ్వుచు 'నీచరిత్రము వచింపుము.' అని ఆజ్ఞాపించెను. ఆతండును ప్రణమిల్లి విన్నవించెను.



## పంచమోచ్ఛ్వాసము.

### ప్రమతిచరితము.

దేవరా, నిన్ను వెదకికొనుచు దిక్కులం దిరుగుచు, సంధ్యముదిసూర్యమండలమును లేఁజివురుంగా కోనచేవియందుఁ దాల్చినదై పడమటిదిక్కు గాంతమొగము శోభిల్లుచున్న సమయంబున నే నొకనాఁడు నింగి కొరయున దైనను పింజము ప్రక్కమొలచిన యొక చెట్టుక్రింద పడియనీట ఆచమించి సందె వార్చి మెఱుకపల్లములు చీఁకటిచే నిండినను కాఁగా మఱి నడచుటకు అశక్తుఁడనై నేలపై చివుళ్లతో పక్క పఱచుకొని పరుండఁబోవుచు శిరమున నంజలిం జేర్చి 'ఈచెట్టునందు ఏవనదేవత నివసించుచున్నదో ఆదేవతయే ఘూకతుకపన్నగమండలీసంచారభయంకరంబై శంకరకంఠనీలనిశాంధకారపూరంబుచే బూరటించుచున్న లోఁతుగవులుగోడి యీమహారణ్యంబున ఒంటిగా నిద్రించిన నాకు శరణము.' అని వేఁడి ఎడమచేయి తలగడగా పెట్టుకొని పరుంటిని. అంతట కొంతములో, భూలోకదుర్లభ మయిన స్పర్శచేత నా యవయవములకు సుఖము గలిగినది. ఇంద్రియము లాహ్లాద మొందినవి, అంతరాత్మ సంతసించినది, మెల్లగా మేనం బులకలు పొడమినవి, కుడిబుజ మదరినది. ఇదేమని మెల్లమెల్లన కను విచ్చి చూడఁగా, పెదనామయొడనుండి కత్తిరించి తెచ్చిపెట్టినదో యన స్వచ్ఛ మయిన వెలిపట్టుపుట్టంపు మేలుకట్టు గానంబడియెను. ఎడమప్రక్కకు చూపు నిగిడింప మేడగోడకడ తివాసిపయిం బరుండి కడునెమ్మదిగా గాఢముగా నిద్రించుచున్న యింతుల బంతి గానవచ్చెను. కుడిప్రక్కకు మరలి చూడఁగా, పైఁట యెడలి అమృతంపు నురువుమొత్తముంబోని తెల్లని సానుపునందు పరుండి ఆసివరాహుని కోలడాలుపై సొక్కడలి యానెడి వెలిపట్టు వలిపంపుఁ బయ్యెద యెడల బలువెఱపున మూర్ఛిల్లి వ్రాలియున్న ధరణియుంబోలె

తోఁచుచున్నట్టిది, ముఖతామరస పరిమళమును వెదచల్లుచున్న యూర్పు గాలి ఎఱ్ఱని మోవికెంపునిగ్గు లనెడి లేఁజివుళులను నాట్య మాడించుచున్న తీరుచేత ముక్కంటికంటి మంటవలన మిణుంగుఱుమాత్రముగా మిగిలిన యనంగుని రగులఁ జేయుచున్నదియుం బోలె నొప్పారుచున్నట్టిది, లోన నిద్రించుచున్న తేఁటిదంపతులతోడి నెత్తమ్మియుం బోలె నిదుర గూరి కనుఁగలువలు మూఁతవడి యున్న నెమ్మోముతోడిది, దుండగంబున నైరావణమతంగజము ద్రెంపి క్రింద వైచిన నందనవనంపు టీఁకమ్రాని పూఁదెమ్మయో యన తేజరిల్లుచున్న యొక తరుణీమణి కనువిం దొనర్చెను.

అంత నిట్లు తలపోసితిని.— 'ఆ మహారణ్య మెటఁ బోయినది! బొమ్మగుడ్డు లోని మైడొల్ల నొరయుచు చండికాధ్వజశిరంపుశూలమునంతటి యెత్తయిన యీ మేడ యటనుండి వచ్చినది? అడవి నేలం బఱచుకొన్న యాచిగురాకుల పఱుక యేది? పండు వెన్నెల ముత్తము వోలెఁ బ్రాలుచున్న దుకూలముతోడి యీహంసతూలికా తల్ప మెక్కడిది? చలివెలుఁగు వెలుఁగుల వెండిచేరుల యుయ్యెలనుండి జాఱి పడి సొమ్మ సిల్లిన యచ్చరముచ్చెకఁటుల పిండన నొప్పుచు సుఖసుప్తమై యున్న యీసుందరీ బృందము ఏటిది? ఈతరుణి ఎవతె? శ్రీదేవి వోలె పద్మహస్తయై శరత్కాలపుఁ జంద్ర మండలముం బోని యచ్చంపు తెలిడాలు దువాళించు వలిప దువ్వలువ పఱచిన యీతలి మము నధిశయించి యున్నది. ఈబోటి తెలుఁగంటి జోటి యేమో గాదు; ఏల యన మెల్ల మెల్లన వలువదొరఁ జెలుఁగులు ఒత్తుమండ తమ్మితీవయుంబోలె నిద్రించుచున్నది, విఱిగిన తొడిమనుండి స్రవించుచున్న పాలబొట్టులచేత పలువన్నెలు చెన్నుమీఱిన పాండు వర్ణపుమామిడిపండువలె గండస్థలము పొటమరించిన చెమరుజాలతోడ కనుపట్టు చున్నది; క్రొత్తజవ్వనము చొత్తెంచుటఁజేసి హత్తిన నిబ్బరంపు వెచ్చనచే పాలిండ్ల మీఁది కలపము వన్నెమాఱి యున్నది; వలువలు రెండును నలఁగువడం దిగినయట్లు వన్నె మాసియున్నవి. కావున నీ చాన మానుషియే. భాగ్యవశంబున అననుభూతయౌ వనగా నున్నది; అది యెట్లన.— అవయవంబులు నెఱ సుకుమారత నొందియు చిక్కనం బోలెఁ జూపుచున్నవి. మేనిజగ్గు తద్దయు నిద్ద మయ్యును పాండుతం బొరయక యు న్నది. కెమ్మోవి పలుగాటు గాసి నెఱుంగమిచే అసతిస్ఫుటరక్తిమమై పవడంపుడంబు ఒడఁబింపుచున్నది; చెక్కిలి అంతగా నిండు గాక, మూలంబున ఇంచుక యెఱుపు గలిగి సంపెంగమొగ్గ మదిరినరేకువోలె నున్నది; నిద్రయు తియ్యవిల్తుని కోలపాటు భయము మెఱుంగక నెమ్మదిగా సుమాళమ్ముగా నున్నది; మఱి యీ యక్క కనికర మేదిన పిసికిళ్ల నెఱుంగమింజేసి మొగములు సప్పటలు పడని చనుఁగవతో

చెన్నారుచున్నది. పెద్దల సదాచారమును జవదాటని నామదికి ఈ ముద్దియపై తగులు గలుగుచున్నది. తగులమునకుం దగినట్టులు కవుంగిలింతు నేని నిక్కముగా ఆగ్రహము చేయుచు నిద్ర మానును. మఱి కవుంగిలింపక ఊరక పరుండుటకు నాకలవిగా కున్నది. కావున ఏమయిన నగుంగాక; అదృష్టమును పరీక్షించెదను.' ఇట్లు తలపోసి తాంకియుం దాంకక వెనగొన్న రాగభయములతో నిద్రితునియట్లు ఉంటిని.

ఆముగుదయు తనమేని యొడమ పార్శ్వము అదరుచు నగుర్కొనుచు సుఖించుచుండ, అల్లనల్లన ఒడలు విఱుచుకొనుచు, జడను విడుచున్నయంగములతో, అదరుచున్న కొనకెప్పలును బడలిన సోమరితారకలును దొరంబండిన నిదురచేత కెంపెక్కిన క్రేగంటిసొంపు పెంపునం జెన్నొందిన కనుంగవ దెఱచుచు, భయాద్భుత హర్ష ప్రేమ సంశయ విలాస విభ్రమముల చాటున ఏమేమో వాకొన నలవిగాని నానచెయ్దములను అద్భుతప్రభావుండైన కామదేవుని యాచార్యకంబున నవశతం గావించుచు, పరిజనమును మేల్కొలుపం గడంగిన యెలుంగును సూనబాణుండు పూనినందున వసము దప్పిన హృదయమును భయాయాసములచే గ్రొంజెమటం గ్రొంబులకలుం బొటమరిల్లుచున్న యవయవములను ఎట్టకేలి మట్టుపఱచి, ఆసమయ నాయంగంబులను మనోహరముగా ముప్పాలిక మూసిన కంటిని మెలమెల్లన నిగిడ్చి నిర్వర్ణించి, మునుమెయిం గడు నెడసేసియు ఆ సెజ్జయందే కొంతపాటుతో పవ్వళించియుండెను. అంతట ప్రేమావేశతరళిత హృదయుండనయ్యు నెట్లో వేండియు నిదురపాలయితిని. మరల సైంపని తాంకుడుచే నొడలు నోయుడు మేల్కొంటిని. మేల్కొని చూడ ఆమహారణ్యమే ఆచెట్టుక్రింది నేలయే ఆధారముం బడుకయే నాకు ఉండెను. రాత్రియు తెల్లవాఱెను అంత నామనంబున ఈ చింత వొడమెను — 'ఇదేమి కలయా? ఏదేని మోసమా? మఱి యేదేని ఆసురికమో కాక అమరికమో మాయయా? ఏమయిన నగుంగాక; దీని తత్త్వము నెఱుంగక యీనేలపడుకను నేను వదలను; ఇప్పటి దేవతకు ప్రాణాచారము పడి యుండెదను.' ఇట్లు నిశ్చయించుకొని యుంటిని.

అంతట ప్రొద్దువెలుంగులకు కములిన కలువదండవలె వాడిన దేహయష్టితో నలుంగుడుం జెందిన జీబుపయ్యెదతో- నొక సీమంతిని—లత్తుక పూంత హత్తమింజేసి కఱకైపాటలిమం బొరసియు ఊర్పువేండిచే డాలు చీలికలు వాఱియు నున్న మోవి చేత కపిలవర్ణంపుం బొగతోడి కప్పుబెట్టువిపోసలమును వెలిగ్రక్కుచున్నదియుం బోలెను, వాఁగక కన్నీటిధారలు రాలుచుటవలన నెత్తురుమాత్రము మిగిలెనా యన నెఱ యొఱుపుం జెందిన కనుంగవతో, ఒక్కటియుగా జడకట్టిన దైవలస్త్రీ నడుమడిని పదిల

ముగాఁ గట్టి పెట్టెను త్రాడు నా నొప్పు కేశకలాపముచేత నీలి వలువగవుసెన దొడిగిన సంచరించుచున్న పతివ్రతాపతాకయుం బోలెను, ఎంతేఁ జిక్కియు వేల్పుఁదనంపుఁ బరిభావంబునం జేసి లావణ్య మంతగాఁ దఱుఁగనిదై నాకుం బ్రత్యక్షమై, ప్రణమిల్లిన నన్ను హర్షోత్కర్షంబున వణంకుచున్న రెండు చేదీవియలతోను లేవనెత్తి, కొడుకునుం బోలె అక్కునం జేర్చి, శిరంబు మూర్కొని, చేఁపినచనుఁగవచేత పాలమిషంబున వాత్సల్యంబునుం బోలెఁ గురియుచు, చల్లని కన్నీళ్లు నిండుకొన్న కంఠముతో పేరిమడగ్గుత్తికతో వక్కాణించెను. —

'పట్టీ, మగధరాజుపట్టపుదేవి వసుమతి 'నా చేతిలో బాలుని అర్థపాలుని పెట్టి తనభర్తృపుత్త్రిసఖీజనులను గూర్చి కుబేరుఁడు చెప్పిన కథ యొకటి చెప్పి అంతర్ధాన మయినది మణిభద్రుని కొమారిత' అని మీతో చెప్పియుండెనేని, నేనే దానను మీతల్లిని. ధర్మపాలుని కొమరుఁడును సుమిత్త్రుని తమ్ముఁడును అయిన మీతండ్రి కామపాలుని పాదములకడనుండి నిష్కారణముగా కోపము దాల్చి కలుషితహృదయనై లేచి పోయి పశ్చాత్తాపదుఃఖితనై కలలో ఎవఁడో ఒక రక్షోరూపునిచేత 'భర్తను విడనాడి వచ్చినందులకై దుఃఖించుకొనుటకు అతికోపనవైన నిన్ను ఒక్క-సంవత్సరము పట్టెదను.' అని శాపముం బొందితిని. అట్లు చెప్పుచునే వాఁడు నన్నుం బూనెను. నేను మేలుకొంటిని. వేయేండ్లయంత దీర్ఘమయిన యాసంవత్సరకాలము కడచినది. నిన్నటి రాత్రి శ్రీవస్తిలో దేవదేవునికి ముక్కంటికి జరుగుచుండిన యుత్సవమును తత్సమాజమును అనుభవింపను, అటకు నానాస్థానములనుండి వచ్చిన బంధువులం గాంచను, శాపము తీఱి, భర్తకడకు అరుగనుం, దివిరి, నేను తరలఁగా నే, నీ విట కేఁగుదెంచి 'ఇచ్చటి దేవతను శరణుఁ జొచ్చితిని' అని వేఁడి నిద్రించితివి. అట్లు శాపదుఃఖము సోఁకియున్న నేను నిన్ను తాత్త్వికముగా నెఱుంగనైతిని. అయినను శరణాగతుని నిరంతరాపద్భూయిష్ఠం బగు నీ యరణ్యానిలో వదలి పోవుట సరిగాదని నిన్నును నిద్రితునే నాతోఁ గొనిపోయితిని. ఆదేవళముం దఱిసినంత 'ఈతరుణునితోఁ గూడ ఉత్సవసమాజమున కెట్లు పోవుదును?' అని నామదిని తోఁచినది. అంతట ధర్మవర్ధనుఁడని యథార్థనాముఁడయిన శ్రీవస్తీనాథుని కన్య నవమాలిక యనునది వేసవికాలమునకు అనుకూలమయిన కన్యాంతఃపురమున ఏడంతస్తులమేడమీఁద విశాలకోమల శయనమందు శయనించియుండుటను యదృచ్ఛగాఁ గని 'ఆహా! ఈ బాల నిద్రలో నున్నది! పరిజనంబును గాటంపు నిదురలో మునింగియున్నది. నేను నాపని తీర్చుకొని వచ్చువఱకు ఈబ్రాహ్మణకుమారుఁడు రెండుగడియలతడవు ఇట నిద్రించుచుగాక.' అని నిన్ను అట పరుండఁబెట్టి ఆదేవళముకడకుం బోయితిని.

ఉత్సవవిభవమును గని నాబంధువులం గను సుఖము ననుభవించి ముల్లోకముల యీశ్వరునికి మ్రొక్కి, నా నేరమిని స్మరించుకొని అందువలన నగ్గలించిన భయంబుతోడ భక్తపరాధీన హృదయను అంబికాదేవిని నమస్కరించితిని. దేవి చిఱునగవుతోడ 'ఓసి కల్యాణీ, భయపడకు, ఇప్పుడె నీ భర్తపజ్జకుం బొమ్ము; నీ శాపము తీఱినది.' అని వర మొసఁగా, తత్క్షణమే నామహిమ లెల్ల రాఁగా, మగలి వచ్చి నిన్నుం గని సరిగా ఆనవాలుపట్టి, 'ఏమి ఇది! నాకుమారుఁడే వీఁడు! నాకుమారునికి అర్భపాలునికి ప్రాణసఖుఁడు ప్రమతి. అతిపాపాత్మురాలను నేను తెలియక వీనియెడల ఔదాసీన్యముతో వర్తించితిని. మఱి వీఁడు దీనియందు మనస్సు తగిలించియున్నాఁడు. ఈకన్యయు ఈతరుణుని వలచియున్నది. ఇరువురును నిద్రించుచున్నట్లు పయికి అగపడుచు మెలఁకువగానే యున్నారు. సిగ్గుచేతనో భయముచేతనో ఒకరిభావము నొకరికి తెలుపుకొనకున్నారు, నేను పోవలసియున్నది. మరలు సోఁకిరియు ఈకన్య గుట్టు బయటఁ బడు నని సఖీజనమును గాని పరిజనమునుగాని పలుకరింపకయున్నది. కుమారుని ఇప్పటికి కొనిపోయెదఁ గాక. పిమ్మట ఈయర్థమును వీఁడే గుర్తెఱిఁగి తగినయుపాయంబులచేత సాధించుకొనును.' అని తలంచి నాప్రభావముచేత నిన్ను నిదురఁబుచ్చి ఈ యూకుఁబడుకకే తెచ్చితిని. ఇది యిట్లు జరిగినది. నే నిప్పుడు నీతండ్రిపాదముల కడకు పోయెదను." అని వచించినది. అంజలి చేసిన నన్ను మాటిమాటికి కవుంగిలించుకొని ఔదల మూర్కొని చెక్కిళ్లు ముద్దాడి ప్రేమచే డిల్లవడి వెడలిపోయెను.

నేనును పంచబాణుని పాలం బడి శ్రావస్తికి తరలితిని. దారిలో నొక గొప్ప బచ్చుపేటలో పౌరుల కోడిపందెముల కోలాహలము పెల్లుగా నుప్పతిల్లినది. నేనును అటం జేరి యించుకగా ఎలనవ్వు నవ్వితిని. నాప్రోలఁ గూర్చున్న ముదివిటుఁ డొకబ్రాహ్మణుఁడు మెల్లగా నానవ్వునకుం గారణ మడిగెను. నేను చెప్పితిని:—'ఏమి యిది! బలప్రమాణాధిక మయిన తూరుపువాడవారి నారికేలజాతి కోడిమీఁదికి పడమటివాడవారు తెలివి లేక బలాకాజాతికోడిని వదలుచున్నారు?' అని. ఆతత్త్వ మెఱింగినవాఁడు ఆతఁడును 'తెలియని యీమూఢులకు తెలియఁజెప్పిన నేమి ప్రయోజనము? ఊరకుండుము.' అని యడపనుండి యెత్తి కర్పూరముతోడి తాంబూలమును నా కిడి, చిత్రకథలు చెప్పుచు క్షణము ఉండెను. అతిరభసముగా రెండుకోళ్లును పోరాడఁ దొడంగినవి. దెబ్బదెబ్బకును దానిదాని పక్షమువారు సింహనాదములు కావించుచుండిరి. పడమటివాడవారి కోడి ఓడిపోయినది. అంతట ఆవిటుఁడు తనకోడి గెలిచినందులకు సంతుష్టుఁడై నాతో వయస్సునకు సరి గాని చెలిమి చేసికొని, ఆదినము తనయింటనే నాకు స్నానభోజనాది

కముం జేయించెను. మఱు నాఁడు శ్రావస్తికి పయనమయిన నన్ను, 'పని యున్న యెడల నన్ను జ్ఞప్తి చేసికొమ్ము.' అని చెప్పి మైత్రితో నన్ను వీడ్కొని మరలిపోయెను.

నేనును శ్రావస్తి కేఁగి దారి బడలికచేత ఊరి బయటి యుద్యానవనములోని తీవమండపములోఁ బరుండితిని. అంచనాదములచేత మేల్కొని లేచి ఒకయువిదను మధుర మయిన యందియల మ్రోఁతతోడి చరణములతో నా చెంతకు అరుదెంచుచుండం గాంచితిని. ఆ కొమ్మ వచ్చి తన చేతిలోని చిత్రపటమందు వ్రాసియున్న నన్నుఁ బోలిన యొక పురుషుని చిత్తరువును నన్నును సొరిది బరికించుచు అబ్బురపడి వితర్కించుచు హర్షించుచు క్షణము నిలుచుండెను. నేనును చిత్రపటములోని నారూపును గాంచి ఆ చెలువ చూపుల వ్యాపారము యాదృచ్ఛికమాత్రము గాదని తలంచి 'ఓరమణీ, రమణీయ మయిన యీ పుష్పోద్యానప్రదేశము ఎల్లవారికిని హక్కు గదా. ఏల చాలసేపు నిలుచుండు శ్రమం బొందుట? కూర్చుండు.' అని చెప్పఁగా, నాతరుణి చిఱునవ్వు నవ్వుచు 'అనుగ్రహింపఁ బడితిని.' అని కూర్చుండెను. అంతట దేశవృత్తాంతములను గుఱించి ముచ్చటించుచుంటిమి. ఆసల్లాపంపుఁ జెలిమిచే ఆకొమ్మ 'ఈదేశమునకు నీవు అతిథివి, నీయవయవములు పయనము నడచిన బడలికం దెలుపుచున్నవి, దోషము గానియెడల నాయింట నేఁడు సేద దేర ననుగ్రహము సేయుము.' అని పలికెను. నేనును 'ఓముగదా, ఇది దోషము గాదు, గుణమే.' అని దానితోఁ గూడ దాని యింటికిం బోయి రాజార్హము లయిన స్నానభోజనాద్యుపచారంబులచే సుఖితుఁడ నయి కూర్చుండియుండఁగా, రహస్యంబుగా నాకలికి 'మహాభాగుఁడా, దిగంతరములు గ్రుమ్మరుచు నీ వే మయిన వింత చూచి యుందువుగదా, చెప్పుము.' అని యడిగినది. అంతట నామనస్సులో పేరాస జనించెను. 'మున్నె ఎల్ల పరిజనముల గుమిలో నా చూచిన రాకొమరితకు చెలి, ఈచిత్రపటమందు అచట పైని కట్టఁ బడిన తెల్లని మేలుకట్టుతోడి యామేడ దాఁబాయును, అందు విశాలముగా పఱుపంబడి శరత్కాలపు టాగడపలవలె పాండురం బయిన తలిపంబులు, దానిపయి నిదురలో మూఁతపడిన కన్నులతోడిది నాదే యీరూపంబును గలవు. కావున నిశ్చయముగా ఆ రాజకన్యయు మదనునిచేత వేఁదుఱుఁజెందినదై సఖులు ఆవికారమునకుం గారణమును బలవంతపెట్టి యడుగఁగా, చదురు మెఱసి ఈరూపు వ్రాయుటయే తగిన యుత్తరముగా సమర్థించి నది. రూపము నన్నుఁ బోలియున్నందున సంశయాకులయై యీమె నన్నిట్లడిగినది. వాస్తవవృత్తాంతముం జెప్పి యామె సంశయమును తీర్చెదను గాక.' అని నిశ్చయించు కొని 'కల్యాణీ, ఆచిత్రపటము నిటు తెమ్ము.' అంటిని. ఆమె నాచేతి కిచ్చినది. దానిం బుచ్చుకొని, ఉల్లసిల్లుచున్న మదనరాగముచే తల్లడిల్లుచున్నదై, కల్లనిద్రలో నున్న యా

వల్లభను అందులోనే వ్రాసి, 'ఇట్టి పురుషునిపజ్జ పరుండియున్న యొకజవరాలు అరణ్యాని యందు నిద్రించిన నాకుం గనఁబడినది. ఇది కల గదా.' అని వచించితిని. సంతోషించినదై యాచెలి వివరము నడుగుడు సర్వవృత్తాంతమును వ్యాఖ్యానించితిని. ఆ చెలువయు నానిమిత్తంబునం జేసి తనసఖికి కలిగిన అవస్థావిశేషములను వర్ణించినది. దానిని విని 'నీసఖికి నన్ను గ్రహింప మనస్సు కల దేని కొలఁది దినములు గడవ నిమ్ము. కన్యాంతఃపురంబున నిర్భయముగా వసించుటకు పన్నాగము పన్నుకొని వచ్చెదను.' అని ఒక తీరున ఆ కోమలిని ఒడంబఱిచి, ఆగ్రామమునకే పోయి ఆముదివిటుని కలసికొంటిని. అతఁడు సంబరపడి నన్ను విశ్రమింపఁజేసి స్నానభోజనాదులు సేయించి రహస్యముగా 'అయ్యా, ఏల ఇంత త్వరగా మరలి వచ్చితివి ?' అని యడిగెను.

ఇట్లు మాఱు పల్కితిని.—"నీవు నన్ను ఇట్లు ప్రశ్నచేయుట యుక్తమే. విను మఱి. శ్రావస్తి యను నగరము కలదు గదా. దానియేలిక అపరధర్మరాజు ధర్మవర్ధనుఁడను వాఁడు. అతని కూఁతురు సిరికి నిరాకృతివోలె పూవిల్తునికి ప్రాణమువోలె కోమలికంబున నవమాలికను విడంబించునది నవమాలిక యనునది. ఆలలితాంగి యదృచ్ఛగా నాకుం గనఁబడి నామర్మములందు మేరుని నారసముల బారుం బోలె కడకంటి చూపుల బారుం ప్రయోగించినది. ఆశల్యముల నుద్ధరింప ధన్వంతరిపాటివాఁడు నీవు దక్క మఱి వైద్యుఁ లేఁడని మరలి వచ్చితిని. కావున నాయందు దయయుంచి ఏమేని ఉపాయము రచింపుము. నేను స్త్రీవేసము దాల్చి నీకొమారిత నయ్యెదను. నన్నుం దోడ్కొని నీవు ధర్మాసనగతుని ధర్మవర్ధనుని సందర్శించి వచింపుము 'దేవా, నాకు ఈయొకతెయే కొమారిత. ఇది పుట్టినప్పుడే దీనితల్లి మృతి నొందినది. తల్లియు నేనే తండ్రిని నేనే అయి దీనిం బెంచితిని. దీనికొఱకే విద్యారూప మయిన గోలిని సంపాదించుకొని వచ్చుటకై మాకోడి వియ్యమునకుం దగిన బ్రాహ్మణకుమారుఁ డొకఁడు అవంతీరాజధానికి ఉజ్జయినికి పోయి యున్నాఁడు. వానికి దీని నియ్య నెడంబాటు, మఱియొకనికి ఇయ్య వలనుపడదు. ఇది తరుణి యయినది, అతఁడు విలంబించుచున్నాఁడు. కావున అతనిం దెచ్చి దీని నిచ్చి వివాహము గావించి కుటుంబభారము అతనిపై మోపి సన్న్యసించెదను. శైశవము దాఁటిన కన్యలను అందులోను తల్లిలేనివారిని రక్షింపం గష్ట మగుటవలన ఎల్ల ప్రజలకును తల్లివి తండ్రివి అయియున్న దేవరను ఆపన్నశరణ్యుని ఆశ్రయించితిని. ఆనిరాజుల నడవడియందు ధురంధరుఁడ వయిన దేవరవు నీవు అర్థితయు నగతియు నతిథియు నగు ముసలిబ్రాహ్మణుని అనుగ్రహింపఁదగినవారిలో నొకనింగా లెక్కింతువేని, దీని పాణిగ్రాహకుని నేను తెచ్చువఱకు ఈకన్నియ నీబాహుతరుచ్ఛాయయందు నడుమడిలో పొంటుంటక వసించును గాక.'

అని. అట్లు నీవు చెప్పఁగా ఆతఁడు అభిమానించి నన్ను తనకొమారితతో వసింపఁజే యును. అంతట నీవు పని విని రాఁగల ఫాల్గునమాసంబున, ఉత్తరఫల్గునీ నక్షత్రంబున జరిగెడు రాజాంతఃపురజన తీర్థయాత్రోత్సవములో తీర్థస్నానమునుండి, తూర్పు దిక్కున పసియాఱుపుమేర దాఁటి నీటిప్రబ్బలి వలయము నడుమ నున్న కుమారస్వామి దేవళమున చేతియందు తెల్లదోవతుల జోడు పెట్టుకొని యుండుము. నేను జంకు లేక అంత వఱకు రాజకన్యతోడ విహరించుచు నుండి ఆ యుత్సవములో గంగాప్రవాహములో క్రీడించుచు, కన్యకలపిండు విహారపరాయణత మైయి నుండు సమయంబున మునిఁగి వచ్చి నీ కడం దేలెదను. అంతట నీవు తెచ్చిన దోవతులం దాలిచి కన్యావేషమును తీసివైచి నీయల్లుఁడనుగా నీవెంటనే వచ్చెదను. రాజకన్యయు ఇటనట నన్ను వెదకి కానక 'ఆమె లేక నేను భుజింపను.' అని ఏడ్చుచు ఉండును. అందువలన కోలాహలము కలుగును, పరిజనములు అంగలార్చుచుండ, సఖీజనములు ఏడ్చుచుండ, పౌరజనములు శోకించు చుండ, రాజు మంత్రులతోఁగూడ ఏమి చేయునం దోఁపక వ్యసనపడుచుండఁగా, నీవు ఆస్థాని కేతెంచి నన్ను ముందల నిలిపి పలుకుము;—'దేవా, వీఁడుగో నాయల్లుఁడు, శ్రీమం తునికి నీకు పూజనీయుఁడు, నాలుగు వేదములం జదివినాఁడు, ఆ అంగములను నేర్చినాఁ డు, తర్కవిద్యావిచక్షణుఁడు, అఱువదినాలుగు కళలయందును ఆగమప్రయోగముల యందును నిపుణుఁడు, విశేషించి రథగజతురంగతంత్రము లెఱిఁగినవాఁడు, విలువిద్య యందును అస్త్రవిద్యయందును గదాయుద్ధమందును సాటిలేనివాఁడు. ఇతిహాసపురాణ ములయందు సమర్థుఁడు కావ్యనాటకాఖ్యాయికలు రచించువాఁడు, సరహస్యమైన దండనీతి నెఱుంగును. గుణమును మెచ్చువాఁడు, మిత్రులను నమ్మువాఁడు, ప్రియము పలుకువాఁడు, ఇచ్చుస్వభావము గలవాఁడు, ఒక్కవినికికే గ్రహించువాఁడు, గర్వము లేనివాఁడును. ఇతనియందు అణుతర మయినను దోషముం గానను, గుణములలో లేనిదాని నెఱుంగను! కావున నాబోఁటి బ్రాహ్మణమాత్రునికి ఇట్టి వరుఁడు దుర్లభుడు. కొమారిత నితని కిచ్చి ముదిమికి తగిన దైన సన్న్యాసాశ్రమమును పుచ్చుకొనియెదను, దేవరవారు సరి యందురేని.' అని. ఆతఁడు మాట విని మోము వెలవెలంబోవ, మిక్కిలి దిగులొంది మంత్రులుం దానును అనిత్యతాద్యుపన్యాసముచే నిన్ను బతిమాలం దొడంగుదురు. నీవు వారిమాటలను చెవికెక్కనీయక ఎలుఁగెత్తి ఏడ్చి చాలసేపటికి బాష్పములచే గొంతు రాల్పడ, కట్టెములం దెచ్చి రాచనగరిద్వారముకడ సొద పేర్చుకొని నిప్పంటించి ఎక్క నుపక్రమింపుము. అంత నా రాజు మంత్రులతోఁ గూడ నీపాదముల వ్రాలి నీకు ఇష్టార్థము లిచ్చి సమాధానపెట్టి నాయోగ్యతకు మెచ్చి తనసూఁతును నా కిచ్చి రాజ్యభార మెల్ల

నాకే అప్పగించును. నీకు సరి యని తోచినయెడల ఈ యుపాయము చేయవలయును.'' అని. ప్రతిష్ఠుండయిన యాముది విటాగ్రణి పాంచాలశర్మ పల్కాఁడు ఇట్టికపటనాటకములలో గడిఁ దేరినవాఁడు నేను చెప్పినంత ఇంక నెక్కువ కూడ చక్కఁగా నెఱవేర్చినాఁడు. త్వరలోనే నాకోరికలు కొనసాగినవి. మకరందార్ద్రమయిన నవమాలికాపుష్పమును తేఁటి కొదమవోలె ప్రేమరసార్ద్రమయిన నవమాలికను అనుభవించితిని. ఈసింహవర్మరాజునకు తోడ్పడుట మిత్రసంకేతస్థానమునకుం బోవుట యను రెండుఫలములను అపేక్షించి ఎల్లదండులను నడుపుకొని ఈ చంపానగరమునకు అరుదెంచి దైవానుగ్రహంబున దేవరం గాంచు సుఖమును అనుభవించుచున్నాను.

ఈ ప్రమతిచరితమును విని నవ్వుచే మొగిడీఁకనుఁగవతో రాజవాహనుఁడు 'బలము విలాసబహుళము, వ్యాపారము మృదుత్వబహుళము. ప్రజ్ఞావంతులకు ఈదారిప్రియము.' అని వచించి ఇఁక నీ వారంభింపవోయి' అని మిత్రగుప్తుని వైపు చూపు నిగిడించెను.

---

## దశకుమారచరితము - షష్ఠోచ్ఛ్వాసము.

## మిత్రగుప్తచరితము.

మిత్రగుప్తుఁడు చెప్పెను.— 'దేవా, మిత్రుల కందఱకుం గలిగిన కారణంబుననే నేనును భ్రమ్మరుచు సుహ్మదేశములో దామ్రలిప్తియను నగరము వెలుపలి తోఁటలో గొప్ప యుత్సవసమాజముం గాంచితిని. అం దొక్కయెడ బండిగురివెందతీవమండపంబున నొక వయసువాఁడు ఆత్మవినోదార్థమై వీణవాయించుకొనుచుండఁగా కని, 'సౌమ్యా, ఏమి యీ యుత్సవము? ఏల చేయుచున్నారు? ఏమి కతంబున నీవు ఉత్సవము నొప్పరికించి ఏకాంతంబున ఉత్కంఠితుఁడవుం బోలె వీణామాత్రద్వితీయుఁడవుగా నున్నావు?' అని యడిగితిని.

అతఁడనియె:—''సౌమ్యుఁడా, సుహ్మరాజు తుంగధన్వుఁడను నాతఁడు సంతానము లేనివాఁడై ఈగడిలో వింధ్యనివాసాపేక్ష మఱచి వెలసి యున్న వింధ్యవాసినీ దేవి పాదములం గొలిచి ఇద్దఱు బిడ్డలను వేఁడినాఁడు. ప్రాణాచారము పరున్నట్టి యాతనికి అమ్మవారు కలలో ఇట్లు వర మిచ్చినది.—'నీకు కొమారుఁడొకఁడు కలుగును, ఒక కొమారితయు కలుగును. వాఁడు దానిం బెండ్లి యాడువాని నాశ్రయించి జీవించును. ఆ కన్య ఏడవయేటినుండి పెండ్లి యగువఱకు నెలనెల కృత్తికానక్షత్రమందు బంతి నృత్యముచేత నన్ను మంచి పెనిమిటి లభించుటకై సేవింపవలయును. అది ఎవనిని కోరునో

వానికి దానిని ఇయ్యవలసినది. ఆ యుత్సవమును కందుకోత్సవ మని పేర్కొనవలసినది.' అని. స్వల్పకాలములోనే తొలిప్రియతమ పట్టపుదేవి మేదిని ఒకకుమారుని ఒకకుమారిని కన్నది. ఆకన్య కందుకవతి యనునది యిపుడు నెలసిగపూదేవిని బంతియాటచే కొలువ నున్నది. ఆమె చెలి చంద్రసేన యనునది దాదికూఁతురు నాకు ప్రియు అయినది. దానిని ఈనడుమ రాజకుమారుఁడు భీమధన్వుఁడు బలాత్కారమున పట్టుకొనియున్నాఁడు. దానంజేసి నేను ఉత్సుకుండనై మర్మములం గాఁడిన కంతుని కోలల యలుఁగుల నొప్పికిం దెప్పిర లేక తియ్యని యీవీణానాదముచేత హృదయము నోదార్చుకొనుచు ఈవిజనమందు ఉన్నాను.' అని. ఆ నిముసమందే ఎవరిదో అందియలసందడి వీనులకు విందైనది. సుందర యొక్కతె వచ్చినది. దానిం గన్నంతనే అతఁడు కనులు వికసిల్లి లేచి కౌఁగిలించి ఆచెలువ తోఁ గూడ నటనే కూర్చుండెను. 'అయ్యా, ఇదే నాప్రాణేశ్వరి. దీనియెడఁబాపుఁ జిచ్చే నన్ను కాల్చుచున్నది. నాప్రాణముం బోని దీనిని హరించిన రాజకుమారుఁడు మృత్యువు వోలె నన్ను వేఁడి లేనివానిం గావించినాఁడు. రాజుకొడుకగుటంబట్టి అతని యెడ న్యాయ్యము చేయ శక్తుఁడను గాక యున్నాను. కావున దీనిచేత నన్నొక్కమాఱు చక్కఁగా దర్శింపించుకొని ప్రతివిధానము లేని యీప్రాణములను వదలెదను.' అని. ఆచెలువయు మొగంబున కన్నీళ్ల యాల పొరలుచుండ, ననియె:—'నాథా; నాకై సాహసము సేయకు, గొప్పవర్తకుఁ డయిన యర్థదాసుని సుతుఁడవై కోశదాసుఁ డని పెద్దలు పేరిడియుండ, నాతోడి బలుతగులాటంబునంజేసి వేశదాసుఁ డని వైరుల మూలముగా పేరుపొందినవాఁడవు. అట్టినీవు ఆత్మమిల్లి నేను బ్రతికియుందునేని వేశ్యలు కృతఘ్నలు అను లోకవాదమును నేను రుజువు చేసినదాన నగుదును. కావున ఇప్పుడె నన్ను నీయిచ్చ వచ్చిన దేశమునకుం గొనిపొమ్ము.' అని అతఁడు నన్ను 'భద్రుఁడా, నీవు చూచిన రాష్ట్రములలో, ఏది సమృద్ధము, సుభిక్షము, సత్పురుషభూయిష్ఠమును?' అని యడిగెను. అతనికి నేను ఇంచుక నవ్వి బదు లాడితిని: 'భద్ర, ఈ పుడమియొక్క విరివికి పరిమితి గలదా? అక్కడక్కడ రమణీయము లయిన దేశములకు లెక్క లేదు, కాని, ఇచ్చటనే మీరు సుఖముగా నివసించుటకు ఉపాయ మే మయిన రచింపఁ జాలనేని, అప్పుడు నేనే మీకు దారి చూపువాఁడ నయ్యెదను.'

అంతలో మణిమంజీరమంజుశింజితంబులు వినఁబడినవి. అంత నాయింతి సంబరంబున 'ఇదె భర్తృదారిక కందుకవతి బంతియాటచేత వింధ్యవాసినీదేవిని సేవించుటకు వచ్చినది. ఈ కందుకోత్సవమందు ఆమెను చూచుటకు నిషేధము లేదు. మీ నేత్రములను సఫలీకరింపుఁడు. రండు చూచుటకు. నేను ఆమె చెంత నుండెదను.' అని పోయెను. మేమును

నేను వెంటనే పోయితిమి. గొప్ప రత్నరంగపీఠమందు నిలుచున్న యా బింబాధరను ముం
దుగా గంటిని? తత్క్షణమే ఆబాల నాహృదయమందు నెలకొనియెను; ఏదారిని వచ్చి య
టం జొచ్చినదో నాకుం దెలియలేదు, ఇతరులకుం దెలియలేదు. నేను అద్భుతపడి తలపోసి
తిని.—'ఈ కోమలాంగి మహాలక్ష్మియా? కాదు, కాదు, ఆమెకు కేలం దామర యున్నది,
దీనికన్నను చేయే తామర; ఆమె పురాణపురుషునిచేతను పూర్వరాజులచేతను అనుభ
వింపం బడినట్టిది, దీనికన్నను యౌవనము నవమును పొచ్చెము లేనిదియు అనాస్వాదిత
రసంబును?' ఇట్లు నేను తలపోయుచుండంగానే, నిర్దోషసర్వావయవ యైన యా
క్రొల్గంటి వ్యత్యస్తముగా కేలుంజివురుకొనలను నేలకు సోంకించి నటించుచున్న నల్లని
నెటికురులతో ఒయ్యారంబుగా అమ్మవారికి జోహారు సేసి, గాటంపు టెలుపుం గంటికిం
బెట్టుచున్న బంతిని తగిలియుం దగులని యట్లుగా కైకొనియెను. లీలగా జాఱుటగా నేల
మీఁదికి వదలెను. మెల్లనం బయి కెగిరిన యాబంతిని బొట్టనవ్రేలి నించుక గుదించి
కడమవ్రేళుల నిగిడించినచేయివిప్పుతో అడిచి మీఁదెత్తం బయి కెగమీటి, చంచ
లము లయిన తన యాక్షణకాంతు లంటిన యద్దానిని పవనపుడు మింటనే తేంటి
పోటుచే పొదివిన పూగుత్తింబోలె పట్టుకొని, క్రిందికి విడిచెను. మధ్యవిలంబితలయతోను
ద్రుతలయతోను మెల్లమెల్లనం గొట్టుచు తత్క్షణంబ చూర్ణపదముం బ్రదర్శించెను. శమించి
నట్టిదానిని కనికరము లేక కొట్టి పై కెగిరించెను. విపరీతంబుగా మరల శమింపం జేసెను.
ప్రక్కలకు సూటిగా వచ్చినదానిని కుడియెడమచేతులతో సారిదిం బ్రహరించుచు
పక్షినింబోలె ఎగంజోంచెను. దవ్వోగిరి పడుచున్నప్పుడు పట్టుకొని గీతమార్గముం గానిం
చెను. దిశదిశపును పోంజేసి మరల రాంజేసెను. ఇవ్విధమున పెక్కుకరణములచేత రమణీ
యముగా విహరించుచు, రంగమందు అనురక్తమానసు లయిన జనులవలన క్షణక్షణము
పలుదెఱంగుల పొగడ్తల నందుచున్నదై, నేను తత్క్షణమందు కలిగిన స్నేహాంకురమ్మిక
తోడి కోశదాసుని బుజమునం జేయిడి నగరాకున్న చెక్కుటతో వికసిల్లినకనుంగవతో
ఎదురుమోమై నిలువ, అదేతొలుమాఱుగా తన యెదం జొచ్చిన మదనుని పంపున నాపై
కడకంటి చూడ్కి నిగిడించి, చూడ్కివెంట లీలామనోరమంబుగా బొమతీవ విలసిల్ల,
ఉర్పుగాలి వడికి ఊగులాడుచున్న కెమ్మోవికిరణజాలముచేత కేళిచిగుళ్లచేతనుం బోలె
మోముందమ్మినెత్తావి నాన మూంగెడు తేంట్లను కొట్టుచు, చక్రచంక్రమములయందు బంతి
కడువడి సుడియుటం జేసి మదీయదర్శనమువలనిలజ్జచే పువుంబంజరముం జొచ్చుచున్నదో
యన, అయిదుదెబ్బల ప్రచారములయందు ఒక్కుమ్మడి పయింబడుచున్న పంచబాణుని
యైదుబాణములను భయంబున నణంగంగొట్టుచున్నదో యన, గోమూత్రికాప్రచారముల

యందు ఘనదర్శితరాగవిభ్రమ యై మెఱపుఁదీవియ ననుకరించుచు, భూషణమణుల రణితము లోసంగు లయను సరిపఱచుచున్న పాదచారంబును-మిసతోడి లేనగవు కాంతి పై పయిం బొరలుచున్న బింబాధరంబును-వీడి చక్కం జెక్కుఁబఱచుచున్న కొమ్ముడియు-నిండు తాఁకుడుచే క్వణించు మణుల మొలనూలును-అందముగా లేచిన బలువత్రువ పిఱుందుపయి చుందమంద చలనముచే ప్రకాశించుచున్న వలిపంబును-కుదియించిన సాఁచిన వక్రించిన బాహువల్లిచేత అందంపుఁ దాడనంబుం బొందుచున్న కందుకమును-వంచినబాహుపాశమును-పైకి త్రిప్పిన వెన్నడగుపూసపై తగులుచున్న చంచలకేశపాశంబును-కర్ణాభరణ మయిన బంగారుకమ్మ జాఱఁగా దానిం జక్క సవరించు వడిచే తడఁబడని ప్రకృతక్రీడయు-మాటిమాటికి ఎత్తిన కాలుసేతులకు లోపలను వెలుపలను సుడివడుచున్న బంతియు-క్రుంగుటకు లేచుటకు ఎడ లేమిచే అంతలో అగపడక అంతలో అగపడెడు లేఁగౌనును-పడుటయందును లేచుటయందును నియమము లేని ముత్యాలపేరులును. పాటమరించిన చెమరుచేత పసమాలిన మకరికాపత్త్రంబులను తడియార్పుపని గలిగిన కర్ణావతంసపల్లవంపు గాలియు-చనుదరినుండి జాఱిన జిలుఁగు కంచెలను సరిం బట్టు పని గల యొక చేయితలిరును-గలిగి, కూర్చుండియు లేచియు కనుమూసియు కను తెఱచియు, నిలిచియు నడచియు, ఎంతయు వింతగా రాజకుమారి ఆడెను. నేలను ఆకాశమందును కొట్టి సొంపయిన క్రీడాభేదములను ఒకబంతితోనే పెక్కంటితోనుం బోలె కానిపించినది. చంద్రసేనాప్రభృతి ప్రియసఖులతోఁ గూడ ఆడి, ఆటకడపట, అమ్మవారికి మ్రొక్కి, పరిజనమాత్రమే గాక నామనంబును సానురాగ మై వెంటం జన, పూవుటమ్ములవాని కలువయమ్ముంబోని కటాక్షవీక్షణమును నాయందు నాటుచు, మిషమెయి పల్మాఱు మోము జాబిల్లి బిల్లిని మరలించుటంజేసి నాకడ కంపిన తనహృదయము మరలి వచ్చుచున్నదో లేదో యని చూచుకొనుచున్నదియుం బోలె నొప్పారుచు, చెలులతోఁగూడ ఆకన్నియ నగరికిం బోయెను. ఒడలు లేనివాని బారిం బడిన నన్ను తనయింటికిం గొనిపోయి కోశదాసుఁడు నిండుజతనంబుతో మేలైన స్నానభోజనాదికము చేయించెను.

సాయంకాలమున చంద్రసేన వచ్చి ఏకాంతమున నాకు మ్రొక్కి పతిభుజమును ప్రేమరమణీయంబుగా తన భుజముతో రాచికొనుచు కూర్చుండెను. సంతసంబున కోశదాసుఁడు 'ఓసి వెడందకన్నులకలికీ, యావజ్జీవంబును ఇట్లు నీదయకు పాత్రమును అగుదుం గావుత.' అని నుడివెను. నేను నవ్వుచు 'చెలికాఁడా, ఇదేమి అంతభ్రాంతియా? కాటుక యొకటి కలదు, దానిని ఈ యెమెలాఁడి కన్నులకు పెట్టుకొని రాజతనయునిం దఱిసిన యెడల అతనికి కోఁతిగా నగపడును. అంతట విరక్తుఁడై యీమెను వదలును.' అని

చెప్పితిని. అంత నకాంత నవ్వుచు 'ఆర్యా, ఈ కింకరిని కర మనుగ్రహించితివి. ఏల యన, ఈజన్మమందే నారీదేహము మానిపించి వానరీదేహము నొసంగెదవు. ఈ యుపాయ మటుండఁ గాక. మనకోరిక వేఱువిధంబుననే సిద్ధింప నున్నది. నేఁడు కందుకోత్సవములో కందర్పుని రూపును డిందుపఱుచు నందగానిని నిన్నుఁ గోరిన రాజకన్యను ఆకోపంబునంబోలె ముక్కంటిపైకి అక్కజంబుగ ఏఁచుచున్నాఁడు. ఆభావంబును ఎఱింగినదానను నేను ఆవృత్తాంతము ఆమెతల్లికి పట్టపుదేవికిఁ జెప్పెదను, పట్టపుదేవి రాజునకు చెప్పును. సంగతి యెఱింగి రాజు నీచేత కొమారితను చెట్ట వట్టించును. అంతట రాజసుతుఁడు నిన్నాశ్రయించి బ్రదుకవలసినవాఁడు అగును. ఇది గదా అమ్మవారు ఇచ్చినవరము. రాజ్యము నీవశ మయినంతట నిన్నతిక్రమించి నన్ను నిరోధించుటకు భీమధన్వుఁడు సమర్థుఁడు కాఁడు. కావున, ఈయన మూఁడు నాలుగు దినములు ఓర్చును గాక.' అని చెప్పి, నన్నామంత్రించి ప్రియుని కవుంగిలించి మరలిపోయెను. ఆయుగ్మలి నుడువుల ననుసరించి పరిపరి విధముల వితర్కించుటలో నాకును కోశదాసునికిని ఎట్లో ఆరాత్రి కడచనియెను.

తెల్లవాఱినంతట కాల్యవిధులం దీర్చుకొని ప్రియాదర్శనముచే రమణీయ మయిన యాయుద్యానప్రదేశమునకే చనుదెంచితిని. అటనే నాకడకు వచ్చి రాజకుమారుఁడు నిరభిమానముగా అనుకూల మయిన సల్లాపములు చేయుచు ముహూర్తమాత్రకాలము నన్నునువర్తించుచుఁ గూర్చుండెను. తన మేడకుం బిలుచుకొని పోయి తనతో సమానముగా స్నానభోజనశయనాద్యుపచారములచే సేవించెను. సెజ్జయందు స్వప్నములో ప్రియాదర్శనసుఖము ననుభవించుచున్న నన్ను ఇనుపసంకెలతో బిట్టు గట్టిగా పలువురు పురుషులచేత లావుపాటి బాహుదండములచేత పట్టించి కట్టించెను. నేను మేలుకొఁగా తటాలున వచ్చి 'ఓయి దుర్మతీ, పాడు చంద్రసేన ప్రేలిన దంతయు దిడ్డి బొక్కగుండ దాని చర్యపై వేగుగా నంపఁబడిన యీ మఱుగుజ్జు విన్నది. నిన్నఁట ఆవరాకి కందుకవతి వరించినది! నిన్నాశ్రయించి యఁట నేను బ్రదుకవలయును! నీమాటను దాఁటక నేను చంద్రసేనను కోశదాసుని కిచ్చెద నఁట!' అని పలికి ప్రక్క నున్న సేవకునితో 'వీనిని సముద్రములో వైవుము.' అని యాజ్ఞాపించెను. వాఁడు రాజ్యము పొందిన వాని వలె అతిసంతుష్టుఁడై 'దేవరా, నీయాజ్ఞ.' అని ఆజ్ఞప్రకారము చేసెను.

నేను పట్టులేకయే ఇటునటు భుజములతో కదలుచు దైవ మిచ్చిన యొక కొయ్యను ఱొమ్ముక్రింద నిడుకొని ఆపగలును రాత్రియంతయును కడచువఱకు తేలుచుంటిని. వేకువను ఒక యోడ కనఁబడెను, అందు యవను లుండిరి. వారు నన్నెత్తి రామేషు

వసెడి యోడయొడయనితో 'అయ్యా, ఇక్కడ ఎవఁడో యొక మానిసి ఇనుపసంకెలల తోనే నీళ్లలో దొరకినాఁడు; వాఁడు వేయి దాఁకపాదులకు ఒక క్షణములో నీళ్లు పోయఁగలఁడు.' అని నివేదించిరి. ఆక్షణములోనే పెక్కు పడవలతోడి నావయొకటి తఱుముకొని వచ్చెను. యవనులు భయపడిరి. అంతలో అతివేగమున ఆపడవలు కుక్కలు పందినిం బోలె మాయోడను చుట్టుకొన్నవి. పోరాటము జరిగెను; యవను లోడిరి. గతి లేక కూలుచున్న యాయవనులను ఓదార్చి 'నా సంకెల లూడ్చుడు, నే నొక్కండన మీ యెదురులను కూల్చెదను.' అని హెచ్చరించితిని, వా రట్లే చేసిరి. ఘోరటంకారము మీఱ కొమ్మువింటిచే నారసములు గురియించి ఆ పగతుర దేహములను చిద్రుపచిద్రుపలుగా ఖండించితిని. జోదులు చచ్చియు చెదరియు పోఁగా మాయోడ నంటి యున్న యా యోడ మీఁదికి దుమికి అందలి యోడదొరను అసహాయుని పైకొని ప్రాణముతో పట్టు కొంటిని. వాఁడు అభిమధన్వుఁడే. నన్ను తెలిసికొని అవమానపడిన యాతని 'ఏ మోయి బాబూ, కృతాంతుని దండగములం గంటివా?' అని మందలించితిని. ఆయోడవర్తకులు నా సంకెలతోనే వానిని తద్దయు గట్టిగా బంధించి సంతోషముచే ఉప్పొంగి కీలాడించిరి; నన్ను పూజించిరి.

ఆయోడ పెడగాలిచే అఁపరాని వేగముతో దవ్వు కొట్టుకొనిపోయి ఒకదీవి మీఁదికి చని గట్టిగా తగులుకొన్నది. ఆదీవినుండి మంచి నీళ్లు వంట చెఱకు కంద మూలఫలములును తెచ్చుకొనఁగోరి లోఁతుగా లంగరు దిగ వైచి దిగితిమి. అందు గొప్పకొండ యొకటి యుండెను. అంతట నేను 'ఆహా! ఈకొండనెత్తము ఎంత రమ్యముగా నున్నది! శిలాజతుమయ మయిన యీయడివారము మిగుల మనోహరముగా నున్నది; నల్లగలువలయు తమ్మిలయు తేనెబొట్టులు నెమలిపురి కన్నులవలె విస్తరిల్లి మెండుకొన్న యీ కొండనీరు చలువలు గ్రమ్ముచున్నది. ఈయడవిచెట్టులపఱవు పలువన్నెల పూవుతెమ్మెరచే కరము సుందరముగా నున్నది.' అని కన్ను తనియక పెక్కుంటిం గనుచు, తనకే తెలియక కొండశిఖరమునకు ఎక్కి, అచ్చట కెంపుఱాతాపల కాంతిమొత్తములచేత నెత్తుగా జొత్తిల్లి తమ్మిపూదుమారంబుచేత మాసరంబుగా ధూసరంబయిన యొక కొలనిం దఱిసితిని. స్నానమాడి అమృతస్వాదువులను తామరతూఁటితునియలను కొన్నింటిని ఆరగించితిని. నాబుజమునకు ఎఱ్ఱగలువ యొకటి యంటుకొనెను. అట్లున్న నన్ను గట్టున నున్న ఘోరరూపుఁ డొక బ్రహ్మరాక్షసుఁడు మీఁదికి వచ్చి 'ఎవఁడవు నీవు? ఎక్కడివాఁడవు?' అని బెదరించుచు నడిగెను. నేను వెఱవక బదులు పల్కితిని.— 'సౌమ్యుఁడా, నేను బ్రాహ్మణుఁడను, శత్రువుల చేతినుండి సముద్రమున, సముద్రమునుండి

యువతుల యోడను, ఆయోడనుండి చిత్రశిలలతోడి యీ మేటికొండను, చేరి, అలవోకగా ఈకొలన అలపు దీర్చుకొంటిని. నీకు మే లగుఁ గావుత.' అని. 'నాప్రశ్నలకు ఉత్తరము చెప్పవేని నిన్ను భక్షించెదను.' అని రక్కసుఁ డనియె. 'సరియే అడుగుము' అని నేను పల్కితిని. అంతట మాకు ఈపద్యముగా ప్రశ్నోత్తరములు జరిగినవి:—

ఆ. క్రూర మేది జగతిఁ ? గోమలి హృదయంబు.
గృహికిఁ బ్రియహితంబొ ? గృహిణిగుణము.
కాముఁ డెవఁడు ? మదిని గలుగు సంకల్పంబు.
ఏది దుర్లభార్థ మిచ్చుఁ ? బ్రజ్ఞ.

ఇట్లుత్తరము లిచ్చి, ధూమినీ గోమినీ నింబవతీ నితంబవతులు ఉదాహరణము లంటిని. 'చెప్పుము, వా రెట్టివారో?' అని యాతఁ డడిగెను. అంతట నుదాహరించితిని.—

త్రిగర్త మని దేశము కలదు. అందు ముగ్గురు సంసారులు సోదరులు విస్తార మయిన యుత్తమధనములు కలవారు ధనక ధన్యక ధాన్యకు లను వారు ఉండిరి. వారు జీవించి యుండఁగా పంన్రెండేండ్లు దేవేంద్రుఁడు వర్షము గురియింపకుండెను. పైరులు ఎండి పోయినవి, ఓషధులు గొడ్డయినవి, చెట్లు కావవు, మేఘములు వమ్మయినవి, ఏళ్లలో నీటిజాలు కుచించినది, పడియలలో నడుసు మిగిలినది, ఊటబుగ్గలలో ఊట లేదు, కందమూలఫలములు అపరూప మయినవి, కల్యాణోత్సవములు కథావశేష మయినవి, దొంగలతుటుములు మిక్కుట మయినవి, జనులు ఒండొరులఁ దినసాగిరి, ఎక్కడఁ జూచినను కొక్కెరతెలుపువి మానిసిపుఱుకలు దొరలుచుండినవి, కడు పెండినకాకిమూఁకలు సంచరించు చుండినవి, ఊరులు పల్లెలు గూడెములు పట్టణములును పాడఱినవి. ఆసంసారులు వడ్లసేకర మంతయు భుజించి మేఁకమందను గొఱ్ఱెమందను దున్నపోతుల మందను ఎడ్లమందను ఆవులమందను దాసీగణమును దాసగణమును బిడ్డలను జ్యేష్ఠుని భార్యను నడివాని భార్యను వరుసగా భక్షించిరి. కడపట కడగొట్టువాని పెండ్లామును ధూమినిని ఱేపు భక్షింతము అని సంకల్పించిరి. అంతట కడగొట్టువాఁడు ధన్యకుఁడు తన ప్రియను భక్షింప నొల్లక దానిం దోడ్కొని ఆరాత్రి పాఱిపోయెను; దారినడకచే బడలిన దానిని ఎత్తుకొని అడవిం జొచ్చెను. తన రక్తమాంసములచేతనే దాని యాఁకలి దప్పలను తీర్చుచు దారిలో కాలుసేతులు ముక్కుచెవులుం గోసి వైచిన మొండెముగా నేలపయిం గదలుచున్న యొకమానిసిని చూచి కనికరముచేత మనస్సు కరఁగి వానిని గూడ బుజానఁ బెట్టుకొని కందమూల మృగములు మెండుగా నున్న యొకయడవి ప్రదేశములో పాటుపడి యాకుటిల్లు గట్టుకొని చిరకాలము నివసించెను. వానిని గారతైలములోనగు మందులు

పూసి గాయములు మాన్పి మాంసము కూరలు పెట్టి తనతో సమానముగా పోషించెను. పుష్టుండై ధాతూద్రేకముం బొందియున్న యా మొండిని, ఒకనాడు ధన్యకుడు భోజనార్థమైన వేటకై పోయి యుండగా, ధూమిని క్రీడాభిలాషచే పైకొనెను. వాడు కూడదని చీకొట్టినను బలిమిచేసి క్రీడించెను. ఇంతలో పతి మరలి వచ్చి త్రాగ జల మడుగగా 'బావిలోనుండి చేదుకొని త్రాగుము, నాకు తల నొప్పుచున్నది.' అని చెప్పి చేదను తాడిని ముందు వైచెను. నీళ్లు తోడుచున్న యాతనిని వెనుకనే పోయి నూతిలోనికి త్రోసెను. ఆ మొండిని బుజానం బెట్టుకొని దేశమునుండి దేశము తిరుగుచు, ప్రతివ్రతాకీర్తిని పొందెను. నానావిధసత్కారములనుం బడసెను. మఱి ఉజ్జయినీప్రభు ననుగ్రహంబున అఖండైశ్వర్యములం బొంది నివసించెను.

ఇట్లుండ సాతుజనులు యాదృచ్ఛికంబుగా నీళ్లుతోడుకొన వచ్చి బావిలోన దాని నుగనిం గని యెత్తిరి. ఆతఁడు అవంతీదేశములో అన్నార్థియై తిరుగుచుండఁగా, కాంచి, ధూమిని 'నాపతిని అంగములు తఱిఁగిన దురాత్ముఁడు వీఁడే యని రాజుతో చెప్పి ఆసజ్జనునికి చిత్రవధమునకు ఆజ్ఞ సేయించినది. అంతట తలవరులు పెడ రెక్కలు విఱిచి కట్టి వధ్యభూమికి కొనిపోవుచుండఁగా ధన్యకుఁడు ఆయుస్సు ఇంకను మిగిలియున్నందున పెద్దతలారితో 'నేను ఎవని యవయవములు తఱిఁగితి నని అనుచున్నారో ఆభిక్షుఁడు నాయందు దోషము చెప్పనేని నన్ను దండించుట యుక్తము.' అని ధైర్యముగా చెప్పెను. 'సరి, ఆక్షేప మేమి?' అని ఇతనిం గొనిపోయి చూపఁగా సాధువు ఆ మొండి కన్నీళ్లు గురియుచు ఇతని పాదములం ద్రెళ్లి ఈ సజ్జనుని యుపకారమును ఆ చెడిపయొక్క యాదుశ్చరిత్రమును వివరించెను. రాజు కోపగించి ఆపాపకారిణిని ముక్కు చెవులు కోయించి కుక్కలకు కూడువండు పనికి నియమించెను. ధన్యకుని అనుగ్రహపాత్రముం గావించెను. కావున కోమలిహృదయంబు క్రూర మని వక్కాణించితిని.— మఱల రక్కసుఁ డడుగఁగా నిట్లు వాక్రుచ్చితిని.

ద్రవిడదేశములో కాంచి యని పట్టణము కలదు. అందు పెక్కుకోట్ల మూలధనము గలవాఁడు శక్తికుమారుఁ డని సెట్టికుమారుఁడు ఉండెను. అతఁడు పదునెనిమిదవయేట ఒకప్పుడు 'భార్య లేనివారికిని అనుకూలభార్య లేనివారికిని సుఖము లేదు. గుణవంతురా లయిన భార్య యెట్లు దొరకును?' అని చింత పొందెను. పిమ్మట ఇతరులు తమ నమ్మకముచేత తెచ్చిన కన్యలయందు తాఁ గోరిన సంపత్తిం గానక, తానే సాముద్రికుండై వలువ చెంగున ఒకపడి వడ్లు కట్టుకొని దేశములు తిరుగుచుండెను. లక్షణజ్ఞుఁ డని ఇతనికి కన్యావంతులు కన్యలం దెచ్చి చూపుచుండిరి. లక్షణవతి యయిన స్వజాతికన్యం గాంచి నప్పుడెల్ల ఇతఁడు—'కల్యాణీ, ఈపడివడ్లతో నాకు మంచి భోజనము పెట్టఁగలవా?' అని

యడుగుచుండెను. అంతట నవ్వృశోడి యొగతాళిం బొంది ఇల్లిల్లు చొచ్చుచు తిరుగుచుండెను. ఒకప్పుడు శిబిదేశములో కావేరికి దక్షిణతీరమున నొకపట్టణములో తల్లిదండ్రులతోఁగూడ గొప్పభాగ్యమును గోలుపోయినదై సార మెల్ల నశింపఁగా అల్పాభరణములతో నున్న యొకకన్యను దాది తెచ్చి చూపఁగా చూచి దానియందు కన్న దవుల ఇట్లు తలపోసెను:— "ఈ కన్యకు అవయవము లన్నియు ఎక్కువ లావు గావు కడుం గృశములును గావు, ఎక్కువ కుఱుచలు గావు కడు నిగుడలుం గావు, వికటములునుం గావు, లావణ్యవంతములుగా నున్నవి. చేతులయందు యవమత్స్యకమలకలశాద్యనేక పుణ్యరేఖ లున్నవి, వ్రేళ్లు ఎఱుపు గలవి, అడుగులును సమానమైన చీలమండలకీళ్లు గలవై నరములు కనఁబడక పుష్టములై యున్నవి, జంఘలు గుండ్రములై ఆఁదోఁకగా నున్నవి, వలుదలైన తొడలచే మ్రింగఁబడినవో యన మోఁకాళ్లు స్ఫుటపడక యున్నవి, సమవిభక్తమును చతురస్రమును గుంటలవిభాగముచే శోభితమును చక్రాకార సన్నివేశమునై నితంబబింబ మొప్పుచున్నది, కడుపు కడుసన్నమై ఇంచుక పలుచనై లోఁతయిన పొక్కిటి సుడి గలిగి ముత్తరులచే నంద మొందుచున్నది, పాలిండ్లు ఉరోవిభాగములం బర్వి మొనలెత్తి విరివిం బొరయ జతనపడి మెఱయుచున్నవి, బాహులతలు - ధన ధాన్య పుత్త్రుల నిండు కలిమిం దెలిపెడి రేఖలతోడియఱచేతులును నిద్దంబులు ఉదగ్రములు కోమలములు నగు గోర్మణులును తిన్ననై క్రమక్రమముగా గుండ్రనైన యెఱ్ఱని వ్రేళ్లును గ్రుంగిన బుజములును మునిఁగిన కీలుప్రదేశములును గలిగి-సౌకుమార్యవంతములై యున్నవి. కంధరంబును సన్ననిది చిందమువలె గుండ్రమై ఉన్నతానతమై యున్నది. గుండ్రనై మధ్యవిభక్త రక్తిమ మయిన మోవితో కూచికాని యందంపు గడ్డముతో నిండు బటువు చెక్కిలి బిల్లికలతో క్రమముగా వంపైఒం డొకటితో కలయని నల్లని కనుబొమతీవలతో ఎక్కువ ముదురని నువ్వుఁ బువ్వుం బోని నాసికతో బలు నలుపు తెలుపు నెఱుఁపును మూఁడు భాగములుగా భాసిల్ల మృదుధీర సంచార మంథర ములయిన వాలుఁగన్నులతో చంద్రార్ధ సుందర మయిన నుదుటితో, ఇంద్రనీలమణుల యాకారముచే చెన్నారుచున్న కురుల వరుసలతోను, రెండుచుట్లుచుట్టిన వాడిన తామరతూఁటి కమ్మతోడి వ్రేలు శ్రవణపాశములతోను, ముఖకమలము తేజరిల్లుచున్నది. కేశభారము అతికుటిలము గాక పెక్కువ గలిగి కొనలయందును పింగళిను లేక నిడుదయ్యొకటొకటి వెవ్వేఱుగా మొలచి స్వభావముచేత నే సమమై మెఱుఁగై నీలమై పరిమళము పట్టునదై యున్నది; ఈయాకారము సదాచారము నతిక్రమింపదు. నామనస్సు ఈ ముగుదయందే తగులు కొనుచున్నది. మఱి పరీక్షించి దీనిని పెండ్లియాడెదను. విమ

ర్పించుకొనక పనిచేయువారికి నిశ్చయముగా పెక్కు పశ్చాత్తాపపరంపరలు కలుగును."- ఇట్లు తలపోసి, నెయ్యంపుఁ జూపునఁ జూచుచు అడిగెను. —'కల్యాణీ, ఈ పడివరితో మంచిభోజనము మాకు పెట్టనేర్తువా?' అని.

అంత నా బాలిక ఆ ముసలిదాదిని సాభిప్రాయముగాఁ జూచినది. ముసలిది అతనిచేతినుండి పడి ధాన్యము కైకొని అతనిని నీళ్లిచ్చి కాళ్లు కడుగుకో నిచ్చి ముందటి చావడిలో చక్కఁగా నీళ్లు చల్లి తుడిచిన యొక చోట కూర్చుండఁజేసెను. ఆకన్య ఆతావి వడ్లను నలియఁ గొట్టి పలుచనగా ఎండలో ఎండఁబెట్టి మరల మరల నెరపి గట్టి చదును నేలలో, గొట్టపుఁ గొయ్యతో మెల్లమెల్లన రాచుచు ఊముకను పగుల నీయకయే విడఁదీసి, దాదిని 'అమ్మా, ఈయూముక నగలకు మెఱుఁగు పెట్టుటకు పనికి వచ్చును గావ దీనిని కంసాలులు కోరుదురు, వారికి దీని నమ్మి వచ్చిన డబ్బులకు అంత తడివి అంత ఎండువి గాక నిలిచి మండున వైన వంటకట్టియలను ఒకపాటి యుడుకున దైన పనఁటిని రెండు మూకుడులను తెమ్ము.' అని చెప్పి పంపెను. దాది యట్లే చేయఁగా, కన్య ఆ బియ్యమును ఎక్కువ లోఁతు ఎక్కువ మిట్టయుఁగాక విశాలమయిన గుంటకలిగిన మద్ది ఱోటి ఇనుప పొన్ను గలిగి వంపు లేక నడుమ సన్నఁదన మగపడుచు నిడుపు గలిగి బరువయిన చంద్రరోఁకటితో చదురుగా చెన్నుగా, ఎత్తుటచేతను దించుటచేతను భుజములు అలయుచుండఁగా, మాటిమాటికిని వ్రేళ్లతో పైకెత్తియెత్తి దంచి తీసి చేటలో చెఱిగి వరిముండ్లు లోనగు వానిని తీసి వైచి బియ్యమును పలుమాఱు నీళ్లతో కడిగి అయిదింతల నీళ్లు ఎసరు కాఁగనిచ్చి ప్రొయ్యిని పూజించి ఎసటిలో పోసెను. బియ్యపు గింజలు మెత్తఁబడి ఉబ్బి మొగ్గదశను దాఁటుచుండఁగా నిప్పును తగ్గించి పనఁటికి మూఁత మూసి గంజి వార్చినది. గరిటెతో కలియఁ బెట్టి కొంచెకొంచెముగా క్రింద మీఁదు చేసి మెదుకులు సమానముగా ఉడికిన తర్వాత ఆపనంటిని తలక్రిందుగా నుంచెను. లోపల ఇంకను సారము గలవైన కట్టియలను నీరు చిలికి నిప్పు ఆర్పి నల్లబొగ్గులం గావించి వానిం గోరువారికి దాదిచే 'వీనికి వచ్చెడు డబ్బులకు నేయి కూర పెరుఁగు నూనె ఉసిరిక చింతపండును వచ్చినంత తెమ్ము.' అని పంపెను. అట్లే దాది చేయఁగా, రెండు మూఁడు కూరలును చేసి తడియిసుకపై నిడిన క్రొత్త మూకుటిలోని యాగంజిని మిగుల మృదువుగా విసనకఱ్ఱతో విసరి చల్లార్చి ఉప్పు వేసి, తాలింపు పెట్టి, అగురుధూపాధివాసనంబునుం గావించి, ఆ యుసిరికను కలువవాసనగల మెత్తని ముద్దగా చేసి, దానిచే అతనిని స్నానమునకు లేపించెను. తాను ముందుగా స్నానశుద్ధయై తైలము ఉసిరికపిండియు నిచ్చెను. అతఁడు క్రమముగా స్నానము చేసి, నీరుచల్లిన యూడిచిన నెలకట్టులో పీఁటపయిం

గూర్చుండుడు, ముంగిటి యరఁటి ద్రాఁకునుండి పాండువర్ణము కలసిన పసరువన్నెగల యాఁకును మొదటి మూఁడవ భాగము వదలి మిగత కోసి తెచ్చి అతనికి వైచెను. అతఁడు దానిపై నీళ్లు చల్లి తుడిచెను. ఆకన్నియ అతనికి ముందుగా ఆ రెండు మూకుడులలో నున్న యాగంజినే త్రాగుటకు ఇచ్చెను. అతఁడు త్రాగి దారిబడలిక తీఱి సంతుష్టుఁడై ఒడలెల్ల చెమర్చి యుండెను. పిమ్మట నతనికి శాల్యోదనమును రెండుగరిటెలు వడ్డించి నేయి ప్రప్పు శాకాదికమును వడ్డించెను. మాఱు వడ్డించి త్వక్పత్త్రైలామార్గములోడి పెరుఁగు తోను సురభి శీతల తక్ర కాంజికములతోను భుజింపఁజేసెను. అన్నము ఇంక మిగిలియుం డఁగా అతఁడు తృప్తుఁడై మంచినీళ్లడిగెను. అంతట క్రొత్త బుంగలో నించినవియు అగురుధూపము వైచినవియు క్రొత్త కలిగొట్టు పువ్వులచే పరిమళించుచున్నవియు విరిసిన కలువలచే పరిమళితంబులును అయిన మంచి నీళ్లను గొట్టపు ధారగా పోసెను. అతఁడును నోటి కడ మూఁకుటిం బెట్టుకొని మంచువంటి చలితుంపురులకు ఱెప్పలు వ్రాలి కన్నులు ఎఱుపెక్క ధారాస్వనము వీనుల కింపు నింప స్పర్శసుఖముచేత నొదవిన గగుర్పాటుచే చెక్కులు బిరుసుగాఁగ పరిమళప్రవాహంపు వెల్లికి ముక్కుబొక్కలు వికసిల్ల మాధుర్యాతి శయమునకు నాలుకను వంచి ఆ తేటమంచినీటిని ఆకంఠపరిపూర్తిగా త్రావెను. తల యా డించిన సంజ్ఞచేత నీరు పోఁత మాని మఱియొక గిండితో ఆకన్య ఆచమన మిచ్చినది. ముసలిది ఎంగిలి యెత్తి వైచి ఆనెలకట్టును పసరువన్నె యావుపేఁడతో అలికినది. అతఁడు మెత్తని తన యుత్తరీయమును పఱుచుకొని కూఁకు పరుండెను. సంతోషించి యథావిధిగా ఆకన్యను పరిణయమయి తోడ్కొనిపోయెను. పోయి దానిని అసడ్డచేసి ఒక వేశ్యను రాణివాసముగా ఉంచుకొనెను. దానిని కూడ ఆ భార్య ప్రియసఖినిబోలె ఉపచరించెను. పతిని అప్రమత్తురాలై దేవతనుబోలె సేవించుచుండెను, ఇంటి పనులు లోపము లేకుండ నెఱవేర్చుచుండెను. పరిజనమును దాక్షిణ్యాతిశయముచేత తన'యధీన ముం జేసికొనెను. భర్త ఆమెగుణములకు వశుఁడయి కుటుంబభారమెల్ల ఆమెయధీన మందే ఉంచి తన ప్రాణశరీరములు ఆమె కొక్కతెకే స్వాధీనపఱిచి ధర్మార్థ కామము లను అనుభవించుచుండెను. కావున 'గృహస్థులకు భార్యాగుణములు ప్రియహితము సేయును.' అని వచించితిని.—అంత నా రక్కసుఁడు నింబవతీ వృత్తాంత మడుగఁగా చెప్పితిని.

సౌరాష్ట్రదేశములో వలభి యని నగరము కలదు. అందు కుబేరునికి సాటియైశ్వ ర్యవంతుఁడైన గోడవత్తునికి గృహగుప్తుఁడనువానికి రత్నవతి యని కూఁతురు ఉండెను. దానిని మధుమతినుండి వచ్చి బలభద్రుఁడను సార్థవాహపుత్త్రుఁడు వివాహ మాడెను.

ఆ పెండ్లికూఁతురు ఏకాంతమున అతని మనోరథమునకు భంగము గావింపఁగా నాతఁడు దానిపై తటాలున ప్రబల మయిన ద్వేషమును వహించెను; మఱి దానిని చూడ నొల్లఁడాయెను. మిత్త్రులమాటను గూడ పాటింపక దాని యింటికి పోవుటను గూడ లజ్జచే మాని వైచెను. ఆ దౌర్భాగ్యవతిని నాఁటినుండి స్వజనులును పరజనులును 'ఇది రత్నవతి గాదు, నింబవతి ఇది,' అని యవమానించుచుండ, కొంత కాల మిట్లు జరిగినంతట, ఆ చెలువ పశ్చాత్తాపము పొంది తనగతి యిఁక నేమి అని యాలోచించుకొని, ఒక ముసలి జోగురాలిని తల్లి వంటి దానిని దేవతానిర్మాల్యపుష్పములు కొని వచ్చిన దానిం గని, ఆమె మ్రోల ఏకాంతమున దీనముగా నేడ్చెను. ఆమెయు కంట నీళ్లు పెట్టుకొని ఓదార్చి ఏడ్పునకు కారణ మడిగెను. రత్నవతి లజ్జ నడ్డగించుకొన్నను కార్యగౌరవంబున ఎట్లో చెప్పినది:— 'అమ్మా, ఏమి చెప్పుదును? పతి యొల్లమి కెల్ల ఇంతులకు ముఖ్యముగా కులస్త్రీలకు జీవన్మరణము సుమా. అందులకు నేను ఉదాహరణమనై యున్నాను. తల్లి మొదలుకొని పుట్టినింటివారందఱును నన్ను తిరస్కారముతోనే చూచుచున్నారు. వారు నన్ను సరిగా చూచునట్లు చేయుము; చేయవేని నిష్ప్రయోజనమయిన యీప్రాణమును వదలెదను. నేను వృతిం జెందవలసిన నా రహస్యము నెవరితోనుం జెప్పకుము.' అని పాదములందు వ్రాలెను. సన్న్యాసిని తనకన్నుల బాష్పములు ఉప్పొంగ నింబవతిని లేవనెత్తి వచించెను:— 'కూఁతురా, సాహసము సేయకు. ఇదె నేను నీ పంపులో నున్నాను. నావలన ఎంతవఱకు పని యుండునో అంతవఱకు నీయొక్క యాధీనమందే యుండెదను. నీవు విరక్తిం జెందితివేని నా నేర్పువిధంబున పరలోకకల్యాణార్థము తపం బాచరింపుము. ఇట్టి సౌందర్యమును ఇట్టి నడవడియు ఇట్టి కులంబును కలిగియు అకారణంబుగా భర్తకు కంటికెఱఁగ వైతి వను నిప్పటి యీ నీదుర్దశ నీపూర్వ జన్మపాపముయొక్క ఫలము. పతిద్రోహమును ప్రశమింపఁజేయు నుపాయ మేమేని కలదేని చూపుము, నీవు మంచి తెలివి గలదానవు గదా.' అని.

అంతట రత్నవతి ఎట్టో క్షణసేపు మోము వాంచి ఆలోచించి వేఁడినిట్టూర్పు నిగిడించి వక్కాణించెను.—"భగవతీ, వనితల కెల్ల ముఖ్యముగా కులస్త్రీలకు పతి యొకఁడే దేవత; కావున అతని శుశ్రూషించుటకు ఉపాయమైన పని యే మయినఁ జేయవలయును. మాపొరుగింట నుండు వణిజుఁడు కులవిభవముచేతను రాజునకు అంతరంగమిత్త్రుఁ డగుటచేతను పౌరుల కందఱకుం బయినాఁడై యున్నాఁడు. అతని కూఁతురు కనకవతి యనునది సరిగా నాపోలికది, నాకు సమాన మయిన రూపావయవములు గలది, నాయందతిమైత్త్రి గలది ఉన్నది. దానితోఁ గూడ దాని యేడంతస్తుల మేడపైని దానికి ఇనుమడిగా అలంక

రించుకొని విహరించుచుండెదను. నీవు నాపలిని దానితల్లియొక్క వేఁడుకోలుగా మంచి మాటలం బిలిచి ఆయింటికి ఎల్లెనియు కొనితేఁరవలయును. మీారు చెంత నుండఁగా ఆటనుదమునం బోలె బంతిని పడవైచెదను.అంతట దాని నెత్తి యాతినిచేతి కిచ్చి'బాబూ, ఈమె నీభార్యకు సఖి, నిధిపతిదత్తుఁడను పెద్దసెట్టికొమారితె కనకవతి. నిన్ను ఈమె - ఈతఁడు నిలుకడ లేనివాఁడు కనికరము లేనివాఁడు - అని రత్నవతికి మిక్కిలి నిందించుచుండును. కావున ఈబంతి వైరులసొమ్ము దీనిని ఇచ్చివేయవలయును.' అని చెప్పను. అట్లు చెప్పిన నతఁడు నిశ్చయముగా మొగమెత్తి నన్ను ఆ నెచ్చెలింగానే తలఁచిన వాఁడై నేను కేలు మోడ్చి వేఁడుటచేతను పయిగా నీవును జలిమాలుటచేతను ఆ బంతిని కోకతో నొసంగును. ఆసందులో నతనిం గౌఁగిలించి రాగమును తీండ్రింపఁజేసి అతఁడే నన్ను సంకేత మేర్పరించి దేశాంతరమునకుం గొనిపోవునట్లు సమకూర్పవలయును." అని. ఇందులకు సంతోషముతో అంగీకరించి జోగురాలు అట్లే సమకూర్చెను.

అంతట ముసలితాపసిమాటలచే మోసపోయి బలభద్రుఁడు సారరత్నములనురత్నాభరణములను తెచ్చిన యారత్నవతిని కనకవతినిగా తలఁచి తోడ్కొని రాత్రి కటిక చీఁకటిలో దేశాంతరమునకుం బోయెను. ఇట నావృద్ధపరివ్రాజిక "నేను తెలివి లేక నిర్నిమిత్తముగా రత్నవతిని ఒప్పరికించితిని, అత్తమామలను అవమానించితిని, మిత్త్రుల మాట నతిక్రమించితిని; కావున నిటనే దానిం గూడి కాఁపురము సేయ లజ్జ పడుచున్నాను.' అని నాతో నిన్న చెప్పినాఁడు. నిశ్చయముగా అతఁడు దీనిం దోడ్కొని పోయినాఁడు; త్వరలోనే తెలియును." అని మాట పుట్టించెను. ఆమాట విని దాని బంధువులు దానిని వెదకుట మానియుండిరి. రత్నవతియు దారిలో నొక జీతపుదాసిని కూర్చుకొని బత్తెము లోనగు చిల్లరసామానులు దానిచేత మోయించుకొని ఆఖేటపురము నకుం బోయెను. అచట వేగమున నేర్పరి బలభద్రుఁడు కొంచెపాటి సంచిమొదలితోనే మహాధనము నార్జించెను, ఊరి పెద్దయు నాయెను. ధనవశమున పెక్కురు పరిజనులును కూడిరి. అంతట రత్నవతి ఆ మొదటి దాసిని 'పని చేయవు, మాచిన దెల్ల దొంగిలించెదవు, అప్రియము పలికెదవు.' అని కక్కసముగా నదలించి ఎక్కువగా కొట్టెను. చేటియు అనుగ్రహసమయమున ఆమె చెప్పిన తదీయరహస్యములో కొంత ఇప్పుడు కలిగిన రోసంబున బయటఁ బెట్టెను. దానిని విని కొత్వాలు ఊరి పెద్దల మ్రోల 'అయ్యా, ఈదుర్మతి బలభద్రుఁడు నిధిపతిదత్తుని కొమారితను మోసగించి తగులుకొని వచ్చి మన యూర నివసించుచున్నాఁడు. ఇతని సర్వధనహరణమునకు మీారు అడ్డు చెప్పకుఁడు.' అని గట్టిగా బెదరించెను. భయపడిన బలభద్రునితో రత్నవతి యిట్లనియె:-

"భయపడకు. ఇట్లు పల్కు:— 'ఇది నిధిపతిదత్తుని కూఁతురు కనకవతి కాదు. ఇది వలభిలోనే గృహగుప్తుని కూఁతురు రత్నవతి; తల్లిదండ్రులు దీనిని నా కిచ్చినారు, నేను యథావిధిగా పెండ్లి చేసికొంటిని. నామాట నమ్మరేని, దీని బంధువుల కడకు దూతను పంపుఁడు.' అని." బలభద్రుఁడు అట్లు చెప్పఁగా, అతని వాదవారాతనికై కొత్వాలునకు పూఁట పడఁగా ఊరి పెద్దలు గృహగుప్తునికి జాబు పంపిరి. జాబువలన వృత్తాంత మెఱిఁగి గృహగుప్తుఁడు ఆఖేటపురమునకు వచ్చి అల్లునితోఁగూడ కొమారితను అత్యంతహర్షమునం గొని పోయెను.—అట్లు కనకవతినిగా భావించి కాంచినందున రత్నవతి బలభద్రునికి అత్యంతవల్లభ యైనది. కావున 'కాముఁ డనఁగా సంకల్పము.' అని వచించితిని, అంటిని.— తర్వాత నా రక్కసుఁడు నితంబవతీవృత్తాంతమును చెప్ప మొదలిడెను. ఇట్లు చెప్పినాఁడను.—

శూరసేనదేశమందు మథుర యని పట్టణము గలదు. అం దొక కాఁపుఁగొమారుఁడు కళలయందును గణికలయందును అతిసక్తుఁడు, మిత్రులకై తన బాహుపరాక్రమమున నొక్కటనే పెక్కు కలహములు నిర్వహించి కలహకంటకుఁ డని కర్కశులచే పేరు పొందినవాఁడు ఉండెను. అతఁ డొక నాఁడు క్రొత్తగా వచ్చిన యొక ముచ్చిచేత చిత్రపట మొకటి గాంచెను. అందు చిత్తరువులోని యువిద యొకతె ఈతఁడు చూచిన మాత్రాన ఈతని హృదయమును కామాగ్రముగాఁ జేసెను. అంతట కలహకంటకుఁడు ముచ్చితో 'సౌమ్యుఁడా, ఈచిత్తరువు విరుద్ధముగా తోఁచుచున్నది. ఏలయన, కులస్త్రీల కలవడని సౌందర్యంబును, కులోత్కర్షను దెలిపెడి నమ్రతయు; ముఖకాంతి పాండురంబుగా నున్నది, దేహము అంతగా పరిభోగము నెఱుంగనిదిగా నున్నది; మాపు ప్రోషితం జూపుచున్నది. ఇది ప్రోషితభర్తృక గాదు, ఏలయన, వియోగచిహ్నము లయిన యొక్కటి జడ లోనగునవి లేమింజేసి. కుడిపార్శ్వమందు మచ్చ యొకటి కానిపించుచున్నది. కావున ఈ తరుణి ఎక్కువ పుంస్త్వము లేనట్టి యొక ముసలివణిజుని యిల్లాలు. నీవు చూచిన దానిని బలు నేర్పు మెఱసి సరిగా వ్రాసితి వని తలంచెదను.' అని. ముచ్చి యాతనిం బొగడి చెప్పెను:— 'నిజముగానే ఈమె అవంతిపురిలో అనంతకీర్తి యను గొప్ప వర్తకుని భార్య, నితంబవతి యని సార్థకనామ. ఈమెను ఆ సౌందర్యమునకు ఆశ్చర్యపడి నే నిట్లు వ్రాసితిని.' అని.

అతఁడు అప్పుడే ఉత్సుకుఁడై ఆమెం గనుటకు ఉజ్జయినికి తరలెను. జోస్యుఁడుగా వ్యవహరించుచు భిక్షు కని మిష పెట్టి ఆరమణియింటికిం బోయి ఆమెం గాంచెను. చూచి నంతనే మగునేఁపు లగ్గలం బగుడు, ఊరి పెద్దలవలన నల్లకాటిం గాచు కొలువును వేఁడి

సంపాదించుకొనెను. అచట దొరకిన పీనుఁగు కప్పు వస్త్రములు లోనగువాని నిచ్చి అర్హంతిక యను నొక శ్రమణికను ఆవర్జించెను. ఆ శ్రమణికముఖముగా నితంబవతిని రహస్యముగా ప్రార్థించెను. నితంబవతి శ్రమణికను చీవాట్లు పెట్టి నిరాకరించెను. శ్రమణికవలన నితంబవతి మంచి కులస్త్రీ యని దాని వ్రతముం జెఱుప నలవిగా దనియు, నెఱింగి, ఏకాంతమున ఆమూలికకు నేర్పెను.—"మరల పోయి సార్థవాహుని భార్యను కలసికొమ్ము. రహస్యముగా 'అమ్మాయీ, సంసారమందలి దోషములఁ గన్నందున సమాధి నాశ్రయించిన నాబోఁటి ముముక్షువు కులస్త్రీల పాతివ్రత్యముం జెఱుప యత్నించు ననుట యెట్లు ఘటిల్లును? నేను అత్యుత్కృష్ట మయిన యైశ్వర్యంబును మానుషాతీత మయిన రూపంబును తొలి యౌవనంబును గలిగిన నీకు ఇతర స్త్రీలయందు సులభ మయిన చాపలము కలదో లేదో పరీక్షించితిని; సంతోషించితిని. ఇట్లు అదుష్ట మయిన మనస్సుగల నీకు సంతతి గలుగఁగా చూడం గోరుచున్నాను. నీ భర్తను ఒక గ్రహము పూనియున్నది. దానిని నివారింపక అతనివలన సంతతిం బొంద నలవి గాదు. కావున నీవు నామాట విని వృక్షవాటికలో ఒంటరివై నా తెచ్చెడు నొక మంత్రవాదిచేతిలో గూఢముగా నీపాదమును ఉంచి అతనిచే నభిమంత్రిత మయిన యీయడుగుతో నీభర్తను పొలయాలుకచేతనుంబోలె అొత్తుమం దన్నుము. అటుపయి న తఁడు ఉత్తము మయిన ధాతుపుష్టిం జెంది పటువు లయిన బిడ్డలం బుట్టింప శక్తుఁ డగును; దేవతనుంబోలె నిన్ను అనువర్తించును. ఈ విషయములో నీవు సంశయింపవలదు.' అని. అందులకు ఆ సుందరి తప్పక యంగీకరించును. రాత్రి నన్ను చెట్లవాటికలో ప్రవేశపెట్టి ఆ చెలువను కూడ అటం బ్రవేశపెట్టుము. అంత మాత్రమున నాకు మహోపకారము చేసినదాన వగుదువు." అని. పరివ్రాజిక అట్లే బోధించినది. అతఁడు అతిప్రీతుఁడై ఆ రాత్రియే చెట్లచాలునకుం బోయి జోగురాలి జతనంబుచేత వచ్చినట్టి నితంబవతిని పాదమందు తాఁకుచున్నట్లు నటించి ఒకపసిఁడియందియ నూడలాగికొని సురియతో తొడమొదల ఏమో గీఱి వడిగా వెడలిపోయెను. ఆ కలికి వెఱుభయంబున తనతప్పిదమునే తెగడుకొనుచు, జోగురాలిమీఁద చంపునంత కోపము వహించి, ఇంటి దిగుడుబావిలో గాయమును కడిగికొని దానిపై గుడ్డతో కట్టు కట్టి, ఒడలు సరి లేదని మిషపెట్టి రెండవయందియం దివిచి వైచి, మూఁడు నాలుగు దినములు ఏకాంతమున పరుండి గడపెను. అంత నా ధూర్తుఁడు అనంతకీర్తికడకే ఆయందియం దెచ్చి అమ్మఁజూపెను. అతఁడు కాంచి 'నాయిల్లాలిదే యీయందియ, చెప్పుము, నీ కెట్లు లభించినది?' అని యడిగి, అతఁడు చెప్పకుండఁగా, చెప్పుమని యిబ్బందిపెట్టెను. ధూర్తుఁడు వణిజుల సమూహము నెదుట చెప్పెద నని

పట్టుదలగా నుండెను. మఱి యనంతకీర్తి తనయిల్లాలికి ఆమె యందెలజతను పంపుమని చెప్పిపంపెను. ఆమె లజ్జపడుచు భయపడుచు 'ఈరాత్రి విశ్రామార్థము నేను చెట్లచాలునకుం బోఁగా బిరడయూడి ఒకకాలియందె జాఱిపోయినది. ఎంత వెదకినను ఇప్పటికిని అది దొరకలేదు. ఇదిగో రెండవది.' అని చెప్పి రెండవదానిని పంపినది. ఈవార్త విని, ఆకాఁపుఁగొమారుని ముందిడుకొని ఆతఁడు వణిక్సమాజమునకుం బోయెను. అట నడుగఁగా ధూర్తుఁడు వినయంబున విన్నవించెను. 'ఆర్యా, మీకు తెలిసినదే గదా నేను మీపంపున శ్మశానమును కాచుచు అందువలన జీవించుచుండుట. లుబ్ధలోకవేళ నన్ను కనుమొఱంగి రాత్రి శవములను దహింతురని రాత్రులందు సయితము వల్లకాటనే పరుండును. నిన్న కాలియందె కాని శవమును సోదకుండి శ్యామాకారయొక స్త్రీ బలాత్కారంబున లాగుచుండం గాంచితిని. ధనలోభముచేత భయము నణఁచుకొని దానిం బట్టుకొంటిని, సురియతో తొడమొదల ఏమో కొంచెము గీఱితిని, అందెను కాలినుండి లాగితిని. ఇంతలో ఆయింతి కడువడిం బాఱిపోయినది. నాకు దొరకినవిధ మిది. ఆటుపయిని మీచిత్తము.' అని. అంతట పౌరులందఱును ఆలోచించి ఆమె శాకిని యని ఏకాభిప్రాయముగా నిశ్చయించిరి. భర్త వెడలంగొట్టెను. అంత నాచెలువ ఆశ్మశానంబుననే ఏడ్చియేడ్చి చచ్చుటకై ఉరిఁబోసికొనుచుండఁగా ఆధూర్తుఁడు రాత్రి పట్టుకొని ఓదార్చెను.—'సుందరీ, నీరూపుచేత కొట్టిమిట్టినవాఁడనై నేను వశపఱుచుకొనుటకు ఎన్నియో యుపాయములను, భిక్షుకిముఖముగా ప్రయోగించి, అవి నెఱవేఱనంత, ఈయుపాయమును యావజ్జీవము నిన్ను నాయొక్కనిదానినే చేసికొని క్రీడించుచుండుటకై పన్నితిని. కావున వేఱుశరణము లేని యీదాసునియం దనుగ్రహింపుము.' అని మాటిమాటికి ఆమె పాదములం బడి, నూర్లుగా ప్రార్థనలు పలికి, వేఱుగతి లేని యాతరుణిని తనదానిం జేసికొనెను. —కావున చెప్పితిని దుష్కరసాధనము ప్రజ్ఞ యని.—దీనిని విని ఆబొమ్మరాకాసి నన్ను సత్కరించెను.

ఆక్షణమందే ఒకకొంతముదిరిన పొన్నమొగ్గలంత లావుఁబాటి ముత్తెములు నీటిబొట్టులతోఁ గూడ ఆకసమునుండి పడినవి. నేను ఇదేమని కన్నెత్తి చూడఁగా త్రోఁద్రోపులాడుచున్న, యాభయాభములతోడి యొకయంగనను ఎత్తుకొని పోవుచున్న యొకరక్కసుఁడగపడెను. ఏమి యిది నిష్కామ యయిన స్త్రీని అనాచారుఁడు రక్కసుఁడు బలిమిమెయిం గొనిపోవుచున్నాఁడు!' అని ఆకసమున కెగయ శక్తిలేకయు కైదువు లేకయు తపించితిని. నాస్నేహితుఁడయిన యాతాపసుఁడు 'నిలు నిలు, పాపీ, ఎక్కడికి హరించెదవు!' అని బెదరించుచు ఎగిరి ఆరక్కసునితో కలియఁబడెను. వాఁడు కోపంబున అపేక్షలేక పాఱవైవఁగా దేవతరువుపూవెమ్మవోలె ఆకసమునుండి పడుచున్న యాయింతిని

రెండుచేతులు పైకి చాఁచి పట్టుకొంటిని. కన్య మూఁతపడి వణఁకుచు నాయెదలి తాఁకుడుచేత పులకలు వొడమిన యా యాబలను నేలకు దింపి నిలుచుంటిని. అంతట నాయిరువురు రక్కసులు కొండ శిఖరముల పేటుల వ్రయ్యలతోను వడిగా పెల్లగించిన చెట్లతోను పిడికిటి గ్రుద్దులతోను కాలితాఁపులతోను ఒండొకరిని క్షయ మొందించిరి. మఱి నేను ఆయువతిని ఎత్తుకొనిపోయి మిక్కిలి మృదువును ఇసుక తిన్నె గలదియు పువు లేశములు రాలియున్నట్టిదియు నయిన కొలనిగట్టున దింపి ఆసమెయిం జూడఁగా నా ప్రాణైకవల్లభయే రాజకన్యకయే కందుకవతియే! నామాటలచే ఊఱడిల్లి ప్రక్కవాటుగా నన్నుం గాచి ఆనవాలు పట్టి సకరుణముగా ఏడ్చెను. 'నాథా, ఆ బంతియుత్సవములో నిన్నుం గని రాఁగ మూనిన నన్ను సఖి చంద్రసేన నీప్రశంసలచేత ఊఱడించుచుండెను. నిన్ను పాపాత్ముఁడు నాయన్న భీమధన్వుఁడు నడిసముద్రములో ముంచివైచినాఁ డని విని, నాచెలులను కనుఁ బ్రామి ప్రాణము వదలుదాననై, ఒంటరిగా ఉద్యానవనమునకుం బోయితిని. అచట ఈ రాక్షసాధముఁడు కామరూపుఁడు నన్ను కామించెను. అంత నేను భయపడి వీని ప్రార్థనను ధిక్కరింపఁగా, వీఁడు, మొఱ్ఱోడ్డుచున్న నన్ను పట్టుకొని పఱతెంచి వచ్చి ఇట నిట్లు మడిసినాఁడు. దైవానుగ్రహంబున నాజీవితేశుఁడ వయిన నీ చేతిలోనే పడితిని. నీకు మేలు.' అని.

విని ప్రాణేశ్వరితోఁ గూడ ఓడ యెక్కితిని. లంగ రెత్తఁగా ఎదురుగాలికొట్టి ఓడ ఆదామలిప్తకే మరలిపోయెను. మేము శ్రమలేకుండ దిగుచునే 'కొమారుఁడును కొమారితయు అగపడక పోయినందున వేఱుసంతతిలేని తుంగధన్వుఁడు సుహ్మరాజు ముదుసలి తానును భార్యయు అనఘ మయిన గంగాతటమందు ప్రాయోపవేశముచే మడియం దగలుచున్నాఁడు. ఊరిపెద్దలు వేఱొకదారిని ఒల్లనివారు అతనితోఁ గూడ మృతి నొంద సమకట్టి యున్నారు.' అని సబాష్పవదను లయిన ప్రజలవలన వింటిమి. అంతట నేను జరిగిన వృత్తాంతమును ఆరాజునకు నివేదించి, అతని యపత్యములను ఇరువురను అర్పించితిని. రాజు సంతోషించి నన్ను అల్లునిం జేసికొనెను. అతని కుమారుఁడు నా యనుజీవి యయినాఁడు. నాయాజ్ఞచేత వాఁడు ప్రాణముంబోలె వదలఁగా చంద్రసేనను కోశదాసునిం గూడినది. అంతట సింహవర్మకు తోడ్పడుటకై ఇట కేఁగుదెంచి నినుఁ జూచు నుత్సవము ననుభవించుచున్నాను.—

రాజవాహనరాజు ఈవృత్తాంతమును విని 'ఈదైవగతి చిత్రముగా నున్నది, అవసరములయందు పురుషకారము పుష్కలముగా నున్నది.' అని వచించి, పిమ్మట, మందహాసామృతము మోవిపయి జాల్వాఱ మంత్రగుప్తునిదెస హర్షసంఫుల్లనయనములతో

వీక్షించెను. ఆతఁడు కేలుదమ్మితో నోరు ఇంచుక మూసికొని ప్రియసుందరీకృతదంత క్షతముచేత మోవికెంపు నొచ్చుచుండుటంజేసి ఓష్ఠ్యములు లేని మాటలతో తనవృత్తాంతము ఈక్రింది యర్థముగా వక్కాణించెను.

---

## దశకుమారచరితము - సప్తమోచ్ఛ్వాసము.

### మంత్రగుప్తచరితము.

రాజాధిరాజతనయుఁడా, కొండబిలములోఁ జొచ్చి పోయిన నీగతిని ఎఱుంగఁ గోరి తిరుగుచు నే నొకప్పుడు కళింగదేశమునకుం బోయి, కళింగపట్టణమునకు అతిసమీపము గానట్టి వల్లకాటికి చేరువుగా నున్న యొక్క యడవిచెట్టుక్రింద సరసము లయిన చిగురుటాకుల పఱుకపై కూర్చుండి నిద్రచేత కన్నులు మూఁతపడి శయనించితిని. కాళరాత్రి తలవెండ్రుకల మొత్తము వంటి నల్లని చీఁకటియు త్రిమ్మరెడు రక్కసులును కురిసెడు మంచును తమ యిండ్లలో నణఁగిన సకలజనులును గలిగి కడుం జలిదైన రాత్రి కడచుచుండఁగా, కంటిని ముద్దుగొనుచున్న నిద్రను ఆఁపుచు మహావృక్షంపు కొమ్మల నడుమ నుండి 'ఏమి యిది, ఈపాపాత్ముఁడు ఈపాడు సిద్ధుఁడు క్రీడాసమయమున సయితము పంపువెట్టుచు ఆఁపరాని రాగముచేత అవశుఁడై యున్న యీ జనుని ఇట్లు పీడించుచున్నాఁడు. ఎవఁడయినను అనంతశక్తికలవాఁడు ఈపాడు మాంత్రికుని సిద్ధికి విఘ్నము చేయునా?' అని కింకరియొక్కయు కింకరునియొక్కయు అతిదీన మయిన మొఱ స్పష్టముగా వినఁబడియెను. దానిని విని 'ఈసిద్ధుఁడు ఎవఁడు? ఆ సిద్ధి ఏమి? ఈ కింకరుఁడు ఏమిసేయును?' చూడవలయు ననిగాట మయిన కోరిక డెందంబునం గ్రందుకొనఁగా, నేనును కింకరుఁడు వోయిన దెసగా కొంత దూరము పోయి, అట నొకఁడు తళతళ మెఱయు మానిసి యెముకతునియ నొడలినిండ కయిసేసికొని నిప్పులో కాఁచిన కట్టెలలోని బొగ్గునిగులు మైపూఁతఁగా పూసికొని మెఱుపుఁ దీఁగెలఁ బోని జడలు దాల్చినవాఁడై నానావిధ మయిన కట్టెలు తగులఁగొన్నందున పేర్చుచున్న మంటలచే చుట్టు నున్న యడవిలోని చీఁకటిం జీకాకుసేయుచున్న యగ్నిలో ఎడమచేతిలో నిరంతరము చిట చిట మనుశబ్దముతో నువ్వులను ఆవాలను వేల్చుచున్న వానిని కాంచితిని. అతని ప్రోల ఆ కింకరుఁడు నిలువంబడి దోయిలి యొగ్గి 'ఏమి సేయవలయును? ఆన

లిమ్ము.' అని యడిగెను. ఆ పరమనీచుఁడు 'హో, కళింగరాజు కర్దనుని కొమార్తను కనకలేఖను కన్యాగృహమునుండి యిటకుం దెమ్ము.' అని ముసల వెట్టెను. వాఁడును ఆపని చేసెను.

అంతట మహాభయముతోను బాష్పములచే రాలుపడిన యెలుంగుతోను తట తట కొట్టుకొనుచున్న గుండియతోను 'హా నాయనా! హా అమ్మా!' అని యేడ్చుచున్న యాకన్యను ఆసిద్ధుఁడు వాడిన సిగదండ యూడి ముడివీడిన తలవెండ్రుకల మొత్తము నం బట్టుకొని తాటిపయిం దీడిన కత్తితో తల దఱుగ నుద్యమించెను. నేను తటాలున వానిచేతినుండి యాకత్తి నొడిసికొని, దానితోనే జటాపటలముతోడి వాని శిరమును ఖండించి ఆశిరమును ఆ చెంత నున్న ముదిమద్దిమ్రాని తొఱ్ఱలోపల నుంచితిని. దానిం గాంచి పరమానందంబుం బొంది ఆ రాక్షసుఁడు నెగులు తీఱి 'అయ్యా, ఈనికృష్టుఁడు పెట్టుచుండిన పాటుచేత నా కెప్పుడును కనులకు నిద్ర లేకపోయినది. అదలించును, బెదరించును, చెనుపనులకు పంపును. కావున కల్యాణరాశివి నీవు ఈ నరాధముని యమయాతనలను రుచి గను పని యమనగరమునకుం బంపుట మిక్కిలి సరి యయిన పని. ఇట్లు దయానిధివి అనంతతేజుఁడవు నగు నీ యాజ్ఞను దేనినైన చేయుటకు ఈజనుఁడు కోరుచున్నాఁడు. పని పెట్టుము తడవేల సేసెదు?' అని వచించి ప్రణమిల్లెను. అంత నేను 'మిత్రుఁడా, ఇది సజ్జను లాచరించు పద్ధతి; ఏ దన, ఎంత స్వల్పకారణమున నైన అత్యంత మయిన ప్రీతి వహించుట. నీ కిది యిచ్చగింపని పని కా దేని, ఇదిగో ఈ నతాంగిని క్లేశమునకు తగని దానిని ఈ దురాచారుఁడు మిగుల గాసిం బెట్టినాఁడు, కాన ఈకల్యాణిని కొనిపోయి తనయిల్లు చేర్పుము. ఇంతకన్న మాకు ప్రియతమ మయిన పని యొండు లేదు.' అని ఆజ్ఞాపించితిని. ఆ మాట విని, చెవికొనకు నల్లగలువయవతంసంబుగా నొప్పమీఱునట్లుగా బిత్తరపు నల్ల కనీనికతోడి చూడ్కిని ఇంచుక ప్రక్కవాటుగా నిగిడించుచు, మరుని వింటివలె సొంపయిన వంపు గల బొమతీవను నుదురనెడి నృత్యపుఁ జావిడియందు లీలాలసముగా నృత్యమాడించుచు, నగుమొగ్గన్న యెఱ్ఱని చెక్కుటి రేకులు గలదై, రాగమునకును లజ్జకును నడుమ తిరుగుడువడుచు, మోముఁదమ్మిని అడ్డుగా వాంచి, గోటి కాంతివెన్నెల అడ్డముగా ప్రసరించుచున్న పాదాగ్రముతో నేలను గీఱుచు, ఆలేమ నోటిలోనుండి మోవిచివురును దాఁటుచున్న సన్నని యూర్పుగాలి ఆనందబాష్పధారల చలువతుంపురుల పొంపిరిచేత నానిన చనుదరి గందంపుఁ బూఁతయొక్క తడిని పోఁగొట్టుచున్నదై ఎదగుఱి నేయుటయందు మేటి యగు కంతుకోలకు సాటిగా వెలువడి పలువరుస వెన్నెల నలల నొందింప, ఈమధురాక్షరములను తియ్యన యొలుకు నెలుంగుతో

వెలయించెను:—'ఆర్యా, ఈ దాసీజనమును జముని చేతినుండి ఒడిసి తివిచి పిమ్మట రాగంపు గాలిచే లేచుచున్న యుత్కంఠాతరంగములతోడి మారపారావారంబున ఏకారణంబునం బాలవై చెదవు? నీ యడుగుఁదమ్ములందలి ధూళీరేణువును గా నన్ను భావింపవలయును. ఈ జనమునందు నీవు దయగలదేని, నీ చరణంబులనే గొలుచు భాగ్యమును ఈ జనమున కనుగ్రహింపుము. కన్యాంతఃపురమందుం బ్రవేశించిన రహస్యము బయటఁ బడు ననియు, దానననర్థము కలుగు ననియు శంకింతువేని, అట్టి శంక వలదు. చెలులును చేటికలును నాయందు అత్యంతానురక్తలు; ఈ రహస్యమును ఒరు లెఱుంగక యుండునట్లు నిర్వహింతురు.'

నేనును, కాయజుఁడు చెవిదగుల వింటి తెగలాగి దయమాలి నాయెదను బిట్టు డుయ్యనేసి, ఆ లేజవరాలి కడకంటి చూపుల యినుపసంకెలలతో గట్టిగా బంధింపఁగా, కింకరుని మోమున మాపు నిలిపి చెప్పితిని.—'ఈ రథచక్రజఘన చెప్పినట్లు చేయనేని బేడిసపిడము వేలుపు నన్ను వచింపరాని దశకుం దెచ్చును; కావున ఈ జనుని సయితము ఈ హరిణాక్షితో కన్యాంతఃపురమునకుం గొనిపొమ్ము.' అని. అంతట నారక్కసుఁడు నన్నును శరత్కాల మేఘమండల ధవళం బయిన కన్యామందిరమునకుం గొనిపోయెను. అప్పట నించుకసేపు ఆ చంద్రవదనవచనంబున తద్దర్శనంబుచేతఁ జెదరిన ధైర్యముతోడ ఆ మేడలో నొక్కెడ వేచియుంటిని. చెలియు స్వచ్ఛందముగా నిద్రించుచున్న చెలికత్తెలం గొందఱను చేతితో మెల్లనం దట్టి మేలుకొలిపి వృత్తాంతముం దెలియఁజేసెను. అంతట వారు వచ్చి నాపాదములకు ఔదలం దవిలించి మ్రొక్కి కనుఁగవయందు దట్టంబుగా వెల్లి వోడుచున్నట్టి యానందంపుఁ గన్నీటిబొట్టులతో, తమ క్రొస్వేద దండల యాకరువులలోని తేఁటికూటువుల ఝంకృతులో యను సంశయంబు నాపాదించుచున్న కలాలాపంబుల మెల్లన వచించిరి.—'ఆర్యా, వేఁడివెలుంగును మించిన తేజోవానికి నీవు ఈమె కనులకుం దోఁచినందున మృత్యువు నోటినుండి తప్పి వచ్చినది. గురుతముఁ డయిన చిత్తజాతుఁడు ఈమెను రాగాగ్నిసాక్షికముగా నీకు ఇచ్చినాఁడు. కావున ఓ నలినాక్షుఁడా, రోహణశైలంపుఁ జాపటాయివోలె దృఢ మయిన నీయక్కును రంగతరళ మయిన యీ యుబ్బుగంపుఁ గన్యారత్నము అలంకరించుఁ గాత, ఈమె యొక్క పాలిండ్ల దరియు కరముసాటి యయిన సహచరుని బిగికవుంగిలింతలచేత కృతార్థ మగును గాక.' అని. పిమ్మట నెఱజాణ లా సఖీజనులు నన్ను కడు దిట్టంపు నెయ్యంపు సంకెలల వైచి ఆ సన్నతాఁగితోఁ గూర్చిరి.

అనంతరము ఒకప్పుడు కాంతలం బాసినవారి మనస్సును, గాసిం జెంద, ఆసాసల తేఁటులదాఁటులచేతఁ బొగడకొమ్మలు సోలి వ్రాల, బొట్టుగులు అరణ్యస్థలీలలాటికాలీలను

వహింప, కలాచవిలాసి నిండార విరిసిన కొండగోఁగుఁ బూవు పేరి పసిండి గొడుగును పట్టించుకొన, దక్షిణపు గాలి దయమెయి తీయమావుల యందంపుఁ గ్రొన్ననలను బ్రుచ్చిల, కోకిలల తియ్యనియులివులచేత రాగోద్రేకము నొందిన యెఱ్ఱవాతెఱ క్రాల్గంటులు మదన కదనంబుల మోహరంబులకు సన్నాహంబులు సేసికొనుచుండ, ముగుదకన్నియల యెద దలయందు లజ్జపై రాగము హజ్జ యిడ, దర్దురగిరితటియులచందనలతల కవుంగిలింతలచే చల్లనయిన గాలియొజ్జ యిచ్చు కొనుగోలు ప్రకారము వల్లీమతల్లులు నృత్యములు సేయ, శోభిల్లుఋతువు అవతరించెను. అంతట కళింగరాజు రాణివాసములతోను కొమారిత తోను ఎల్ల పౌరులతోను సూర్యకిరణ నికరములకు చొరరానిదియు, మ్రోయుతేఁటి పాటు వుల దాఁటులచే వంగిన తీఁగలకొసల కిసలయములు నెరసిన యిసుకతావుల నెసకమెసఁగి నదియు, పెల్లుగా నూటాడు కరడంపు దుంపగలజడిచే చల్లనిదియు, నయిన కడలియోర యుద్యానంబున పదియు మూఁడుదినములు క్రీడారసంబు ననుభవించుచుండెను. అట్లు నిచ్చలు నాటపాటలందుఁ దగుల్కొన్న వేనవేల సింగారుల చిట్టకంబులతోడి మరునోరయి కల యగ్గలికపు హర్షోత్కర్షంబున విహరించుచు రాగతృష్ణైకవశుఁడై యున్న యాకళింగ నాథుని సస్త్రీకుని ఆసందులో ఓడలమీఁద పెక్కు రాణువం దోడ్కొని వచ్చిన యాంధ్ర నాథుఁడు జయసింహుఁడు పట్టుకొనియె. భయముచే బెదరిబెదరి చూచుచున్న నాప్రాణే శ్వరిని కనకలేఖను సయితము చెలికత్తెలతోఁగూడ నాతఁడు కొనిపోయెను. అంతట నేను మన్మథానలంపు పేర్పుచేత ఆరగించుచింతం ద్యజించి, దయితనే చింతించుచు, ఒడలి కాంతి యెడలి, ఇట్లు తలపోసితిని.—'కనకలేఖ తల్లిదండ్రులతోఁగూడ పరునిచేత పడినది. దానిం గని ధైర్యముం బాఱఁద్రోచి యారాజు తప్పక స్వీకరింపం గోరును. దాని నొల్లక యాసతి విషజలాదులచేత వెంటనే ప్రాణములం గోలుపోవును. ప్రాణేశ్వరి యట్లగుడు, మకరకేతనుఁడు ఈజనుని కథావశేషతం బొరయించును. ఏమి గతి?' అని.

ఇంతలోపల ఆంధ్రనగరమునుండి వచ్చిన బ్రాహ్మణుఁ డొకఁడు నాకు సంఘటించెను. అతఁడు వృత్తాంతమును వక్కాణించెను.—"జయసింహుఁడు తనకు అనేకాపకారములు చేసియున్న కళింగరాజును కర్దముని పగచేత చంప నెంచియు, ఆతనితనయను కనకలేఖను గన్నంతం బెరిఁగిన మరులుచేత నాతనిం జంప కున్నాఁడు. ఆబాలను యక్షుఁ డొకఁడు పట్టి యున్నాఁడు. ఆమె మఱి యొక నరుని మ్రోల నిలువదు. మాంత్రికసంఘమును రావించి ఆయక్షుని ఉచ్చాటన చేయించుటకై రాజు పాటుపడుచున్నాఁడు. ఎందఱు మంత్రించి నను సిద్ధి లేదు.' అని. అతనిమాటవలన ఆసవోడమి రుద్రభూమిలోని యా ముదిచెట్టుబోదె తొఱ్ఱలోనుండి ఆ జడలమొత్తమును తివిచి దానిని దాల్చి జడదారినై ఒడలెల్ల కనఁబడ

నీయాక బొంతతోను చీరచీవరములతోను కప్పుకొని, కొందఱ శిష్యులం గూర్చుకొని, వారిని నానాశ్చర్యక్రియలచే మోసపోయిన జనులవలన లభించిన యన్నవస్త్రాదు లిచ్చి నిత్యసంతుష్టులం గావించితిని. వారిం దోడ్కొని తరలి కొలఁదిదినములలో నంధ్రనగరమునకుం బోయితిని. ఊరికి ఎక్కువ సమీపము గాక రాయంచపిండు కొలికిన తమ్మి పూరేకుల మొత్తమునుండి రాలిన యాకరువుల తునియలచే పలువన్నెలు గలదై, బెగ్గురుబారులు సిగదండగా నొప్పుచుండ మున్నీటికిఁ బోటి యైన తటాకముదరి నున్న రుద్రభూమిలో ఉనికిపట్టు సేసికొని యుంటిని. నాశిష్యులు వెల్లడింపు నాచిత్రకృత్యములచే ఆకృష్టులై వచ్చిన యూరిజనుల నెల్ల మోసగింపుటయందు నేఱజాణఁడ నై దిక్కుదిక్కునను జనులచేత ఇట్లు పొగడ్తలం బడసితిని.—"మన యూరి రుద్రభూమికడ చెఱువుదరిని పట్టినేలం బరుండు యతి కలఁడే ఆయనకు సరహస్యములు సషడంగములు వేదములును ఇతరము లయినశాస్త్రము లన్నియును జిహ్వాగ్రమం దున్నవి. ఎవని కేవి తెలియవో వానికి అవి ఆయనవలన తెలియును. ఆయన నాలుకకు దబ్బర తగులదు. ఆయన మూర్తీభవించిన దయారాశి. ఆయనవలన అర్థ మెఱుంగుటచేత చిరకాలమునకు దీక్ష సఫలమయినది. ఆయన యడుగుఁదమ్ముల దుమ్మునెఱసులు ఒకకొన్ని నెత్తిం జల్లుకొనిన పలువురకు పలువిధముల యిన రోగములు వెజ్జులకు నజ్జుపడనివి పటాపంచలయినవి. ఆయనపాదములం గడిగిన నీళ్లను శిరంబునం జల్లుటచేత పాపము తీఱిన జనులకు ఎల్లమాంత్రికుల జతనములకును ప్రతిఘటించిన చండతారాగ్రహములు ఒక నిముసమునం బలాయమానము లగును. అతని శక్తికి పరిమితి యెఱుంగ నలవి గాదు. ఆయనకు అహంకార పరమాణు వయినను లేదు." అని.

ఈ ఖ్యాతి పలువురనోరుల సంచరించి కడపట కనకలేఖను పట్టిన యక్షునిం దోలింప నాసక్తుండై తనకు తెలిసినకొలఁదియుం బోరాడుచున్న యంధ్రరాజును ఆకర్షించుటకు సమర్థ మైనది. అతఁడు దినదినము వచ్చి మెండుకొన్న గౌరవముతో నన్నుఁ బూజించుచు, నాశిష్యులను ధనము లిచ్చి వశీకరించుచు, తటి వేచి యొకప్పుడు తనకోర్కి నెఱవేర్చుకొనుటకై మెల్లన వేడుకొనెను. అంత నేను కొంతవడి ధ్యాననిశ్చలుండ నై యుండి యుక్తరీతిని నా యెఱుక కలిమిని గనఁబఱిచి యాతనిం గాంచి నిశ్చయించుకొని చెప్పితిని.—'నాయనా, నీ ప్రయత్నము యుక్తమే. సకల కల్యాణలక్ష్మికి ఏకరాశి యైన యా కన్యారత్నముం బడయుట పాలకడలి మొలనూలిం గయిసేసికొని గంగాదినదీసహస్రము లనెడి ముత్తెపుఁజేరుల పేటలతో రాజిల్లుచున్న భూదేవిని బడయుటకు సాధనము. ఆకొమ్మం బట్టియున్న యక్షుఁడు విలాసమనోరమము లై నల్లగలువలంబోని నాడ్కుల తోడి యాసుందరిని ఏ నరేంద్రుఁడుగాని కనిన నిచ్చగింపఁడు. కావున ఇవ్విషయంబున

మూఁడునాళ్లు ఓరువుము, ఇంతలో ఈకార్యము సాధించు నుపాయమును నే నరసెదను. అట్లు నేను బలుకఁగా సంతోషించి రాజు చనియెను. మఱి నేను రేరాయని కిరణము లేని రాతిరి వేళ దట్టంపుటిరులు ముత్తముల వెల్లువలో దశదిశలును మునింగి యుండఁగా, ఎల్ల జనుల కన్నులును నిద్రచే ముద్రితము లై యుండఁగా, వెలువడి, ఆ తటాకపు గట్టులోపల రేవునకు చేరువకాని యొక్కెడ నీటి యడుగున నక్కి పోయి దూఱఁ దగినదిగా బయట సం దేమియు లేనిదిగా ఒక బిలమును పాటుపడి ఒకానొకత్రవ్వుముట్టుతో త్రవ్వితిని. దాని ద్వారరంధ్రమునకు దట్టముగా రాలను ఇటికలనుం గప్పి ఆతీరప్రదేశముం గూర్చి ఎవ్వరికిని ఏమియు శంక వొడమ దని నిశ్చయించుకొని ప్రాతఃస్నాన విశుద్ధదేహుఁ డనై రక్కల శౌరు లనెడి పేటల ముత్యాలపేరునకు అగ్రంబునం గ్రుచ్చిన రత్నం బును - రేయిరు లనెడి మదపుటేనుఁగును చీల్చు నెఱసింగంబును - పసిండికొండశిఖర మను రంగంబున నటన మాడు విలాసవటుండును - నింగి మున్నీటి మొగిలుకరుల్లపై దాఁటు నొంటరి మొసలియు - సుకృత దుష్కృత సాక్షియు - నగు వేవెలుఁగుల వేల్పును ఎఱ్ఱ దామరతోడి యర్ఘ్యాంజలితో నారాధించి నా యునికిపట్టుం జేరితిని.

మూఁడుదినములకు పిమ్మట క్రుంకుమెట్టుకొమ్ము జేవురు దరికి డోయి యైన సాయం బొరసిన తేజముతో పగటిదొర వలిచులపట్టిం జీకాకుపెట్టునదై నింగిపేరి ముక్కంటి మేన నంటికొన్న సంజకెంపులా యొఱ్ఱగందపుఁ గలపంబుతోడి యొంటిపనుగిండి నా కందు వీఱఁటు చుండు తఱిని, ఆరాజు వచ్చి ఈ నరునికి నేలం గీలించిన చరణంబుల గోళ్లకిరణంబులు తన కిరీటంబుపయింబొలయం బ్రణమిల్లి అంజలి సేసి కూర్చుండెను. అతనికి నే నిట్లుపదేశించితిని. "అయ్యా ఆహా! కార్యసిద్ధిం గనిపట్టితిని. ఈ లోకములో ఆస లేనివానిని సిరు లంటవు. శ్రేయములు ప్రాలుమాలనివారిచేతిలో నిత్య ముండునవి. మిక్కిలి మంచి దయిన నీ నడ వడియు నిష్కళంకముగా అతిభక్తితో నీవు చేసిన నా సేవయు నామనంబును లాఁగఁగా ఈచెఱువును దీనివలన నీకు నేఁడు కార్యసిద్ధి యగునట్లు సంస్కరించితిని. ఈచెఱువున నీవు సగమురాత్రి గడవఁగానే చొరవలయును. చొచ్చినపిమ్మట నీటి యడుగున ఊపిరి బిగఁబట్టి యథాశక్తి పరుండవలయును. అంతట గట్టునుండి జాఱిన నీటియలచే మోఁదువడిన తామరతంపరలోని కదలిన తమ్మితూఁటి ముండ్ల కొనలు ఒడలిం గ్రుచ్చిన రాయంచ బెదరు గద్గద కూజితమును వినుచున్న నరునికి క్షణములో వినఁబడుచు నీటిముత్తముయొక్క యొకానొక మ్రోఁత జనించును. ఆనీటిమ్రోఁత నిలువఁగానే తడి దేహముతో ఇంచుక యొఱుపెక్కిన దృష్టితో ఏరూపంబున వెలువడుదువో సకల లోక నయనానందకరం బగు నా రూపును గాంచి యాయకులుఁడు మ్రోల నిలుచుటకు సమర్థుఁడు గాఁడు. కరము

తీరముగా నెయ్యంపు గొలుసులతో సంకెలల వైవంబడి యున్న కన్యాహృదయము ఒక నిముసములో నిను దర్శించుటకు విఘ్నము నొల్లని దగును. అవలీలగా వైరివర్గములు పరాజితులయి ఈ భూచక్రము అఱచేతిలోని దగు నని యెఱుంగుము. ఇందు సందియము లేదు. ఇట్లు సిద్ధిం గోరుదు వేని నానాశాస్త్రజ్ఞానముచేత బుద్ధిసంస్కారముం బొందినట్టి నీ మంత్రులను ఇంక నీ హితము గోరెడి యితరులను పలువురను కలయం బలికికొని, నూఱుగురను జాలరులను రప్పించి నమ్మకమైన జనశతములచేత చెఱువుయొక్క లోని భాగమును చక్కగా శోధన చేయింపవలయును. గట్టునకు ముప్పది బారల దూరమున సైనికమండలము అక్కఱతో కా పుండవలయును. సందు వెదకి పగతురు ఎపుడేమి సేయఁగోరుదురో, అది ఎవని కెఱుక?' అని. ఈ యేర్పాటు అతని మనస్సున కెక్కినది. అతని యధికృతులును ఆయుపాయంబున మోసముం గన నేరకయు జీనికి కన్నెమీఁది మరులు కలెంబున అది యిచ్చగించి యున్న దనియు అతని యిచ్చను త్రిప్ప నలవి గా దనియు నెఱింగియు అందులకు ఆక్షేపము పలుకరైరి. అట్లు ఆ యుపాయముచేత ఆకన్నియం బడయ గట్టిపట్టుదలతో నున్న యారాజుతో వచించితిని.— 'రాజా, నీనాట నిట చిరకాల ముంటిని. ఒక్కఁడ చిరముండుట మాకు ప్రశస్తము గాదు. నాకార్యమయినంతట నే నిఁక నిట నుండను. నీరాష్ట్రంబున భిక్షాదికముం బొందిన కతంబున నీ కేమేని పని గావింపక పోయిన పెద్దలు నిందింతురు గావున ఇచ్చట నింతకాల ముంటిని. అపని యిపుడు సమకూడినది. ఇంటికిం బొమ్ము. మనోహర పరిమళంబుగల తగిన జలంబులతో స్నానమాడి, శక్తికి తగినట్లు భూసురసంఘము నర్చించి, తెల్లనివి పూదండలును మైపూఁతలుం దాలిచి, వేఁకొలఁది యిలాయులచే రాత్రి చీఁకటిం బంచబంగాళము సేయుచు వచ్చి, సిద్ధికై కడంగుము.' అని. అతఁడు కృతజ్ఞతం జూపువాఁడై 'ఆర్యులు ఇట నుండమిచేత ఈ సిద్ధి నాకు సిద్ధియే గాదు. ఈ నిస్సంగిత్వము ముక్కలి కడిందిది, ఏల యన నిది నిరపరాధు లయిన దాసులను విడిపించుచున్నది. మతి మహనీయులమాటలకు అడ్డు చెప్పఁగూడదు.' అని స్నానార్థము ఇంటికిం బోయెను.

నేనును లేచి నిర్మానుష్యమయిన రాత్రిసమయంబున చెఱువుగట్టులోపలి బొక్కలోఁ దూఱి ఆసన్న పుఁగంతకడ చెవి యొగ్గి వేచి యుంటిని. అర్ధరాత్రసమయంబున నా చెప్పిన పనులెల్లం గావించి ఆయాయితావుల కాపు లుంచుకొని ఆరాజు జాలరుల రప్పించి వారిచేత చెఱువులో శల్య మేమియు లేకుండ శుద్ధి చేయించి, నిర్భయముగా నొయ్యారము మీఱ దిగెను. దిగి తలవెండ్రుకలు విరియఁ బోసికొని ముక్కు చెవులు బిగఁబట్టుకొని ఏనుఁగులోఁతున చెఱువునీటియడుగున నా చెప్పినట్లు పరుండియున్న యాతనిని నీట మునింగి మొసలియీఁతగా నీడుకొనిపోయి బొంతతో మెడం బట్టుకొంటిని. కడు బెడిదము లయిన జముని లగుడంపు

మోఁదులకన్న గాటములైన కాలుసేతుల ప్రేటుపోటులచేత కనికరమేది పీఁచమడఁప ఒక్కనిముసములో వాఁడు చేష్ట యుడిగెను. అంతట వాని శరీరము నీడ్చి గట్టులోపలి యాబిలములో పెట్టి నీటినుండి వెలువడితిని. తత్క్షణమే వచ్చి కలసికొనిన సైనికులకు ఆమూలాంతరప్రాప్తి అత్యంతాశ్చర్యకర మాయెను. ఏనుఁగుకంద మెక్కి వెల్లగొడుగు లోనుగా సకల రాజచిహ్నవిరాజితుండనై కరముచుఱుకు మనెడు వేత్రహస్తులబెత్తపుప్రేటులకు జనులు జడిసి వారి తొలఁగుడు రాజవీథిం బోయి యారాత్రిని కనకలేఖాదర్శనోత్సుకుఁడనై నిద్ర లేకయే గడపితిని.

లత్తుకనీటిపూఁతతో నలంకరించిన యైరావతదిగ్గజకుంభంబునకు సదృశంబై ఇంద్రదిగ్వనిత యొక్క కెంపుటద్దంబైన రవిబింబము జనులకనులకుం దోఁపఁగా, కరణీయంబులం దీర్చికొని, దట్టంపు కిరణనికరములనీడి రత్నములశ్రేణులతో దగదగ మెఱయుచున్న సింహాసనము నధిష్ఠించినవాఁడనై వాఁడుకచొప్పన దర్శనము చేసికొన్నవారై శంకాసంకలితచేతస్కులై సన్నిధియందు కూర్చున్న సచివులతో పలికితిని. "ఋషులప్రభావమును చూడుఁడు. తామరతంపరతో వెలుంగుచు తేంట్లకు హర్షమొదవించుచున్న యాసరస్సునకు ఇంద్రియాజయ్యుఁడు ఆ యతి యాపాదించిన రజోదూరంపు సంస్కారముచేత తమ్మిరేకుల శుద్ధియైన చాయగలదై తొంటికంటె మనోహరంబయిన క్రొత్త యాకారము సిద్ధించినది. ఇప్పుడు నా స్త్రీకుల కెల్ల లజ్జచేత శిరము వాలునుగదా. కావున నిపుడు శివకేశవబ్రహ్మాది దేవనాయకుల తావులయందు భక్తిశ్రద్ధలతో నృత్తగీతాది సేవలు చేయింపుఁడు, ఈ యింటినుండి యాచకులును దారిద్ర్యము నుడుపఁగలంతటి ధనరాసులను కొని పొమ్మనుఁడు" అని. ఆశ్చర్యరసాతిశయముచే సంతోషముం దెలుపు చూపులతో వారు 'జే! జగదీశ్వరా, నీతేజముచే దశదిక్కులను ఆక్రమించి నీయశస్సుచేత పూర్వరాజుల యశస్సును గ్రమ్ముచు వర్ధిల్లుము.' అని పలుమాఱు దీవించి నాపనిచిన పనులెల్ల సరిగాఁ గావించిరి. పిమ్మట నేను నావల్లభకు తన హృదయమువోలె విశ్వసనీయ యయిన యంతరంగసఖిని శశాంకసేన యనుదానిని కన్నెను ఒకప్పుడు ఏదో పనిమీఁద వచ్చినదానిని రహస్యంబుగా 'బాలా, ఈ జనుని ఎప్పుడేని చూచి యుంటివా?' అని హెచ్చరించితిని. అంతట ఆనందరసావధిం బొందిన డెందంబుతో నక్కలికి ఇంచుక కానిపించు పలుఁగాంతి తీవియను లీలగా నల్లనల్లన నాడించుచు అందంబులు గులుకు వ్రేలిని మోవిచివురుపై నిడి ఆనందబాష్పములజడి కన్నులనుండు కాటుకం గడగినవైన, అంజలి యొగ్గి, ఐంద్రజాలికుని మాయ యేమియు ఇట్టిది కాదేని, చక్కఁగా ఎఱుఁగుదును. ఇదెట్లో చెప్పుము.' అని ప్రేమచేత ఆటంకము లేకుండ మెల్లన నడిగెను. నేను దానికి వృత్తాంత మంతయుం జెప్పి దానిముఖమున నాప్రియకు సందేశముం బంపి హృదయాహ్లాదంబు గలిగించి, పిమ్మట ననగ్గళీకృతుఁడై మిక్కిలియు

సమ్మానితుఁ డైన కళింగరాజువలన నాయంబానం బ్రదాన పూర్వకముగా నాప్రియతమం బొంది ఆంధ్ర కళింగరాజ్యములను కళింగరాజునందు నుంచితిని. మఱి యిపుడు శత్రువు పైకొనఁగోరిన యీ యంగరాజునకు సాయపడుటకై నొప్పదండుతో వచ్చితిని, ఇట నిన్ను మిత్రులసంగడిచే రంగారుచున్న వానిని యాదృచ్ఛికముగా దర్శించి ఆనందరాశిలో మునింగిన డెందంబుతో నున్నాఁడను.

అతని యీ నేర్పును నగవువెన్నెలం జలక మాడుచున్న పలుకులుగలవాఁడై రాజవాహనదేవుఁడు 'మహామునియొక్క యీ చరిత్రము చిత్రముగా నున్నది; అతికష్ట మయిన తపస్సు ఇటనే ఫలించినది. మేలంపుమాట లటుండుఁ గాక, ఇందు సంతోషప్రకర్షంబుం బొందిన ప్రజ్ఞాసత్త్వముల స్వరూపము కనఁబడినది.' అని వచించి 'మఱి నీవు దిగవయ్యా,' అని విశ్రుతుని పెక్కువినికి గలవానిని నిండారఁ విరిసిన వారిజాతములం గరుకంటితో కటాక్షించెను. అతఁడును, చెప్పసాగెను.

---

## దశకుమారచరిత్రము - అష్టమోచ్ఛ్వాసము.

## విశ్రుతచరితము.

---

దేవా, నేను సంచరించుచు వింధ్యారణ్యములో నొక్కెడ బావికడ ఆఁకలిదప్పులచే గాసిలుచున్న యొక బాలుని క్లేశపడరానివారిని ఎనిమిదేండ్లవానిని కంటిని. అతఁడు భయముతో డగ్గుత్తికతో నిట్లు వచించెను.—'మహాభాగుఁడా, ఆర్యా, ఇడుమఁబడిన నాకు సాయము చేయుము. నాకు ఒకఁడే రక్షకుఁడైన యొకముసలియాతఁడు నాప్రాణములను హరింప నున్నదప్పిని తీర్చుటకు నీళ్లు చేఁదుచు ఈ బావిలో పడిపోయినాఁడు. నే నతనిని లేవఁదీయలేకున్నాను.' అని. అంతట నేను సమీపించి ఒకతీఁగెతో ఆముసలివానిని కట్టి యెత్తి, ఆబాలుని వెదురుగొట్టముతో తోడిన నీళ్లు త్రాగించి, బాణముమొగయునంత యెత్తయిన గజనిమ్మమాని కొనారుకొమ్మనుండి రాలతో రాల్చిన యిగాలుపండ్లతోఁ బ్రీతితో బ్రదికించి, చెట్టుక్రింద కూర్చుండి ఆ ముసలియాతనిని 'బాబూ, ఈబాలుఁ డెవఁడు? నీ వెవ్వఁడవు? ఈయాపద యెట్లు గలిగినది?' అని యడిగితిని. అతఁడు కన్నీళ్లతోడ డగ్గుత్తికతో చెప్పెను.

మహాభాగుఁడా ఆకర్ణింపుము:— విదర్భ మని దేశము కలదు. అందు భోజవంశమునకు అలంకారము, పుణ్యవర్మ యను రా జుండెను. ఆయన ధర్మమునకు అంశావతారముం బోనివాఁడు, మహాసత్త్వుఁడు, సత్యవాది, దాత, వినీతుఁడు, ప్రజలను రక్షించువాఁడు,

సేవకులను రంజించినవాఁడు, కీర్తిమంతుఁడు, ఆజానుబాహువు, గొప్ప బుద్ధిమంతుఁడు, పురుషకారప్రవణుఁడు, శాస్త్రమును పాటించువాఁడు, సాధ్య మయిన మంచికార్యములను ఆరంభించును, పెద్దలను గారవించును, సేవకులను ప్రభువులం జేయును, బంధువులకు అభ్యుదయము సేయును, పగతురను లోఁబఱచును, పనికి రాని మాటలను వినఁడు, గుణములకు ఎప్పటికిని తనియఁడు, కలలయందు కరము ఓలలాడినవాఁడు, ధర్మార్థసంహితలయందు అత్యంత సమీపస్థుఁడు, ఇంచుక యుపకారమునకు అపరిమితముగా ప్రత్యుపకారము సేయును, బొక్కసమును వాహనములను పరిక్షించుకొనును, ఎల్లయధ్యక్షులను ప్రయత్నపూర్వకముగా పరీక్షించును, చక్కఁగా పనిసేయువారిని తగిన దానసత్కారముల చేత ఉత్సాహపెట్టును, దైవికములును మానుషములును అగు నాపదలకు తత్క్షణమే ప్రతిక్రియ సేయును, షాడ్గుణ్యప్రయోగ నిపుణుఁడు, చాతుర్వర్ణ్యంబును మనుమార్గంబున నడిపించును, పుణ్యయశసుఁడు. ఆయన పుణ్యకర్మములు చేయుచు పురుషాయుషము జీవించి పిమ్మట ప్రజల యపుణ్యముచేత దేవభూయంబుం బొందెను.

ఆయన పిమ్మట అతని సుతుఁడు అనంతవర్మ భూమికి భర్త యాయెను. అతఁడు సర్వగుణసమృద్ధుఁడయ్యును దైవయోగంబున దండనీతియందు వలసినంత అక్కఱ వహింపకుండెను. అతని నొకప్పుడు ఏకాంతమున వసురక్షితుఁ డను వృద్ధమంత్రి అతనితండ్రికి ఆప్తుఁడు వాగ్మి వచించెను.—"బాబూ, నీకు పురుషసంపద సర్వము పుట్టుకతోఁగూడ కొఱ లేనిదిగా నున్నది. నీ బుద్ధియు స్వభావముచేతనే పటువు, నృత్తగీతాది కళలయందు చిత్తరువులయందు కావ్యవిస్తరములయందు విరివిం జెంది ఇతరులబుద్ధికంటె మెఱుఁగైయున్నది. అయినను అది అర్థశాస్త్రములయందు సంస్కారము పొందక అగ్నిలో శుద్ధిం బొరయని బంగారంబువోలె సరిగా ప్రకాశింపదు. బుద్ధి చాలని రాజు ఎంతగొప్పవాఁ డయినను తనమైకి పరు లెక్కుచుండుటను కనిపట్టనేరఁడు. సాధ్యమును సాధనమును వేర్వేఱుగా చేసి వర్తిల్లను గూడ సమర్థుఁడు గాఁడు. ఉండవలసినట్లు ఉండనివాఁడు పనులయందు భగ్నుఁడయి తనవారివలననేగాక పరులవలనం గూడ అవమానము నొందును. అవమానితుని యాజ్ఞ ప్రజల యోగక్షేమములను సాధించుటకు సమర్థము గాదు. ప్రజలు అతని యాజ్ఞ మీఱి ఏమేని చెప్పుచు ఎట్లేని వర్తిల్లుచు ఎల్ల కట్టుదిట్టములను కలిపి వేయుదురు. కట్టుఁబాటులు లేని ప్రజలు ఇహపరములకు తాము తొలఁగుటయె గాక ఏలికను సయితము తొలఁగింతురు. శాస్త్ర మను దివ్వెచేఁ జూడఁబడిన దారివెంట లోకయాత్ర సుఖముగా సాగుచుండును. శాస్త్ర మనఁగా భూత వర్తమాన భవిష్యత్తులను చాటుపడినవానిని దూరపువానిని ఓటొందక తేటతెల్లముగా చూపెడు దివ్యదృష్టి సుమా. అది లేని జంతు

మాత్రుఁడు దీర్ఘ విశాలనేత్రుఁ డయ్యును అర్థముల నెఱుంగఁ జాలమిచేత అంధుఁడే కావున బయలి విద్దెలయందు సక్తిని సడలించి కులవిద్య యయిన దండనీతిని నేర్చుకొనుము. దాని ప్రకారము వ్యవహరించుటచేత ప్రభు మంత్రోత్సాహ శక్తుల సిద్ధిని అలవరించుకొని అనుల్లంఘితాజ్ఞుఁడవై చిరకాలము కడలియొడ్డాణపుభూదేవిని ఏలుము." అని.

దీని నాకర్ణించి రాజు 'యుక్తముగానే గురువులవారు నేర్పినారు. అట్లు చేసెదను.' అని పలికి అంతఃపురమునకుం బోయెను. అట ఆవృత్తాంతమును రాజు ప్రసక్తివశమున ప్రమదల గోష్ఠిలో వక్కాణింపఁగా, నిపుణుఁడు రాజప్రసాదముచే ప్రసిద్ధి నొందినవాఁడు గీత నృత్య వాద్యాదులయందు తన్మయుఁడు, బయటి చెలువల తగులగొండి, గడుసు, కట్టు లేని నోటివాఁడు, పెక్కు తెఱంగుల యాకతాయి, మాటలయందు మేటి, ఒరుల గుట్టులను వెదకువాఁడు, వేళాకోళము సేయువాఁడు, నిందించువాఁడు, కొండెములు సెప్పుట యందు పండితుఁడు, మంత్రిమండలమువలన నయితేను లంచములు కొనువాఁడు, సమస్త దుర్నీతులనుం గఱపెడియొజ్జ, మదనతంత్రములకు చుక్కానుపట్టువాఁడు, కుమార సేవకుఁడు, విహారభద్రుఁ డనువాఁడు చిఱునవ్వుతో విన్నవించెను.

దేవా, దైవానుగ్రహంబున ఎవ్వఁడేని ఐశ్వర్యమునకు పాత్ర మాయెనా, అతనిని నానావిధము లయిన యాసలు గొల్పి మోసముచేసి ధూర్తులు తమకార్యములు నెఱవేర్చుకొందురు. అందులకుముం దెల్లివిడి:— కొందఱు మృతి కనంతరము పొందఁదగిన యభ్యుదయాతిశయములపై ఆస పుట్టించి, తలను గుండు సేయించి, దర్భత్రాళ్లతోఁ గట్టి, తోలుతోఁ గప్పి, వెన్న పూసి, తిండి లేకుండం బరుండఁ బెట్టి, సకల ధనమును చేకొందురు. ఎవఁడేని గడుసువాఁడు ఈ యెండమావులకై చేత నున్నదానిని వదల నిచ్చగింపఁడేని, వానిని ఇతరులు చుట్టివేసికొని చెప్పుదురు.— 'మా యుపదేశించు మార్గమునం జరించువానికి ఒకకాకిణి నేనియు లక్షకార్షాపణములు చేసెదము, కైదువుతో పనిలేకయే సర్వ శత్రువులను చంపించెదము, అసహాయుఁ డయిన మనుష్యమాత్రుని చక్రవర్తిని చేసెదము.' అని. అంతట నాతఁడు 'ఆమార్గ మేది?' అని వీరి నడుగును. వీరు చెప్పుదురు:— 'ఓయి, రాజవిద్యలు నాలుగు, త్రయి వార్త ఆన్వీక్షికి దండనీతి యనునవి. అందు మూఁడు త్రయీ వార్తాన్వీక్షికులు గొప్పవి, విలంబముగా ఫలించునవి. వాని నటుండనిమ్ము. దండనీతిని అభ్యసింపుము. దానిని ఈనడుమ ఆచార్యవిష్ణుగుప్తుఁడు మౌర్యునికై ఆఱువేల శ్లోకములుగా సంగ్రహించినాఁడు. దానిని చక్కఁగ నేర్చి ప్రయోగించినయెడల అదియె మా చెప్పిన కార్యసిద్ధిని కావించును.' అని. అతఁడు సరియే యని చదువును, వినును, అందులోనే మునిమిం జెందును. మఱి యాశాస్త్రము శాస్త్రాంతరములతో సంబంధపడియున్నది.

వాప్రపంచము నంతయు ఎఱుఁగనివానికి దానితత్త్వము బోధపడదు. కాని, అల్పకాలము నకో అధికకాలమునకో దాని తత్త్వము బోధపడు ననుకొందము. బోధపడినవాఁడు ఆదిలోనే భార్యాపుత్త్రులను సయితము నమ్మఁగూడదు, తన కడుపుకొఱకుఁ గూడ ఇంతవిద్యామునకు ఇన్నికట్టియలు చాలును, అని కొలిచి తూఁచి యియ్యవలయును.

నిద్ర మేలుకొఁగానే రాజు మొగంబు కడిగికొనియు కడుగుకొనకముందే ముష్టి నైనను అరముష్టి నయినను వదలక సమస్త మయిన యాయవ్యయములను పగలు తొలియరజాము సేపు వినవలయును. ఇతఁడు వినుచుండఁగానే ఇతనిం గనుఁ బ్రామి వంచకులు ఆయధికారులు రట్టింపు అపహరింతురు. చాణక్యుఁడు చెప్పిన యపహరణోపాయములను నలువదింటిని వారు తమబుద్ధిబలముచేత వేయింటిని గా కల్పింతురు. రెండవయరజామున ఒండొరులతో వివాదపడుచున్న ప్రజల తిట్టులచేత చెవులు కాలుచుండ కష్టముగా బ్రదుకును. అందును న్యాయవాది ప్రభృతులు తమయిచ్చ చొప్పున ఓటును గెలుపును చేయుచు, పాపమును అపకీర్తిని తనికిడి, ధనములను తాము కైకొందురు. మూఁడవ యర్ధయామంబున స్నానభోజనములకు అవకాశముం బడయును. భుజించిన యాతనికి అన్నము జీర్ణ మగునందాఁక విషభయము వదలదు. * నాలవయరజామున బంగారముం గయికొనుటకై చేయిచాఁచుచునే లేచును. * ఐదవ యర్ధయామమున మంత్రాలోచనచేత అత్యంతాయాసముం బొందుఃను. అక్కడఁగూడ మంత్రులు పైకి మధ్యస్థులవలె నటించుచు లోలోపల ఒండొరులతో ఒకటియై దూతలయు చారులయు వాక్యములను శక్యాశక్యతలను దేశకాలకార్యస్థితులను గుణము దోషముగాను దోషము గుణముగాను తనయిచ్చప్రకారము మార్చుచు తమయొక్కయు పగతురయొక్కయు మిత్త్రులయొక్కయు మండలములను ఆశ్రయించి జీవించుచు రహస్యముగా బయటికోపములను లోపలికోపములను పుట్టించుచు ప్రకటముగా వాని నణఁగించుచు తమదొరను అస్వతంత్రునిఁ జేసి కైవసముచేసికొందురు. ఆఱవయరజామున స్వేచ్ఛావిహారముగాని మంతనంబుగాని సేవింపవలయును. ఈతనికి స్వేచ్ఛావిహరణ మెంతమాత్ర మనఁగా మూఁడును ముప్పాతిక గడియలు. * ఏడవయరజామున చతురంగబలమును కని పరీక్షించికొనెడి ప్రయాస. * ఎనిమిదవయరజామున దళవాయితోఁ గలసి విక్రమచింత సేయుటవలనిదుఃఖము.

మఱి సంధ్యావందనము చేసినవెంటనే రాత్రి మొదటి యెనిమిదవభాగంబున గూఢపురుషులను చూడవలయును. వారిచేత అతిక్రూరము లయిన శస్త్రాగ్నివిషప్రయోగములు చేయింపవలయును. * రెండవభాగంబున భోజనానంతరము శ్రోత్రియునివలె స్వాధ్యాయమారంభించును. * మూఁడవదాన వాద్యఘోషతో శయనించును. * చతుర్థపంచమములు

నింద్రించు నఁట. నిరంతరచింతాయాసములచే మనస్సు బెగ్గడిల్లి యున్న యావరాజునికి మంచినిద్ర యెక్కడిది? * మఱి అఱవభాగమున శాస్త్రవిచారారంభము. * ఏడవదాన మంతనము గ్రహించుట, దూతాదులను పంపుటయు. దూతలా మఱి ఇరుపక్షములవలనను మంచిమాటలు చెప్పి సంపాదించుకొన్న ధనములను సుంకపుబాధలేని దారిలో వర్తకము చేత వృద్ధిచేసికొనుచు లేనిపని నయినను ఇంచుక కల్పించుకొని సదా త్రిమ్మరుచుందురు. * ఎనిమిదవభాగమున పురోహితాదులు వచ్చి ఈయనతో వచింతురు.—'ఈరాత్రి కన్నది దుఃస్వప్నము, గ్రహములు శుభస్థానములలో లేవు, శకునములును అశుభములు.— శాంతులు చేయవలయును, హోమసాధన మెల్ల బంగారముగానే యుండవలయును, అట్లు చేసిన కర్మకు ఎక్కువఫలము కలుగును. ఈబ్రాహ్మణులు బ్రహ్మవంటివారు, వీరు చెప్పునట్టి స్వస్త్యయనము కరము శుభకరము అగును, వీరు కడుఁ బేదటికమును పెక్కుండ్రు బిడ్డలును ప్రభావంబును గల యజ్వలు, ఇప్పటికి ప్రతిగ్రహ మెఱుంగరు, వీరి కిచ్చుటచేత స్వర్గతి, ఆయుర్వృద్ధి, అశుభనాశనమును కలుగును.' అని చెప్పి మఱియు మఱియు ఇప్పించి వారిమూలముగా తాము రహస్యముగా భక్షింతురు.

ఈతీరున రేయుంబవలు ఇంచుకేని సుఖము లేక శ్రమలతో నిండి నిరంతరము పీడతో కాలము గడపువానికి చక్రవర్తిత్వముమాట యటుండనీ, తనరాష్ట్రము నయితము కాపాడుకొన నలవి గాదు. నీతిశాస్త్రజ్ఞుఁడని ప్రసిద్ధిఁ జెందినవాఁడు దేనిని ఇచ్చునో ఏసత్కారము చేయునో ఏప్రియవచనము పలుకునో అది యెల్లను వంచించుట కని అపనమ్మకము. అపనమ్మకమునకు భాజన మగుట అలక్ష్మికి జన్మస్థాన మగుట. ఏపాటి నీతిలేకపోయిన లోకయాత్ర జరుగదో ఆపాటి లోకమువలననే తెలియును; అందులకు శాస్త్రముతో పనిలేదు. చంటిబిడ్డఁడు నయితము ఆయాయుపాయముచేత తల్లిపాలను పొందం గడంగును. కావున అతినిర్బంధమును అవలికి నెట్టి, యథేష్టముగా ఇంద్రియ సుఖములను అనుభవింప వలసినది. మఱి, 'ఇంద్రియములను ఈవిధముగా నిగ్రహింపవలసినది, ఇట్లు అరి షడ్వర్గమును విడువ వలయును, సామాద్యుపాయములను నాల్గింటిని తనవారియందును పెఱవారియందును సర్వదా ప్రయోగింపవలసినది, సంధి విగ్రహముల విచారములోనే కాలము గడపవలయును, సుఖమునకు కొంచె మయినను చోటు ఇయ్యఁగూడదు.' అని ఎవరు చెప్పుదురో ఆమంత్రి కొంగలు మీవలననుండి దొంగిలించి గడించిన ధనమును వేశ్యాగృహములలోనే అనుభవింతురు. ఈ నీతిశాస్త్రగ్రంథములను చేసిన వరాకులు కలరే మంత్రమంచు కడుగడుసరులు శుక్రాచార్య సురాచార్య విశాలాక్ష బాహు దన్తిపుత్రి పరాశర ప్రభృతులు వారయినను అరిషడ్వర్గమును జయించినారా? శాస్త్రోక్తమార్గమున నడచుకొన్నారా? వారా

రంభించిన పనులందుఁ గూడ అవు గాములను చూచియున్నాము. చదువనివారిచేత మోసపోయిన చదువరులు పెక్కండ్రు.

ఇది దేవరకు సిద్ధముగా నున్నది గదా. ఏ దన,—ఎల్ల జనులచేతను పూజ్య మయిన జాతి, పటిమయెడలని యౌవనము, అంద మయిన దేహము, మేరలేని యైశ్వర్యము; దానినెల్ల ఎల్లయపనమ్మకములకును కారణంబును సుఖానుభవమునకు ప్రతిబంధకంబును నానావిధ వికల్పములచేత ఎల్లపనులయందును సంశయాకులంబును అగునట్టి స్వరాష్ట్ర పరరాష్ట్రచింతల చేత, దొరా, వృథసేయకుము! దేవరకు, పదివేలయేనుఁగులు, మూఁడులక్షలగుఱ్ఱములు, లెక్కలేనికాల్బలమును కలవు గదా. బొక్కసములు పసిఁడితోను రతనములతోను నిండియే యున్నవి. ప్రాణిలోక మెల్ల ఎడతెంపు లేక వేయియుగములు అనుభవించినను నీయుగ్రాణములు తఱుఁగవు. ఇది చాలదా యేమి ఇంక నార్జింపు మని హెచ్చరించుటకు? పుట్టినవారికి జీవితకాలము అనునది నాలుగయిదు దినములు. అందులోను భోగముల కనుకూల మగునట్టిది అతిస్వల్ప మయిన ప్రాయపుఁ జిద్రుప. తెలివి లేనివారు ధనము సంపాదించుచునే నశింతురు, గడించిన దాన లేశ మయినను అనుభవింపం గడంగరు. వే యేల? రాజ్యభారమును మోవ సమర్థులును అంతరంగభూతులును అనురక్తులును అగువారిమీఁద మోపి అచ్చరలకు దొద్దు లయిన రాణివాసములతో క్రీడించుచు గీత సంగీత పానగోష్ఠులను ఆ యా ఋతువునకు తగినట్లు అనుభవించుచు దేహలాభమును సఫలీకరింపుము.— ఇట్లు వచించి సపంచాంగ నమస్కారముం గావించి శిరమున నంజలిం జేర్చి పడియే యుండెను. అంతఃపుర మత్తకాశిను లెల్లరు ప్రీతివికసితనయన లై బిగ్గరగా నవ్విరి. రాజు కూడ చిఱునవ్వుతో 'లెండి, అయ్యా, హితము నుపదేశించినందున తమరు గురువులరు గదా; ఏల గురుత్వమునకు విపరీతముగా ఆచరించెదరు?' అని వానిని లేపి విశృంఖలముగా క్రీడలం దేలుచుండెను.

పిమ్మట ఈనడుమ మఱల మఱల మంత్రివృద్ధుఁడు పూర్వోక్తవిషయములో హెచ్చరిక సేయుడు, రాజు సరియే యని మాటమాత్రము పలికి చిత్త మెఱుఁగనివాఁ డని మనస్సులో ఏవగించెను. అంతట మంత్రి ఇట్లు తలపోసెను.—"ఔరా! తెలియక నే నెంత పొరఁబాటు గావించితిని! అప్రియ మయిన విషయమున ప్రోత్సహించి ద్వేష్యుఁడను పరిహసనీయుఁడను నైతిని! ఇతని వర్తన నావిషయమున మునుపటిదిగామి స్పష్టము. అది యెట్లన.—నన్ను నెయ్యముతో చూడఁడు, నవ్వుచు పలుకరింపఁడు, రహస్యములు చెప్పఁడు, చేయి తాఁకఁడు, కష్టములకు జాలిగొనఁడు, ఉత్సవములందు అనుగ్రహింపఁడు అభిలషణీయ వస్తువులను పంపఁడు, నాసుకృతములను గణింపఁడు, నాకుటుంబవృత్తాంతము నడుగఁడు, నా పక్షమువారి నవలంబింపఁడు, నన్ను తన సమీపమందలి కార్యములలో చేర్చుకొనఁడు, నన్ను

అంతిపురమునకు రప్పింపఁడు. పయిగా నన్ను అనర్హమయిన పనులకు పనుచును, నాయాసనమును అన్యు లాక్రమించిన నంగీకరించును, నా వైరులయందు విశ్వాసము చూపును, నామాటకు ఉత్తర మియ్యఁడు, నాదోషము గలవారిని నిందించును, ఆయువుపట్టున నన్ను పరిహసించును, తనయభిమతమునే నేను వర్ణింతు నేని నిరాకరించును, నా పంపెడు వెలపొడుగు వస్తువులను అంగీకరింపఁడు, నీతిజ్ఞుల పొరఁబాటులను నాప్రోల మూర్ఖులచే ఉద్ఘోషింపించును. చాణక్యుఁడు సరిగా చెప్పినాఁడు ‘చిత్తమెఱిఁగి అనువర్తించువారు అప్రయోజను లయినను ప్రియు లగుదురు, కుశలు లయినను చిత్తానువర్తన లేనివారు ద్వేష్యు లగుదురు.’ అని. అయినను గతి యేమి? అవినీతు నయినను ఈ రాజును తండ్రి తాతల నాఁటినుండి వచ్చిన మాబోఁటివారు వదలఁగూడదు. వదలక యున్నను మామాటను వినసప్పుడు మేము ఏమి యుపకారము చేయఁగలము? ఎల్లవిధములను నీతివంతునికి అశ్మక రాజునకు వసంతభానునకు ఈ రాజ్యము హస్తగత మగును. రానున్న యిడుము లయినను ఇతనిని కుదురుపఱుచును గాక. సులభదుఃఖము లయిన చెడుగులనీఁద నొక్కొక్కఁడ కలిగెడు సేవయేని ఇతనికి మంచినడవడిని రుచింపఁజేయదా? కావున చెడుగయినను అగుఁగాక. కొండీంద్రనాలుకలను కట్టి ఎట్లో ఒకయట్లు అధికారమును పోఁగొట్టుకొనక యుండెదను.” అని.

మంత్రి యిట్లు ఉండఁగా, రాజు కామపరతంత్రుఁడు కాఁగా, ఇంద్రపాలితుఁడని అశ్మకేంద్రమంత్రియగు నింద్రపాలితుని కొమారుఁడు, తాను దుర్వర్తనుఁ డని తండ్రి తన్ను తఱిమివేసిన ట్లనిపించి, తనకు గాణీలయు గాణులయు పెక్కుగణములును, ఎక్కుడు నేరిమి గల శిల్పకారిణులు పెక్కురును, మాఱువేసంబుల పెక్కు కింకరులు గల గూఢపురుషులును, పరివారముగా వెంటరా, తాను వచ్చి నానావిధక్రీడలచేత విహారభద్రుని వశము చేసికొనెను. వాని మూలముగా రాజునొద్ద ప్రవేశము పొందెను. సందుం బొందినవాఁడై తాను ఏయేవ్యసనమును రాజు ఆరంభించునో దానిని బళీ యనును.—

దేవరా, వేఁట యట్లు మేలు సేయునో అట్లు మఱి యొకటి సేయదు. ఇందు సాము మెఱుఁగెక్కుటచేత ఆపదలందు మేలు సేయునదియు దూరము నడువ నోపునదియు నైన పిక్కబలిమి, శ్లేష్మము తఱుఁగుటచేత ఆరోగ్యమునకు ముఖ్యకారణ మయిన జఠరాగ్ని దీపనము, క్రొవ్వుం గరఁగించుటచేత అవయవములకు స్థిరత్వము కఠినత్వము కడుంజులుకన లోనగు గుణములు, చలిని ఎండను గాలిని, వానను ఆఁకటిని దప్పిని ఓర్చుశక్తి, దశావిశేషములందు జంతువులు తలంచునట్టి తలంపులను చేయునట్టి చెయిదములను ఎఱుంగుట, జింకలు అడవి దున్నలు గవుపోతులు లోనగువానిని చంపుటచేత పైరులను నాశమునుండి కాపాడుట,

తోఁడేళ్లు పులులు లోనగువానిని పరిమార్చుటచేత అడవి దారులయందలి యిడుమల నెడలించుట, నానాకార్యములకు అనుకూలము లయిన పర్వతారణ్యప్రదేశములం గనుట, అడవి మనుష్యులకెగలకు విశ్వాసము పుట్టించుట, ఉత్సాహశక్తిని గగల్పుటచేత పగఱను దిగులొందించుట, అని బహువిధప్రయోజనములు భాసిల్లుచున్నవి. * జూదమందును ధనరాసులను గడ్డిపోఁచవలె ఇచ్చుటచేత సాటిలేని చిత్తౌదార్యము, జయాపజయములకు నిలుకడ లేమిచే ఖేదమోదములకు లోనుగామి, పురుషకారమునకు ముఖ్యకారణ మైనమచ్చర మెచ్చుట, సారెలయందు చేతియందు ప్రదేశమందును గూహితము లైవమాత్రమును కనిపట్టం దగముగాని మోసపుఁజేఁతలను కనిపట్టుటచేత అమిత మయిన బుద్ధికుశలత, ఒక్కవిషయమునందే నిలుపుటచేత మనస్సునకు అతిచిత్ర మయిన యేకాగ్రత, పూనిక నెడఁబాయనట్టి సాహసములందు ఇచ్చ, అతికఠిను లయిన మానిసులతోడి కూటమిచేత ఒరులకు వెనకిరామి, ఆత్మగౌరవ నిశ్చయము, దీనతలేని దేహయాత్రయు, ననునవి. * ఉత్తమ మత్తకాశినుల సంభోగంబునందు అర్థధర్మములను సఫలీకరించుట, నిండుమగతనంపు గౌరవము, భావము నెఱుంగు నేర్పు, లోభదూషితము గాని వ్యాపారము, ఎల్లకళలయందును పాండిత్యమును, లభింపనిదానిని పొందుట లభించినదానిని కాపాడుకొనుట కాపాడుకొన్నదానిని అనుభవించుట అనుభవించిన దానిని స్మరించుట అలిగినవారని అనునయించుట అను వీనియందు సర్వదా ఉపాయములు పన్నుచుండుటచేత బుద్ధికిని వాక్కునకును పటుత్వంబును, మేలుగా ఇష్ట మైనట్లు శరీరమును సంస్కరించుకొనుటవలన సొబగయిన వేసము కలిమింబట్టి లోకుల గౌరవమునకు పాత్ర మగుట, మిత్త్రులకు మిక్కిలి అనుంగగుట, పరిజనములయందు ఎక్కుడగు నాదరము, నగవుతోడి పలుకరించుట, గండుమీఱిన సత్త్వము కలుగుట, దాక్షిణ్యమును అవలంబించుట, బిడ్డలం గనుటచేత ఉభయలోకములందును శ్రేయముం బడయుట, అనునవి. * త్రాగుటయందును నానావిధరోగములను పోఁగొట్ట కలంతు లయిన యాసవములను సేవించుటచేత ఆసింపఁదగిన ప్రాయమును నిలుపుకొనుట, అహంకారము నెరుఁగుటచేత ఎల్లదుఃఖములను చెల్లచెదరు సేయుట, మదనరాగమును ఉద్దీపించుటచేత అంగనోపభోగశక్తిని గగలఁగొల్పుట, తన యపరాధమును పోఁగొట్టుకొనుటచేత అలుకములికిని తివిచి వైచుట, వినఁగూడని వానిని చెప్పనవై అంకిలి లేనిదయిన ప్రేలడములచేత విశ్వాసమును బలపఱుచుట, మచ్చరముం ద్రెంపుటచేత ఆనందైకాగ్ర్యము, శబ్దాదివిషయములను ఎడతెంపులేక యనుభవించుట, నెట్టెడుగుణము కలిమిచేత మిత్త్రసమూహమును నెంపొందించుట, సాటిలేని దేహకాంతి, మించనలవిగాని చిట్టకంబులు, భయపీడలను హరించుటచేత ఆలమునకు చాలియుండుట, అనునవి. * కక్కసము లాడుట క్రూరముగా దండించుట

ధనమును పాడుసేయుటయు హృదమునకుం దగినట్లు ఉపకరించునవి. మునివలె శాంతిపరుఁడగు భూకాంతుఁడు వైరిసమూహము నడంచుటకును లోకపరిపాలనంజేయుటకును సమర్థుఁడు కాఁడు.—అని.

రాజు గురూపదేశమునుంబోలె అత్యాదరముతో వాని యభిప్రాయమును అనుసరించెను. జనినడువడిని అవలంబించినవారై ప్రజలు అడ్డులేక వ్యసనములను సేవింపందొడంగిరి. ఎల్లవారును ఆయాదోషములు కలవారే అగుటచేత ఎవఁడును ఎవనిదోషమును వెదకం గడంగఁడు. రాజును ప్రజలును ఇట్లు సమముగా చెడఁగా ఆయారాజ్యవ్యవహారాధికారులు తమతమవలన వచ్చునట్టి ఫలములను భక్షించిరి. చానంజేసి క్రమముగా రాబడిద్వారములు చెడిపోయినవి. దొరగారి వెచ్చపుద్వారములు విటులవసమునంబడినవై దినదినము పెరుఁగుచుండినవి. సామంత పౌర జానపద ముఖ్యులును, తననడవడినే అవలంబించినందున ఆతఁడు వారిని దృఢముగా విశ్వసించి వారిభార్యలతోఁగూడ పానగోష్ఠులలోఁ జేర్చుకొనుటచేత వారును వారిభార్యలును తమతమయాచారమును అతిక్రమించిరి. వారియంగనలయందు నానామిషలచేత రాజు ఆపచరించెను. ఆపురుషులును శీలభ్రష్టులయిన యాతనిరాణివాసములతో కొంతదక్క నానాసుఖముల విహరించుచుండిరి. కులాంగనలెల్ల చెడిపలవలె వంకరమాటలాడ నలవాటుపడి, మంచినడువడికట్టును తెంపుకొని, మగలను గడ్డిపోఁచకన్న కనీసముగాఁ జూచుచు, మిండగీండ్రపిండుల మంతనములను వినుచుండిరి. అందు మూలమున రోసము గలవారికి కయ్యములు అంటుకొన్నవి. బలవంతులు దుర్బలులను మడియించిరి. ధనికుల ధనమును దొంగలు లోనగువారు హరించిరి. అవమానభయము లేనందున పాతకమార్గములు ప్రఖ్యాతములయినవి. బంధువులు హతులగుడు ధనము హృతమగుడు కొలలచేతను చెఱలచేతను దుఃఖపడి ప్రజలు కన్నీటిడగ్గుత్తితో ఎలుంగెత్తి యేడ్చుచుండిరి. దండన అయుక్తముగా ప్రయుక్తమైనందున భయకోపంబులం బుట్టించినది. బలికచెడిన కుటుంబములందు పిసినిడితనము అడుగిడినది. అవమానితులయిన శూరులు మానముచేత మండుచుండిరి. నానాదుష్కృత్యములయందును ధనోపాయములు సాగుచుండినవి.

ఆసమయంబున అశ్మకేంద్రుఁడు పంపిన తీక్ష్ణపుద ప్రభృతులు—వేఁట వేసుమును మృగముల తెఱవును వర్ణించి గడ్డపోదలును వెదురుఁబొదలును ఎండినట్టివి కలిగి వెలికి దారిలేని పెనఁకొండ గొందులందుఁ జొనిపి ద్వారములో నిప్పు పెట్టుటచేతను, బెబ్బులులు లోనగు జంతువులమీఁదికి పురికొల్పి వానివాత వేయుటచేతను, ఇష్టమయిన బావిం గూర్చి దప్పి పుట్టించి దూరముగా కొనిపోయి ప్రాణము పోవునట్లుగా అఁకలిదప్పులం బెంచుటచేతను, సహాయులు పలుకంకలం జెదరి పోఁగా నొంటిఁ జిక్కించి గడ్డిగుబురుల

కమ్ముదలచేత కాన రాకున్న చఱియ నవులలోనికి పడఁద్రోయించి యథేష్టముగా చంపించుటచేతను, మృగము నోడలినుండి యసిఁబోయినదను నట్లుగా అమ్ముల నేయుటచేతను, ఎక్కనలవి గాని కొండకొమ్ములను పన్నిదము సఱచి యెక్కించి ఒరులు సూడకుండ దిగఁద్రోయుటచేతను, అడవులలో సైనికులు పలుచఁబడిన దొరలను అడవి జనుల వేసమున నెదుర్కొనుటచేతను, పాచికల జూదము పక్షిపందెము జాతరసంబరము లోనగు వాని సమ్మర్దములలోనికి బలాత్కారముగా చొప్పించి యితరులకు హింస చేయించుటచేతను, గూఢముగా చేటు గావించిన వారి నోటనే ఆచేటుం జెప్పించి సాక్షులం బెట్టి అకీర్తిని కమ్ముకొనుట కగు పరాక్రమములచేతను, మిత్త్రులం బోలె ఒరుల భార్యలతోఁ గూర్చి జారులను భర్తలను ఉభయులం గాని చంపి ఆయొరులసాహసముగా ప్రకటించుటచేతను, విశ్వస్తఘాతకురాండ్రచేత సంకేతస్థానములకు రప్పించి అట ముందుగా దాఁగి యుండి పిమ్మట మీఁదఁబడి చెప్పరాని వధముచేతను, ఆసలు గొల్పి బిలములలో నిక్షేపములను త్రవ్వుటయందు మంత్రములను సాధించుటయందును ప్రవేశపెట్టి విఘ్నమిషచేత కమ్మఁదగిన మారణములచేతను, దుష్టగజమును కోపము దెప్పించి గుఱిగా ముఖ్యులగువారి గుంపులమీఁదికి పెడఁదారిం బడిన దనునట్లుగా పఱపి త్రొక్కించుటచేతను, దాయభాగము లోనగు విషయములందు వివాదపడుచున్న వారిని లోలోపలఁ గ్రమ్మి వైరులమీఁద ఆయపకీర్తిని మోపుటచేతను, సామంతులందును నగరములందును గ్రామములందును నడవడి సరి దప్పినవారిని రహస్యముగా వ్రేటువేసి వారి వైరుల నామమును ఘోషించుటచేతను, తగిన స్త్రీలతో రేయుంబవలు క్రీడింపఁజేసి క్షయరోగముం బుట్టించుటచేతను, వస్త్రాభరణ మాల్యాంగరాగాదులయందు మెలపున విస మిడుటచేతను, వైద్యులచేత రోగముం బెంచుటచేతను, ఇంక నెన్నియో యుపాయములచేతను, వీరులను రూపు మాపి అనంతవర్మని రాజధానిని నలిగాలి గావించిరి.

పిమ్మట వసంతభానుఁడు భానువర్మ యను నడవిదొరను పురికొల్పి అనంతవర్మతో పోరాటము పెట్టుకొనునట్లు చేసెను. ఆతఁడు రాష్ట్రము నెల్లలం బట్టుకొనఁగా అతనిమీఁదికి దాడివెడలుటకు అనంతవర్మ దండును లేపెను. ఎల్లసామంతులకన్నను అశ్మకేంద్రుఁడు ముందు వచ్చి ఇతనికి అధికప్రియుఁ డాయెను. కడమ సామంతరాజులును వచ్చి కలసిరి. సమీపమునకుం బోయి అనంతవర్మ నర్మదయొడ్డున విడిసెను. ఆసమయంబున పెద్దసామంతుఁడయిన కుంతలరాజగు నవంతిదేవుని స్వకీయనాటకీయను భూతలోర్వశి యనుదానిని చంద్రపాలితాదులచేత నెంతయుం బొగడంబడిన నృత్యకౌశలము చెన్నారుదానిని అనంతవర్మ రప్పించి ఆడించి చూచెను. చాల మేలుపడి ఆవధూత్తమును పొందెను. అంతట అశ్మ

కేంద్రుఁడు కుంతలరాజుతో ఏకాంతంబున హెచ్చరించెను.— 'ఈరాజు పొగరెక్కియున్నాఁడు, సనమగువలం దగులుచున్నాఁడు. ఎంతయని యవమానమును సహింపఁదగును! నాకో నూ టేనుఁగులు కలవు, నీయొద్ద ఏనూఱు; మనము కలసి మురళీశుని వీరసేనుని, ఋచీకేశుని ఏకవీరుని, కొంకణపతిని కుమారగుప్తుని, నాసిక్యనాథుని నాగపాలుని చీలఁదీయుదము. వారు తప్పక ఇతని యాథార్థ్యమును ఓర్వక మనయిచ్ఛచొప్పున వర్తిల్లుదురు. ఈ యడవిదొర నాకు ప్రియమిత్త్రుఁడు. ఇతనితో ఈకావలుని మొగదలం దగిలి యుండ వెనుకనుండి పడఁగొట్టుదము. ఇతని బొక్కసమును వాహనములను మనము పంచుకొని పుచ్చుకొందము.' అని. అందులకు అతఁడును సంతోషించి సమ్మతింపఁగా, మేలిపలుపలు ఇరువది కాంచన కుంకుమ కంబళములు ఇరువదియేనును కానికపెట్టి, ఆపులమూలముగా ఆసామంతులతో కలియఁబలికి వారినిగూడ తన మతమున నిలుపుకొనెను. మఱునాఁడు ఆ సామంతులకును ఆయడవి దొరకును అనంతవర్మ నీతి నొల్లమిచేత ఎగయాయెను. వసంతభానుండును అనంతవర్మని కోశవాహనమును సమస్తమును తనవశము చేసికొని, 'మీమీ ప్రయాసకును మీమీబలమునకును తగినట్లు మీరు పంచికొనికొనుఁడు; మూసెలవుచే ఏపాటి పాలితోనయినను నేను తనిసెదను.' అని కుచ్చితంబున నదంట ననువర్తించి ఆయోరయే కారణంబుగా కయ్యము పుట్టించి ఎల్ల సామంతులను రూపుమాపి, వారిధన మెల్లను తానే దిగమ్రింగెను. అడవి దొరకు ఏదో ఒకపాలు అనుగ్రహించి, మరలి వచ్చి, అనంతవర్మ రాష్ట్రి మెల్ల తనదిగా చేసికొనెను.

ఈయెడరున మంత్రివృద్ధుఁడు వసురక్షితుఁడు కొందఱు మాలురతోఁ గలసి ఈ బాలుని భాస్కరవర్మను, ఇతని యక్కను పదుమూఁడేండ్లదానిని మంజువాదినిని, వీరి తల్లిని మహాదేవిని వసుంధరను, తోడ్కొని వలసపోవుచు, ఈ యాపద రానున్నందున దాహజ్వరముచేత దేహమును త్యజించెను.మఱి కొందఱుము మిత్త్రులము మాహిష్మతికిం గొనిపోయి భర్తకు సవతితల్లికుమారుఁ డయిన మిత్త్రవర్మనికడకు బిడ్డలతోడి దేవిని చేరిచితిమి. ఆయుత్తమురాలిని ఆ యనార్యుఁడు వేఱుతెఱంగున అభిమానించెను. ఆ మొవలన -చీవాట్లు పొంది ' ఈమె తనయుని రాజ్యార్హుం జేయుటకై తాను సాధుశీలగా నుండం గోరుచున్నది?' అని యెంచి, కూళతనంబున ఆబాలుని అనఁగా ఈచిన్నివానిని చంపం దలకొనెను. ఈసంచు నెఱింగి దేవి న న్నాజ్ఞాపించినది - 'బాబూ, నాళీజంఘుఁడా, ఈబాలుని ఎక్కడికేని కొనిపోయి వీని ప్రాణమును కాపాడుచు వసింపుము. బ్రదికితినా నేనును వీనిని అనుసరించెదను. నీవు క్షేమముగా కుదిరి నాకు వార్త నంపుము.' అని. కాలినడకచేత పసి చెడిన యితనిని కోల్కానం జేయుటకై ఒకగొల్లపల్లెలో కొన్నాళ్లు

విశ్రమింపించి, అచ్చటను రాజపురుషులరాకకు వెఱచి దూరముగా వలస వచ్చితిని. ఇందు కఠోరముగా దగదట్టి దూపటిల్లిన యీబాలునికి నీళ్లు తేఁబోయి ఈబావిలో జాతి కూలితిని. నీవు అనుగ్రహంబున లేవఁదీసితివి. శరణు లేని యీరాజకుమారునికి నీవే ఇఁక శరణగుదువు గమ్ము.—అని అంజలి చేసెను.

'ఇతనితల్లి ఏజాతియందు జనించినది?' అని నే నడుగఁగా ఆతఁడు చెప్పెను. 'వైశ్రవణుఁ డను పాటలీపుత్త్రపు వణిజునికూఁతురైన సాగరదత్త గర్భమునందు కోసలరాజు కుసుమధన్వునివలన ఇతనితల్లి కలిగినది.' అని. 'ఆపక్షంబున ఇతనితల్లికిని నాతండ్రికిని ఒక్కఁడే మాతామహుఁడు.' అని బాలని ప్రేమతో కవుంగిలించికొంటిని. 'సింధుదత్తకొడుకులలో నీతండ్రి యెవఁడు?' అని. వృద్ధుఁ డడిగెను. సుశ్రుతుఁ డని నేను చెప్పఁగా నతఁడు కడు హర్షించెను. నేనును 'నీతివిద్యాగర్వితుని అశ్మకుని నీతిచేతనే పెకలించి ఈబాలుని తండ్రిపదవియందు నెలకొల్పెదను.' అని ప్రతిన సేసి, 'ఇతని యాఁకటిని ఎట్లు తీర్తును?' అని యరయుచుంటిని. అంతలో వచ్చినవి ఎవఁడో వేఁటకాని మూఁడుకోలలను తప్పించుకొని రెండుజింకలు, ఆ వేఁటకాఁడును వచ్చెను. వానిచేతినుండి మిగిలియున్న రెండుబాణములను వింటిని తివిచికొని ఆరెంటి నేసితిని. ఒకటి గతితోఁగూడం గోలగాఁడియు రెండవది గతితోఁగూడ కోల ఊచ్చిపోయియు నేలం గూలినవి. అందొక జింకను బోయ కిచ్చి, రెండవదానికి వెండ్రుకలతోడి తోలు ఒలిచి, నీరుతిత్తిని తివిచి వైచి, ప్రేవుల వెలువరించి, తొడయెముకలను మెడను ఇంక కొన్నిటినిం గోసి ఎరగలి నిప్పుకలపై కఱుకుట్లుగా పచనము చేసిన మాంసముతో ఆయిరువురకును నాకును ఆఁకలి తీర్చుకొంటిని. ఈపనియందు నా నేర్పునకు తద్దయు హర్షించిన కిరాతుని అడిగితిని.—'ఓయి, మాహిష్మతీవృత్తాంతము నెఱుంగుదువా?' అని. వాఁడు వచించెను. 'అచట పులితోళ్లను తోలుసంచులను అమ్మి యిప్పుడే వచ్చితిని. ఎఱుఁగ కేమి? చండవర్మ తమ్ముఁడు ప్రచండవర్మ యనువాఁడు మిత్త్రవర్మ కొమారితను మంజువాదినిని పెండ్లియాడ వచ్చుచున్నాఁ డఁట. దానం జేసి ఊరెల్ల మహోత్సవముతో తాండవ మాడుచున్నది.' అంతట వానిచెవిలో మెల్లన వచించితిని.

"మోసగాఁడు మిత్త్రవర్మ, కొమారితయందు సంపూర్ణప్రేమం జూపి తల్లిని నమ్మించి ఆమూలమున బాలకుని మరలరప్పించి చంపింపఁ దలంచియున్నాఁడు. కావున నీవు మరలం బోయి ఇతని సేమంబును నావార్తను దేవికి ఏకాంతంబున నివేదించి, వెండి 'బాలుని పులివేసికొన్నది' అని ప్రకటముగా అంగలార్వ వలయును. ఆదుష్టచిత్తుఁడు లోన సంతుష్టుఁడై వెలికి దుఃఖముం జూపుచు దేవిని ఓదార్చును. తర్వాత ఆమె ముఖముగా అతనికి ఇట్లు చెప్పవలయును—'ఎవనికై నీ మతము నతిక్రమించితినో ఆబా

లుండు నాపాపంబునంజేసి పరలోకమునకు నేఁగెను. మఱి యిపుడు నేను నీయానతిని జరుపుదాననే.' అని. ఇట్లు చెప్పిన నాతఁడు ప్రీతుఁడై యామెకడ కేతెంచును. వత్సనాభ మను పేరి యూబలువిసమును నీటం గరంచి అందు పూమాలను ముంచి, దానితో వానిని ఱొమ్మునను మొగంబునను 'నేనే గనుక పతివ్రతనేని మహాపాపునికి ఇదియే నీకు కత్తివ్రేటు గావలయును.' అని పల్కుచు కొట్టవలయును. మఱి యీమందు గలిపిన నీళ్లలో ఆమాలనే ముంచి తనకౌమారిత కీయవలయునును. వాఁడు ఈల్గుటయు కుమారి స్వస్థముగా నుండుటయుం గని పతివ్రత యని ప్రకృతులు ఈమెను అనువర్తింతురు. అంతట ప్రచండవర్మకు సమాచారము పంపవలయును. 'ఈరాజ్యమునకు ఇప్పుడు నాథుఁడు లేఁడు, దీనితోఁ గూడ ఈబాలికను కైకొనందగును.' అని. అంతలో మేము కాపాలికవేషముచే నిజస్వరూపము నడఁచిపెట్టి దేవివలననే భిక్ష గ్రహించుచు ఊరి బయట శ్మశానముకడ వసించెదము. దేవి యోగ్య లయిన యూరివృద్ధులను ఆప్తు లయిన మంత్రివృద్ధులను ఏకాంతంబున నిట్లు పందరింపవలయును:—"నేఁడు దేవి వింధ్యవాసిని నాకు స్వప్నములో ఇట్లు ప్రసాదించినది—'నేఁటికి నాల్గవనాఁడు ప్రచండవర్మ మృతి నొందును. అయిదవనాఁడు నర్మదయొద్దున నాయాలయములో జనులలేమిం జరికించి జనులు వెలువడినయనంతరము తలుపుం దెఱచికొని నీసుతునితోఁగూడ ఒకానొక బ్రాహ్మణకుమారుఁడు వెలికి వచ్చును. అతఁడు ఈరాజ్యమును కాపాడి బాలుని రాజుగా నెలకొల్పును. ఆబాలుని నేను ఆఁడుఁబులిరూపంబున వచ్చి అదృశ్యం గావించి యుంచితిని. ఈపిల్లను మంజువాదినిని ఆబ్రాహ్మణకుమారునికి భార్యనుగా నియమించితిని.' అని. ఇది అతిరహస్యము, నెఱవేఱునందాఁక, మీయందే దాఁగియుండవలయును." అని.

బోయయు తత్క్షణమే అతి హృష్టుఁడై పనివినియెను. ఆకార్యము ఉద్దేశించినట్లే నెఱవేఱెను. దిక్కుదిక్కునను లోకవాదము పర్వెను.— 'అహో! పతివ్రతల మహిమ ఆపూదండ వ్రేటు ఆతనికి కత్తివ్రేటే ఆయెను. ఇందులో మోస మున్న దని చెప్పుటకు వలను గాదు; ఏలయన, ఆదండయే కౌమారిత కీయఁగా ఆమెకు అలంకారమే అయినది, మృత్యువు కాలేదు. ఈపతివ్రతయాజ్ఞను ఎవఁడు మీఱునో వాఁడు బూడిదయే అయి పోవును.' అని.

పిమ్మట మహావ్రతి వేషమున నేనును పుత్త్రుఁడును భిక్షకై ప్రవేశింపఁగాఁ గాంచి వసుంధరాదేవి చన్నులు చేఁప లేచి సంతోషముచే కళవళపడుచు నుడివెను.—'భగవానుఁడా, ఇదె యంజలి. అనదను నన్ను అనుగ్రహింపుము. నాకు ఒక కల వచ్చినది. అది కల్యమా కాదా?' అని. 'అందుల ఫలమును ఇప్పుడె కనియెదవు.' అని నే నంటిని. 'అట్లేని

మీ సేవకురాలి యదృష్టము మిక్కిలి గొప్పది. ఆకల ఈబాలికకు నాథుఁడు కలుగు నని సూచించినది.' అని, నన్నుఁ గని వలపు వహించి జంకుం బొందిన మంజువాదినిని నాకు మ్రొక్కించి, వెండియు హర్షముతో 'అది అసత్య మాయెనా, వీనిని మీ బాలకపాళిని జేపు నాకడ నాఁపుగొనియెదను.' అని పలికెను. నేనును మంజువాదిని యనురాగము దొఁగలం జూచిన చూపుచే ధైర్య మేది 'అట్లె యగుఁగాక' అని వచించి, ధైర్యముం గొని నాళీజంఘునిం బిలుచుకొని అటనుండి వెడలి, కూడ వచ్చుచున్న యాతనిని మెల్లన 'ఎక్కడ నున్నాఁడు అల్పాయు వని చెప్పఁబడిన యాప్రచండవర్మ?' అని యడిగితిని. 'ఈరాజ్యము తనదే గదా యని నిశ్చయుఁడై ఆస్థానమండపమందే నటులతో గొలువై యున్నాఁడు.' అని యాతఁడు చెప్పెను. 'అటులైన, ఉద్యానములో నుండుము.' అని యావృద్ధును ఆజ్ఞాపించి, ఆప్రాకారమున కొకప్రక్క నొకశూన్యమఠమందు బొంతలు లోనగు వానిని దించి, వానికి రాజపుత్త్రిని కాపుంచి, నటవేషవిలాసముం దాల్చి, ప్రచండవర్మను దర్శించి యనురంజించితిని.

పిమ్మట ఈ రెండవేళ, జనసమాజము నెఱుంగుట కుపయోగపడిన నృత్తగీతనానాజంతురుతములను మాని, చేతినడక నెత్తిఁగాలు కంబపుఁగాలు తేలుదాఁటు మొసలిదాఁటు చేఁపతెగలుడు లోనగు కరణములను, మఱియు చెంత నున్న వారినుండి సురియలం గొని వానిని ఒడలినిండ కట్టుకొని డేగయెగవు గొరవంకయెగవు మొదలగు కరణములను, చూపుచు, ఇరువదివిండ్ల యెడమున నున్న ప్రచండవర్మని ఒకసురియతో ఱొమ్మునం గ్రుమ్మి, 'బ్రదుకుఁగాక, వేయేండ్లు వసంతభానుఁడు.' అని గర్జించుచు, నా యొడలిం దెగఁగోయుటకు కత్తియెత్తిన యొకబంటును బలిసిన మూఁపుపై పద మిడి ఆమాత్రాన నే చేతన యొడలించి, కలఁగఁబాఱిన జనులను మీఁదుఁజూపులు సూడం జేయుచు, రెండు నిలువులయెత్తు ప్రాకారమును ఎగసి దాఁటితిని. దాఁటి 'ఉద్యానవనములో నన్ను వెంబడించువారికి ఈదారి అగపడును.' అని నా మాట నా నోట నుండఁగానే నాళీజంఘుఁడు ఇసుకలోని నా కాలిజాడను గుర్తు లేకుండ తుడిచి వేయఁగా, చీఁకటిచెట్లచాలుగుండ ప్రాకారముప్రక్క తూర్పుగా పఱతెంచి, పిమ్మట దక్షిణముగా పేర్చిన యిటికల కట్టడ మగుటచే జాడ తెలియఁబడక పరుగెత్తి కోట ప్రాకారము వెంబడి కందకమును దాఁటి, ఆ శూన్యమఠమునం ద్వరితముగా ప్రవేశించి మఱల తొంటివేసముం దాల్చి బాలునితోఁగూడ నాచేఁతచే దివాణపు హజారముకడ మూఁగినజనులపిండుగుండ కష్టపడి దారిచేసికొని శ్మశానప్రదేశమునకుం బోయితిని.

ముందే ఆదుర్గదేవళమున అమ్మవారి పీఠము క్రింద ఒకప్రక్కను పెకెడలిన లావుపాటి రాతిబండ నెత్తి గోయి త్రవ్వి దాని నోటికి ఆబండనే మూఁతవైచితిని. పిమ్మట నడిరేయి జరుగుచుండఁగా, హెగ్గడీఁడు తెచ్చిన రత్నభూషణ చీనాంబరములు ధరించి ఆబిలమందు ప్రవేశించి వేచి యుంటిని. దేవియు ఆముందుదినమే మాళవునికిని ప్రచండవర్మకును తగినట్లు అగ్నిసంస్కారము చేయించి, చండవర్మునికి తమ్ముని యీయవస్థ ఆశ్మకేంద్రుని మూలమునం గలిగె నని వార్త పంపి, మఱునాఁడు ముందు మాటలాడుకొన్న పౌర మంత్రి సామంత వృద్ధులతోఁ గూడ వచ్చి, అమ్మవారిని పూజించి, ఎల్లజనులకుం బ్రత్యక్షముగా పరిశోధించి, గుడిలోపల ఎవరును లేనియట్లుగా చేసి, జనులతోఁ గూడ చూచుచు బిట్టుగా డప్పులు వాయింపించెను. అతిసూక్ష్మరంధ్రముగుండ ప్రవేశించిన యానాదముచేత హెచ్చరికం బొంది, బల్లిదుల జతనంబులకుం గదలని యీయమ్మవారిప్రతిమతోడ లోహపాదపీఠమును తలమీఁద నేనె ఎత్తి, రెండుచేతులతో ఒకప్రక్కనే పట్టి ఒక్కెడ దించి, వెలువడి, కుమారుని వెలువరించితిని. పిమ్మట అమ్మవారిని ఎప్పటిచోట ఉంచి తలుపు తెఱచుకొని ప్రత్యక్షమైతిని. తారకాణమునకు సంతోషించినచూపులతో నిక్కఁబొడిచిన పులకలతో ఎత్తిన యంజలితో నాటినయాశ్చర్యముతో ప్రణమిల్లుచున్న ప్రకృతులకుం జెప్పితిని.—"ఈతీరున వింధ్యవాసినీదేవి నానోట మీకు ఆజ్ఞ సేయుచున్నది. 'నేను కరుణచేత పులిరూపున దాఁచి ఇప్పుడు మీ కిచ్చిన యీబాలుని ఇదిమొదలు తల్లిపక్షము తగ్గి నాఁ డని పుత్త్రునిఁగా గ్రహింపవలయును.' అని. అలవిగాని బలు కపటములను నెగ్గించు నేర్పును స్ఫుట మయిన మోసమునుం గల కూళ యైన యశ్మకుఁడనుకుండను పగులఁగొట్టుటకు రాతినిగాను ఈబాలునికి రక్షకునిఁగాను నన్ను ఎఱుంగుఁడు. రక్షణకు జీతముగా నాకు ఇతనితోఁబుట్టువును ఈ యందపు బొమ్మలాఁడిని అమ్మవారే దయచేసియున్నది" అని. ఈమాట విని ప్రకృతులు 'అహో ఎంతభాగ్యము భోజవంశమునకు! ఏల యన దానికి నీవు అమ్మవా రిచ్చిన నాథుఁడవు ఇపుడు కలిగినాఁడవు.' అని సంతోషించిరి. నాయత్తగారు మాటల కందని సంతోషదశను పొంది, ఆదినమే యథావిధిగా మంజువాదినిచివురుఁగేలిని నాచేత పట్టించినది. తర్వాత రాత్రి చక్కఁగ నే గుడిలోని బొక్కం బూడిచితిని. లోకులు నా గుట్టెఱుఁగలేక, నష్టవస్తుగతిని పిడికిట దాఁచి యడిగినదానిని ఇంక నిట్టి యితరములను నేను వేఉపాయంబుల నెఱింగి చెప్పుటం గని నన్ను దేవాంశసంభూతునిఁగా నిశ్చయించుకొని నాయాజ్ఞను జవదాఁటకుండిరి. రాజకుమారునికి ఆర్యాపుత్త్రుఁ డని ప్రభావహేతు వయిన ప్రసిద్ధి కలిగినది. అతనికి మంచిదినమున భద్రాకరణము చేయించి ఉపనయనసంస్కారముం గావించి, పురోహితునిచే నీతిం

జెప్పించుచు రాచకార్యములను నిర్వహించుచుంటిని. ఇట్లు తలంచితిని—'రాజ్య మనునది శక్తిత్రయాధీనము; ఆశక్తులు, మంత్రప్రభావోత్సాహ రూపములు, ఒండొకటికి ఉపబలమై పనులను సాధించును; మంత్రముచేత అర్థనిశ్చయము, ప్రభావముచేత ప్రారంభము, ఉత్సాహముచేత నిర్వాహము కావున పంచాంగమంత్ర మనుమూలము, ద్విరూపప్రభావ మను పలవలు, నాలుగు తెఱంగుల యుత్సాహ మనెడి శాఖలు, డెబ్బదిరెండు ప్రకృతు లనెడి యాకులు, ఆఱు గుణము లనెడి చిగురులు, శక్తి సిద్ధు లనెడి పుష్పఫలంబులును, గలదైన నీతివృక్షము నాయకునికి మేలు సేయును. అట్టియది అనేకాధారములయందు కుదుర్కొన్న దగుటవలన అసహాయునికి అనుభవింప నలవి యగుట దుర్ఘటము. ఉన్నాఁడే ఆర్యకేతు వనువాఁడు మిత్త్రవర్మమంత్రి, అతఁడు కోసలదేశమువాఁడగుటవలన బాలుని తల్లిపక్షమువాఁడు మంత్రిగుణసంపన్నుఁడు. అతనిమాటను వినకయే మిత్త్రవర్మ చెడిపోయినాఁడు. అతఁడు గనుక దొరకెనా మేలు.' అని. అంతట నాళీజంఘుని రప్పించి ఏకాంతమున నిట్లు కఱపితిని. "బాబూ, ఆర్యుని ఆర్యకేతు నడుగు—'ఎవఁ డీ మాయాపురుషుఁడు, ఈ రాజ్యలక్ష్మిని అనుభవించుచున్నాఁడు? క్రక్కునా మ్రింగునా?' అని. అందులకు అతఁ డేమి చెప్పునో దానిని నాకుం దెలుపుము." అని. పిమ్మట నతఁడు నా కిట్లు తెలియఁ జేసెను. "పలుమాఱు కానుకలు నెట్టి సేవించి, చిత్ర మయిన ముచ్చటలు జరిగించి, కాలుసేతు లొత్తి, నమ్మకముచే నతఁడు సమయ మియ్యఁగా నీవు నేర్పిన విధమున నడిగితిని. ఆయనయు ఇట్లు చెప్పినాఁడు. 'భద్రుఁడా, అట్లు చెప్పకు కులము శుద్ధముగా అగపడుట, అసాధారణ మైన బుద్ధికుశలత, మనుష్యాతీత మయిన ప్రాణశక్తి, కొలఁదికి మీఱినయౌదార్యము, అత్యాశ్చర్య మయిన యస్త్రకౌశలము, అల్పేతర మయిన జ్ఞానము, కరుణారసార్ద్ర మయిన మనస్సు, శత్రువులమీఁదికి చక్కఁగా పాఱున దై దురాసద మైన తేజంబును—అను నీగుణములు మఱియొక్కఁడను ఒక్కఁడ నుండనట్టివి ఈయొక్కనియందే కూడి యున్నవి. వైరుల కీతఁడు విషవృక్షము, వంగినవారికి గంధప్రమాపు; తాను నీతిజ్ఞుఁ డని గర్వించియున్న యాయశ్మకుని పెకలించి ఈరాజకుమారుని తండ్రిరాజ్యమున ఈతఁడు ప్రతిష్ఠించినాఁ డనియే యెఱుంగుము. ఇందు సందియమువలదు.' అని." దానిని విని మాటిమాటికి పరీక్షలచే నాతని శుద్ధిని నిశ్చయించుకొని ఆతని నాకు ఆలోచనకు సహాయునిఁగఁ జేసికొంటిని. ఆతనిసాయంబున సత్యశౌచ యుక్తు లయిన మంత్రులను నానావేషులను గూఢపురుషులను సంపాదించితిని. వారివలన ప్రకృతిమండలము లుబ్ధభూయిష్ఠ మై విశృంఖలముగా వర్తించుచు ప్రాయికముగా లోఁబడనిదిగా నున్న దని తెలిసికొని, అలోభమును ఉపదేశింపించుచు, ధార్మికత్వమును

పురికొల్పుచు, నాస్తికులను దండించుచు, క్షుద్రశత్రువులను వెలార్చుచు, పగతుగమాయలను ఖండించుచు, నాలుగువర్ణములను తమతమ ధర్మకర్మములయందు నెలకొలుపుచు, 'ధనముల నార్జించెదఁగాక, దండముతోడి పను లన్నియు ధనైకసాధ్యములు గదా, దండమందలి దౌర్బల్యమునకన్న పాపిష్ఠము వేఱు లేదు.' అని ఆలోచించుకొని నానోపాయము లాచరించితిని.

---

# ఆంధ్రదశకుమారచరితము.

## ఉత్తరపీఠిక.



పిమ్మట నిట్లు చింతించితిని.—సేవకు లందఱు కడింది శూరులు, నాయం దత్యంతానురక్తులు, నాయిచ్చమెయి ప్రాణములు గడ్డిపరకగా నెంతురు. రెండురాజ్యముల సైన్యసామగ్రియందును నీతియందును నేను అశ్మకేశుఁ డగు వసంతభానునకు తక్కువవాఁడను గాను, కావున వసంతభాను నోర్చి విదర్భరా జగు ననంతవర్మునికొమరుని భాస్కరవర్మను తండ్రి పదమందు నేను నిలుపఁగలను. 'ఈరాజకుమారుని భవాని తనకుమారునిఁగా బెంచుకొన్న దనియు, నన్ను ఆతనిసాహాయ్యకంబునకు నియమించిన దనియు నెల్లయెడల లోకవాదము కలిగియున్నది. ఇక్కడి వారు ఈరాజకుమారునియందు, తమ దొర యయిన యనంతవర్మని పుత్త్రుఁ డితఁడు భవానీకటాక్షంబున ఈరాజ్యమును బడయును, అని గట్టిగా ఆస పెట్టికొని యున్నారు. అశ్మకేశుని దండు రాజపుత్త్రునికి భవాని తోడ్పడు నని యెఱింగి దైవశక్తిమీఁద మానుషశక్తి పనికి రా దని మాఁకోడి పోరాటములో శంకాకుల మై యున్నట్లగపడుచున్నది. ఇచ్చట మూలప్రకృతులు ఆదిలో రాజకుమారుని యభ్యుదయముం గోరినవారు, ఇప్పుడు సైగా సావలన దానమానాది వశక్రియలచేత విశ్వాసము గొన్నవారై విశేషించి ఆతనినే కోరుచున్నారు. అశ్మకేంద్రుని యంతరంగభృత్యులను నాయాప్తతములైన పురుషులు ఎక్కువప్రీతిని పుట్టించి నాయాజ్ఞచే రహస్యంబుగా నిట్లు భేదించినారు.—'మీరు మా మిత్త్రులరు, కావున మీకు మేలు గలిగించెడు మాటను చెప్పవలసినదే. ఇట భవానీదేవి రాజపుత్త్రునిసాహాయ్యార్థము ప్రఖ్యాతుని విశ్రుతుని నియమించి, ఈవిశ్రుతునిచేత అశ్మకేంద్రునికి వసంతభానునికి అతనిపక్షమున నిలిచి యితనితో ఎవరు పోరుదురో వారికని అంతమును నిర్దేశించినది. విశ్రుతుఁడు అశ్మకేంద్రునితో పోరాటమునకు కడంగకముందే మీరు అనంతవర్మనికుమారుని భాస్కరవర్మను కొలువుఁడు. ఇట్లు చేయువాఁడు భయము లేక గొప్పమేలుం బొంది తనపరిజనముతోఁ గూడ తాను సుఖముండును. ఇట్లుచేయఁ డేని భవానిచేతి శూలము బారింబడును. భవానీదేవి ఎల్లగకుమ ఈవిషయమును ఒకమాఱు చెప్పుమని ఆర్యునికి విశ్రుతునికిం గూడ ఆజ్ఞ చేసినది. అందువలంజేసి ఆతఁడు మీకును మాకుం గల మైత్త్రి ఎఱిఁగి

మాముఖంబున నీా కందఱకు ఈవార్తను తెలియఁ జేసినాఁడు.' అని. అశ్మకేంద్రుని యంతరంగసేవకు లయిన యామగలు రాజసూనునిభవానీవరము నెఱింగి అశ్మకేంద్రునినుండి మనస్సు విఱిగి యున్నవారు ఇప్పుడు విశేషించి నాపంపిన వార్తను విని నావశమున నిలిచిరి.

ఈవృత్తాంతము నంతయు నెఱింగి అశ్మకేశుఁడు ఆలోచించెను.—'రాజకుమారుని మూలప్రకృతు లందఱు అతనినే రాజునుగాఁ గోరుచున్నారు. నా భృత్యవర్గము బయటిదియు లోపలిదియు మనస్సు విఱిగినదిగా అగపడుచున్నది. ఇట్లు నేను ఓర్పు వహించి ఇంటనే యుందునేని ఆపక్షమందు భేదమునకు లోఁబడిన నాస్వరాజ్యమును కూడ రక్షించుకొనుటకు అసమర్థుఁడ నగుదును. కావున నాపై మనస్సు విఱిగి నన్ను డించుపఱిచి మాటలాడువారితో నాదండునకు సంభాషణ జరుగకముందే అతనితో పోరికిం దొడంగెదను. ఇట్లు చేయుదునేని అతఁడు నాప్రోలతృణమేనియు నిలుపఁ జాలఁడు.' అని నిశ్చయించి అన్యాయంబున పరరాజ్యము నపహరించుటకు దురాశచే ప్రేరితుఁడై దండు నడపుకొని మృత్యుముఖమును బోలె మాసేనను ఎదురుకొనెను. ఆతని రాక నెఱింగి రాజపుత్త్రుఁడు ముందుపోయెను. అంతట ఎదురు వచ్చుచున్న యశ్మకేంద్రునిమీఁదికి నేను గుఱ్ఱ మెక్కి ఎదురు పోయితిని. అంతట అతని సైనికులెల్ల 'ఈతఁడు ఇంత యపరిమితమైన మన సైన్యముమీఁదికి ఒక్కఁడే మొనసివచ్చుచున్నాఁడు! ఇందులకు భవానీవరమే అసాధారణ కారణము, వే ఱొకటి గాదు.' అని నిశ్చయించుకొని చిత్తరువున వ్రాసినవారు వోలె ఱిచ్చవడియుండిరి. అంతట నా పిలుపున వసంతభానుఁడు నాతో పోర వచ్చి నన్ను కత్తితో గట్టిగాఁ గొట్టెను. నేనును కత్తిసాము మెలకువచేత ఆకత్తివ్రేటును వమ్ముచేసి బదులు వ్రేటుచేత నాతనిం బరిమార్చి తల తెగ నఱికి వేలుచేసి నేలం గూల్చి ఆతని సైనికులతో పలికితిని:—'ఇంకను ఎవరికి పోరం గోరికయో వారు వచ్చి నాతో పోరుఁడు. కాదేని రాజకుమారునికి పాదప్రణామము గావించి అతనివారలై మీామీా జీవనములను అనుభవించుచు మీామీా యధికారములను నిశ్శంకముగా చెల్లించుచు సుఖముగా నుండుఁడు.' అని. నామాట విన్నంతట అశ్మకేంద్రుని సేవకులు అందఱును తమతమ వాహనములను తటాలున దిగి రాజకుమారునికి నమస్కరించి అతని వశమున వర్తిల్లిరి. అంత నేను ఆ యశ్మకేంద్రరాజ్యమును రాజకుమారునికి అధీనపఱిచి దానిం గాచుటకు మూలులయిన యాతని యధికారులను నియోగించి మాదండును అశ్మకేంద్రునిదండును తోడ్కొని విదర్భదేశమునకుం బోయి అట రాజధానియందు రాజతనయుని భాస్కరవర్మను అభిషేకించి తండ్రిపదమందు నిలిపితిని.

ఒకప్పుడు తల్లి వసుంధరాదేవితోఁ గూడ నున్న రాజుతో విన్నవించితిని.—'నే నొక పని తలపెట్టుకొనియున్నాను. అది సిద్ధించువఱకు నే నొక్కఁడనే యుండవలను గాదు. కావున ఈ నాభార్య నీయక్క కొన్ని దినములు నీయొద్దన యుండుఁ గాక. నేనును నా యిష్టజనుని కని పట్టుటకై కొంతకాలము భూమిలోఁ ద్రిమ్మరి ఆతనిం గని మఱల నిచ్చటికి వచ్చెదను.' ఈ మాట విని తల్లియనుమతిని రాజు నాతో నిట్లనియె.—'మాకు రాజ్యప్రాప్తి రూప మయిన యీ యభ్యుదయమునకు నీవే అసాధారణహేతువవు. నీవు లేక మేము ఈరాజ్యభారమును నిర్వహింపఁజాలము. ఇట్లుండ నీవు ఇట్లు చెప్పెదవేమి?' ఆమాటకు నేను బదులు పల్కితిని.—'మీరు ఇట్టిచింత లేశ మయినను మనస్సులో పెట్టుకొనవలదు. మీయింట నున్నాఁడే మంత్రిమణి ఆర్యకేతు వను నాతఁడు, ఆయన ఇట్టి పెక్కురాజ్యముల భారమును వహించుటకు సమర్థుఁడు. కావున అతనిని నియోగించి నేను పోయెదను.' ఇత్యాదివాక్యపరంపరలచేత ఎంత సమాధానపఱిచినను ఆతఁడు తల్లితోఁ జేరి పలువిధముల బలవంతపెట్టి నన్ను కొంతకాలము పయనము కానియ్యక ఆఁపి, ఉత్కలదేశాధిపతి యయిన ప్రచండవర్మని రాజ్యమును నాకు ఇచ్చెను. నేను ఆరాజ్యమును స్వీకరించి, రాజును వీడ్కొని నిన్ను వెదకుటకై తరల నుండఁగా అంగరాజు సింహవర్మ నన్ను సాయముకై పిలువ నంపఁగా ఇటకు వచ్చి పూర్వపుణ్య పరిపాకంబున స్వామిని నిన్నుం గలసితిని.—అని.

అంతట అటకలసినట్టి కుమారులు అపహారవర్మోపహారవర్మార్థపాల ప్రమతి మిత్రగుప్త మంత్రగుప్త విశ్రుతులు, తమ రేకారణమునను ఆకారణమున నే సంకేత మేర్పఱుచుకొని తమ్మెడఁబాసిన వానిని అప్పుడు పాటలీపురములో యౌవరాజ్యవిభవము ననుభవించుచున్న వానిని సోమదత్తునిని భార్య వామలోచనతోఁ గూడ సేవకముఖముగా వార్త పంపి రప్పించి, రాజవాహన సమేతులై కలసి ఒండొరులతో సల్లాపములం దేలుచున్న సమయంబున పుష్పపురమునుండి రాజహంసమహారాజుకడనుండి ఆజ్ఞాపత్త్రిముం గొని రాజపురుషులు వచ్చి రాజవాహనునికి ప్రణమిల్లి 'స్వామీ, ఇది తమ తండ్రిగారు రాజహంసమహారాజుగారి ఆజ్ఞాపత్త్రిము, పుచ్చుకొండి.' అని విన్నపించిరి. అన విని రాజవాహనుఁడు లేచి సభలో ఆయాజ్ఞాపత్త్రిమును పలుమాఱు మ్రొక్కి కయికొని శిరమున నుంచుకొని అటనుండి తీసి తెఱచి ఎల్లవారు వినునట్లుగా నే చదివెను.—"స్వస్తి, శ్రీ, పుష్పపురరాజధానినుండి శ్రీరాజహంసమహీపతి చంపానగరియందున్న రాజవాహన ప్రముఖులను కుమారులను ఆశీర్వదించి పంపెడి యాజ్ఞాపత్త్రిము. మీరు ఇట నాయొద్ద సెలవుగొని తరలి, దారిలో అడవిలో నొక్కెడ నొకశివాలయముకడ దండువిడిసి యుండుటయు,

అట రాజవాహనుండు రాత్రి శివపూజార్థము కోవెలజొచ్చి ప్రొద్దున కనంబడక పోవుడు, కడమకుమారు లందఱు 'రాజవాహనునితోఁ గూడ రాజహంసుని ప్రణమిల్లెదము, అటు చేయలేమేని ప్రాణములను వదలెదము.' అని ప్రతిజ్ఞ చేసికొని సైన్యమును వెనుకకు పంపి రాజవాహనుని వెదకుటకు వెవ్వేఱుగా తరలితిరి. ఈమీవృత్తాంతమును మీకడనుండి వెనుకకు వచ్చిన సైన్యమువలన విని సహింపరాని దుఃఖసాగరమున మునింగినవారమై నేనును మీ తల్లియు ఇరువురమును వామదేవముని యాశ్రమమునకు పోయి ఈవృత్తాంతమును ఆయనకు నివేదించి ప్రాణములను వదలుదము.' అని నిశ్చయించుకొని ఆయాశ్రమమునకు పోయి మునికి వందనం బాచరించి నిలిచినంతలో, త్రికాలజ్ఞుండగు ముని యిట్లు వచించెను.— 'రాజా, ముందుగానే మీయీకోరిక నరయు నేను విజ్ఞాన బలంబున నెఱింగితిని. కుమారులు రాజవాహనుని నిమిత్తమున కొంతకాలము ఇడుమం బడియు, భాగ్యవశంబున అసాధారణపరాక్రమంబున దిగ్విజయము గావించి గొప్పరాజ్యములం బడసి పదునాఱు వత్సరములకు విజయుని రాజవాహనుని మున్నిడుకొని మరలి వచ్చి నీకును వసుమతికిని పాదాభివందనంబు సేసి నీయాజ్ఞను నెఱవేర్చువారు అగుదురు. కావున వారినిమిత్తము మీరేమియు సాహసము చేయఁగూడదు.'అని. ఆమాట విని అందఱి విశ్వాసముచేత ధైర్యమువలంబించి అప్పటినుండి నేనును దేవియు ప్రాణములను బిగఁబట్టుకొని యున్నాము. ఇప్పుడు, ఆగడువు సమీపింపఁగా వామదేవాశ్రమమునకుం బోయి విజ్ఞాపించితిమి.—'స్వామీ, తమరు చెప్పిన గడువు నిండినట్లే, వారివార్త యిప్పటికిని తెలియకున్నది.' అని. విని ముని వచించెను.—'రాజా, రాజవాహనుఁడు లోనుగా కుమారు లందఱును పలువురను జయింప నలవిగాని శత్రువులను జయించి దిగ్విజయము గావించి భూమండలమును వశముచేసికొని చంపానగరములో నొక్కెడ నున్నారు. నీయాజ్ఞాపత్త్రము నిచ్చి శీఘ్రముగా వారిం దెచ్చుటకు సేవకులం బంపుము' ఇట్లు ముని చెప్పగా నిన్నుం బిలుచుకొని వచ్చుటకై ఆజ్ఞాపత్త్రమును పంపినాఁడను. ఇంకను మీరు నిముసమయినను తామసము చేయుదురేని నన్నును మీతల్లిని వసుమతిని కథాశేషులనుగా విందురు. ఈమాట యెఱింగి మంచినీళ్లయినను చారి తరలిన పిమ్మటనే త్రాగవలయును.” అని. తేని యీయాజ్ఞను జౌదలం దాల్చి నవార్తై తరలుటకు కుమారులు సమకట్టిరి.

వశీకృతము లయిన రాజ్యములను రక్షించుటకు చాలినసైన్యములను సమర్థతరు లయిన యాప్తపురుషులను ఆయాతావుల నుంచి, ఒకపాటి దండుచే ద్వారికాపుచేయించి మునుపటి పగతుని మాళవరాజును మానసారుని ఓడించి, ఆరాజ్యమును కూడ స్వాధీనపఱుచుకొని, తమతమ యిల్లాండ్రతోఁగూడుకొన్నవారై వారిం గాపాడుటకు దండుతో కొందఱు

సుమంత్రులను నియోగించి మిగిలిన పరిమిత సైన్యసమేతులై వచ్చి రాజవాహనుని మున్నిడుకొని ఆతనితండ్రికి రాజహంసునికిని తల్లికి వసుమతీదేవికిని చరణాభివందనము గావించిరి. వారును కుమారుల రాకం బొంది పరమానందభరితులైరి. కుమారుల చరితములను తమ తమ పరాక్రమములం దెలుపు వానిని అతిదుర్ఘటముల నాకర్ణించి పరమానందంబుం బొందిరి. అంతట రాజు మునికి వినయముతో విన్నపము చేసి కొనెను.—' భగవానుఁడా, నీ ప్రసాదంబునం జేసి మేము మానవ మనోరథములకన్న నెక్కుడు అవాఙ్మనసగోచరం బయిన సుఖమును పొందినారము. ఇంక మీఁద నేను స్వామి పాదసన్నిధియందు వానప్రస్థాశ్రమముం బొంది ఆత్మసాధనమే చేయుట యుక్తము. కావున పుష్పపురమాళవ రాజ్యములకు రాజవాహను నభిషేకించి కడమ రాజ్యములను తొమ్మండుగురుకుమారులకును వారివారికి తగినట్లుగా ఇచ్చి, ఆకుమారులు రాజవాహనుని ఆజ్ఞను నేలు వేర్వేరు వారయి ఆతనిమతంబున వర్తించుచు నాలుగు సముద్రముల యొద్దాణము తోడి యీ ధాత్రిని శత్రునాశము చేసి యనుభవించునట్లుగా స్వామి అవధరింపవలయును.' అని. మునియు ఆ కార్యమును అట్లే సాధించుడు, రాజవాహనుఁడు తండ్రిరాజ్యమం దుండఁగా, కుమారులు ఆతని యాజ్ఞప్రకారము సర్వభూమండలమును న్యాయముగా పరిపాలించుచు తల్లిదండ్రుల కడకు రాకపోకలు గావించుచు ఒండొరులతో ఐకమత్యముతో వర్తిల్లుచు ఇంద్రాదులకు సయితము లభింపని రాజ్య సుఖములు అనుభవించుచు ఉండిరి.

వేదము వేంకటరాయశాస్త్రి విరచితము

దశకుమారచరితము

సంపూర్ణము.

---